# భారతి

సాహిత్య మాసపత్రిక

సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

డిసెంబరు 1957

సంపుటము 34 : : సంచిక 12

విడిపత్రిక వెల ఒక రూపాయి

# భారతి ముప్పదినాలుగవ సంపుటము

## అకారాది విషయ సూచిక

# విషయానుక్రమణిక

## డిసెంబరు 1957

# దివ్వెల మువ్వలు

శ్రీ సి. నారాయణరెడ్డి

కదలనేర్చినట్టి మట్టిగాదె నైన నా తనువున
సిరాపథము లంటి ప్రాకె చిత్రమైన కాంతిలహరి.

ఆధిభౌతికమ్మగు నా యీ దేహవితర్దిపైన
గజ్జెకట్టె నాధియాజ్ఞికమ్మగు రూపమ్మేదో ?

దివ్వెల మువ్వలతో నర్తించు జగన్మోహిని యది
ఆత్మకు మాత్రమె దృశ్య మ్మగు అక్షరవాహిని యది.

ఆయమ కేలుల వ్రేళులు అలలై పింపిళ్లుపోయి
కడిగివేసె నాలోపల విడిదిచేసిన తమస్సుల.

అపు డెగిసెను నా మనస్సు హావిరుద్గతధూమ మట్లు
అపుడు చేపె నాదు అంతరాత్మ కామధేనువట్లు.

బ్రహ్మాండము ప్రమిదవోలె భాసించెను; దానిలోన
స్నేహామృతవర్తి ప్రకాశించెను పరమాత్మలీల.

ఓ దివ్వెల మువ్వలదానా! దివ్యత్వనిధానా !
ఎల్లప్పుడు నాలో ఇటు లేల గజ్జె కదలించవు ?

వత్సరమున కొక్కమారు వచ్చి నన్ను పట్టి పిచ్చి
వానిగ జేసెద వేలా ? ఓ నా రోచిర్మాలా !

నీ వ్రేళుల తళత్తళలు నిత్యము కన్పించినచో
మాయాంధమ్మైన బ్రతుకు మహిత కాంతిగోళమ్మగు.

నీ మువ్వల ఘులంఘులలు నిత్యము విన్పించినచో
మృణ్మయమౌ యీ దేహము చిన్మయనాదాత్మకమగు.

# పేషంట్

శ్రీ మోహనసింహ సేంగర్

* హిందీరచనకు అనువాదం *

ధడాలున డాక్టరు మధు ఆఫీసు తలుపులు తెరుచుకున్నై. రొజుతూ నర్సు నళిని లోపలికి ప్రవేశించింది. తొందర తొందరగా విసురుగా పరుగెత్తుకుంటూ వచ్చిందేమో డాక్టరు మధు మేజాబల్లమీదకు తూలిపడింది. ఆకుగుపుకు టేబిలు కదిలింది. దానిమీద వున్న వస్తువు లన్నీ చిందరవందరైపోయినై. అప్పుడు డాక్టరు ఇంకో పేషెంటు రిపోర్టు పరీక్షిస్తున్నాడు. బల కదలటంతోటే ఒక్కసారి తలపైకెత్తి చూచాడు. ఎదురుగా నర్సు కళ్లు యింతవిచేసుకొని చూస్తూ నిల్చొని వుంది. ఆమె తొడుక్కున్న ఏప్రిన్ ముందు భాగంఅంతా రంగుకొట్టుకొనివుంది. అంతేకాకుండా ఆమె ముఖం నిండా మందుచుక్కలు పడివున్నై. డాక్టరు నళినిని ఇదంతా ఏమిటని ప్రశ్నించేలోగానే నళిని--"డాక్టరు గారూ, చూడండి, మీ ముద్దుల పేషెంటు ఏం చేసిందో"అని బిగ్గరగా అరిచింది.

"ముద్దుల పేషెంటా? ఎవరది? నువ్వు ఎవర్ని గురించి చెబుతున్నావో నాకర్థం కావటంలేదు?" అని డాక్టరు మధు విస్మయంతో అడిగాడు.

"ఎవర్ని గురించేమిటి? ముత్తైక్క తైతక్కలాడుతూ నోటికివచ్చినట్లు మాట్లాడుతూ వుంటుందే అది! పేరు పెట్టుకుంది చూడండి, రత్నం అని! పాపిష్టిది, ఎక్కడ నుంచో మాకు దాపురించింద!"

"ఓహో, అర్థమయిందిలే, ఆమేనా—"అంటూ తనకుర్చీలోనుంచి లేచాడు డాక్టరు. నళినివైపుకు వస్తూ— "ఏం జరిగిందేమిటి? ఇంతహడావుడిగా పరుగెత్తుకొచ్చావు? నీ వొళ్లంతా—?" అని డాక్టరు మధు మెల్లగా అడిగాడు.

"జరిగేదేమిటె నాతలకాయ? నేను ఆమె బెడ్ దగ్గరకు టెంపరేచరు చూద్దామని వెళ్ళాను. నా చేతిలోనుంచి థర్మామీటరు లాక్కుంది. దూరంగా విసిరి పారేసింది. బెడ్ ప్రక్క పీటమీదవున్న మంగుగాసును నాముఖంమీదకు విసిరికొట్టింది. పైగా మీదకురికి— "నేను నీముఖం చూడను. నీ మాడుముఖం చూపించకు, వెళ్లిపో యిక్కడనుంచి" అని కసిరికొట్టింది. సరే, ఇక మీరే ఆలోచించండి డాక్టరుగారూ! అది ఇట్లా ప్రవర్తిస్తూవుంటే..."అని అంది నళిని.

"ఏం బాగాలేదు ఈ ప్రవర్తన!" అని డాక్టరు మధు నళినిమాట పూర్తికాకుండానే ఆమె భుజం పట్టుకొని సానుభూతి ప్రకటిస్తూ—"ఈవిధంగా ఆమె అసభ్యంగా ప్రవర్తించినందుకు ఆమె నిన్ను క్షమాభిక్ష వేడుకోవాల్సిందే" అని అన్నాడు.

"క్షమాపణా! ఆమేనా అడిగేది?" అని మూతి తిప్పుకుంటూ వ్యంగ్యంగా అంది. "అయినా ఇంక మీ సానుభూతి, మీ పొగడ్తలు అక్కరలేదు లెండి డాక్టరుగారూ! నేను ఇవాళే ఇక్కడనుంచి మానుకుని వెళ్ళిపోదామని నిర్ణయించుకున్నాను" అని నళిని ఆవేశాన్ని అణుచుకుంటూ అంది.

"వెళ్లిపోదామని నిర్ణయించుకున్నావా! నా అనుజ్ఞ పొందకుండానే! నాతో ఏమాత్రం ఆలోచించకుండానే?" అని అన్నాడు డాక్టరు. అతని ముఖం గాంభీర్యాన్ని దాల్చింది. నర్సు నయనాలు డాక్టరు మధు ముఖాన్ని చూడలేకపోయినై. నేలనుచూస్తూ వున్నై. నళిని భుజాన్ని పట్టుకొని పదమని సంజ్ఞచేస్తూ డాక్టరు—"సరే, తర్వాత ఆలోచించుకుందాంలే. పద, పద. ముందు అక్కడకు వెళ్లి

అనువాదకులు: శ్రీ కొల్లిపర సౌభాగ్యరావు

చూద్దాం. అక్కడ రత్నం ఏం చేస్తూ వుందో! ఆమె పరిస్థితి ఎట్లా వుందో ఏమో?" అని అన్నాడు.

సమాధానం చెప్పకుండానే నళిని ఆయన్ను అనుకరించింది. వరండాలోనుంచి వనితల వార్డువైపు వెళుతూ—"నళినీ, నువ్వు ఈ శానిటోరియంకు హెడ్ నర్సువే కాదు. ఇక్కడి పేషంటు లందరకు తల్లివంటి దానివి. ఇంతే కాక నాకు కుడిభుజంలాంటి దానివి. నువు మానుకొని వెళ్ళిపోతే నా వంటి వృద్ధుడు వంటరిగా ఏం చేయగలడో చెప్పు? క్షయరోగులను మృత్యుముఖంనుంచి రక్షించి వాళ్ళను మళ్ళీ తమ జీవిత పథంలో పయనం చేయించడమంటే నాకు అమితానందం. ఈ ఆనందాన్ని నువ్వూ నాతోపాటు పాలు పంచుకుంటూవుంటే ఎంత బాగుంటుందంటావు! ఈ లోకంలో జీవించడానికి, సంపాదించుకోవడానికి నీకు అవకాశాలు ఎన్నో వున్నై. కాని నేను జీవించడానికి ఈ శానిటోరియంతప్ప ఇంకో మార్గమేదీ లేదు. నీవు నన్ను విడిచి వెళ్ళిపోతానని బెదిరించినప్పుడల్లా నా మనస్సెందుకో......"

"పొరపడ్డాను డాక్టరుగారూ." అని బ్రతిమాలుకుంటూ నళిని—"నన్ను క్షమించండి. ఇంకెన్నడూ మానుకు వెళ్ళిపోతాననే మాట అనను" అని అంది.

వార్డువైపు వెళుతూ డాక్టరు మధు క్రీగంట నళినిని ఒకసారి చూచి, చిరునవ్వు చిందించాడు ముఖంలో. నళిని కూడా నవ్వేసింది. పిమ్మట ఆమె—"నా మాటొకటి తమరు తప్పక అంగీకరించాలి. సరేనంటే చెప్తాను" అని అంది.

"అదేమిటి?"

"ఏమిటేముంది. రత్నాన్ని వీలయినంత తొందరగా పిచ్చాసుపత్రిలో ప్రవేశపెట్టించాలి. క్షయరోగం కంటె ఆమెలో ఉన్మాదం ఎక్కువగా వుంది. పిచ్చి పిచ్చిగా ప్రలాపిస్తూ వుంటుంది. ఆమె పిచ్చికేకలకు ఇతర రోగుల ఆరోగ్యం కూడా చెడిపోవచ్చు.

డాక్టరు మధు సమాధానం చెప్పకుండా మౌనంగా వూరుకున్నాడు. ఆయన వదనంలో వ్యక్తమయ్యే గభీరతను చూచి నళినికి మరోమాట మాట్లాడడానికి ధైర్యం చాలలేదు. మౌనంగా ఇద్దరూ ముందుకు వెళుతూనే వున్నారు.

రత్నం బెడ్ దగ్గరకు వెళ్లి డాక్టరు మధు మెల్లగా, అనునయంగా "ఇవాళ ఒంట్లో ఎట్లా వుందమ్మా?" అని అడిగాడు.

"పళ్లు పటపట కొరుకుతూ, కండ్లురిమి డాక్టరు మధును చూస్తూ రత్నం—"మళ్ళీ మొదలు పెట్టావూ అమ్మా అని, అమ్మాలేదు నాన్నాలేదు ఈ ప్రపంచంలో ఎవరి కెవరు? ఇంక ఎప్పుడూ అమ్మా అని అనకు. నేను నీకు బిడ్డనూ కాదు, నీవు నాకు తండ్రివీ కావు" అని అంది.

డాక్టరు మధు ఆమెకు దగ్గరగాచేరి సానునయంగా—"రత్నం, నేను నీకు స్వంత తండ్రిని కాకపోతే యేం? వయస్సులో నీ తండ్రికంటె పెద్దవాడినే అయివుంటాను. నాకూ ఒక ముద్దులపట్టి కల్గింది. బిడ్డను ప్రసవించిన అనంతరం తల్లి పరలోకగతురాలైంది. కొన్ని గంటల్లోనే నా చిన్నారి తనయకూడా మరణించింది. బ్రతికివుంటే ఆమెకూడ ఇప్పటికి నీయంత దయ్యేది" అని కన్నుల నీరు కుక్కుకున్నాడు.

"అదా, అయితే ఆమె చచ్చిపోయిందా!" అని బిగరగా నవ్వి—"అటయితే నువు చాలా అదృష్టవంతుడవు డాక్టర్, నీకూతురూ నీకంటె అదృష్టవంతురాలవే అవాలి. ఈ లోకంలో ఆడపిల్లలకు జరిగే అవమానాలనూ, అపనిందలనూ అనుభవించకుండా; దురాచారాలకు, బలత్కారాలకు బలికాకుండా స్వర్గధామం చేరుకుంది. ఆమె నొసటన గీసిన అదృష్ట రేఖ నా నొసటన కూడ విధాత లిఖిస్తే ఎంత బాగుండేది. కాని ఈ పడతుల పాలిటి అదృష్ట దేవతలు పురుషులనబడే పశువులు, కామోద్రేకులు..." అని ఆఖరు వాక్యం పూర్తిగా అనకుండానే రత్నం కోపంతో క్రింది పెదవిని కొరుక్కుంటూ వెక్కి వెక్కి ఏడ్వ సాగింది.

"తల్లీ, ఏమిటీ పని? వివేకాన్ని విడనాడకు. కొంచెం ఓర్పు వహించు" అని డాక్టరు మధు బ్రతిమాలుతూ అన్నాడు.

"మళ్ళీ తల్లీ, అని పిల్చావూ?" అని ఒక్కసారిగా డాక్టరు మధువైపు తల త్రిప్పి జలజల కన్నీరు కారే కళ్ళతో తీక్షణంగా చూచింది రత్నం. పిమ్మట పళ్ళు పటపటమని కొరుకుతూ—'నువు నాకు తండ్రివే! బాగానే వుంది" అని అంది.

డాక్టరు మధు వెనుక నిల్చొనివున్న నళినిని చూచి రౌద్రరూపంలో బిగరగా—"ఈ నర్సు

నిల్చోని ఎందుకిట్లా నావంక చూస్తుంది? ఇక్కడ ఏదన్నా కత్తిగాని, చాకుగాని వుంటే నాకివ్వు. దీని రక్తం త్రాగాలి. ఈ నీచురాల్ని ముక్కలు ముక్కలుగా నరికి కాకులకు, గ్రద్దలకు పంచిపెడతాను" అని అరిచింది.

నళిని రత్నం ముఖభంగిమ చూచి వణికిపోయింది. డాక్టరు మధు ముఖంకూడ వెలవెలబోయింది. గప్‌చిప్‌గా డాక్టరు ఆమె ముఖం తిలకిస్తున్నాడు రత్నం జుత్తు చెరిగిపోయింది. ముఖంమీద కన్నీరు చారికలు కట్టినై. నీరసంగా, పాలిపోయిన ఆమె ముఖం ఇప్పుడు కాళికామూర్తివలె రౌద్రరూపం దాల్చింది.

డాక్టరు మధును మౌనంగా తనవంక రెప్పవాల్చకుండా చూడటం చూచి రత్నం కన్నులు ఎఱ్ఱబారినై. కోపంతో తన్నుతాను సంబాళించుకోలేక నాగుబాము విషం కక్కినట్లుగా—"నన్ను మ్రింగివేయాలన్నట్లు గుడ్లు మిటకరించుకు చూస్తున్నావే. నువ్వేనా నాకు తండ్రివి! పాపాత్ముడా, నీచుడా, పరమలోభి ఇంకా నీతృష్ణ తీరలేదా" అని అంది.

ఆమె ప్రలాపం, చేష్టలు చూస్తే పిచ్చెక్కిన దానివలె వుందని మనస్సులో డాక్టరు మధు అనుకున్నాడు. ఆమెను పలకరిస్తూ వున్నకొద్దీ రెచ్చిపోతూ వుంటుంది. రెచ్చగొట్టటం మంచిది కాదని భావించి అక్కడనుంచి వెళ్ళిపోదామని కాలు కదిల్చాడు. వెంటనే రత్నం డాక్టరు కోటు కొంగు పట్టుకు లాగి తన బెడ్ మీద కూర్చోబెట్టింది. ఆయన వక్షస్థలం మీద శిరస్సువానించి వెక్కి వెక్కి ఏడ్వజొచ్చింది. ఏడుస్తూనే—"నన్ను క్షమించండి, ఆవేశంలో అనరాని మాటలన్నీ అనేశాను. ఇందుకు మీదీ కొంత తప్పుంది. అనవుసరంగా మీరు నన్ను కుమార్తెవని, మీరు నాకు తండ్రి నని అనటం ప్రారంభించారు. నా తండ్రి పరమనీచుడు, పరమలోభి, నరరాక్షసుడన్నా తప్పులేదేమో అనుకుంటాను. మీరు నా తండ్రివంటె వారు కారు. దైవ సమానులు. నేనా పతితురాలను. నావంటి పతితకు దైవతుల్యులయిన మీవంటివారి కుమార్తెననిపించుకునే అధికారమేముంది?" అని అంది.

"కుమార్తె కాకపోవడమేమిటి? నీవు నా బిడ్డవే తల్లీ" అని అంటూ డాక్టరు మధు ప్రేమ పురస్సరంగా రత్నం తల నిమురుతూ ఆమె దుఃఖాన్ని శాంతింపజేస్తూ, జేబులోనుంచి రుమాలుతీసి ఆమె కన్నులవెంట కారే కన్నీటిని తుడువ సాగాడు.

ప్రస్తుత వాతావరణంలోని ప్రశాంతత చూచింది నళిని. రత్నం బెడ్‌కు దగ్గరగావచ్చి నిల్చుంది. రత్నంలో కల్గిన ఈ మార్పు ఆమెను చకితురాలను జేసింది. వెంటనే ఆమెలో ఇంతవరకూ రగులుకొంటూవున్న క్రోధం—కర్పూరం హరించుకుపోయిన చందంగా - మాయమైపోయింది. రత్నంమీద ఆమె మనస్సులో దయ, సానుభూతి ఉత్పన్నమయింది. ఇంతలో రత్నం నళిని ధరించిన 'ఎప్రిన్' పట్టుకొని ఆమెను తన బెడ్ దగ్గరకు లాక్కుంది. ఆమె నడుమును రెండు చేతులతో చుట్టి ఆమె దయాభిక్షనపేక్షించే స్వరంతో—"నన్ను క్షమించు సోదరీ! ఉద్రేకం వచ్చినప్పుడు ఏం మాట్లాడుతున్నానో, ఏం చేస్తున్నానో, నాకే అర్థం కావటంలేదు. నిన్ను నేను అవమానపరచి వున్నట్లయితే అదంతా మర్చిపో" అని బ్రతిమాలుకుంది.

"నళినీ నా మనస్సులో మాటొకటి చెబుతాను. శ్రద్ధగా విను. నిన్ను చూచినప్పటినుంచి నా మనస్సు ఎందుకో బాధగాను, వ్యాకులంగానూ వుంది. నీ సౌందర్యంకూడ నాకు కల్గిన విపత్తునే నీకూ తెచ్చిపెడుతుందేమోనన్న భయం వేస్తోంది. అందువల్ల ఎన్నాళ్ళనుంచో అందాలుచిందే నీ ముఖంమీద మంగునే కాదు, నీ సౌందర్యాన్ని వికృతపరచే ద్రావకాన్ని పోయాలనిపించింది. దాంతో నీ సుందరముఖం వికృతిమైపోతుంది. కురూపివైపోతావు. అంద విహీనవై ఆకర్షించలేవెవర్నీ. నాలో రేగిన ఈ భావం నీ మీద ఈర్ష్యవల్ల కాదు. తరిచి ఆలోచిస్తే నీకే సత్యం బోధపడుతుంది. మన మహిళాలోకమంతా సౌందర్యం 'స్త్రీ'కి సుగుణము, శృంగారమూ అని భావిస్తుంది. కాని సౌందర్యం 'స్త్రీ'కి శత్రువు. అంతేకాదు విపత్సముద్రంలోముంచే విరోధికూడ."

"సోదరీ నీ మాటలు వింటూవుంటే, వాటిలో కొంతసత్యం వున్నట్లే తోస్తూవుంది." అని ఆమెను కౌగలించుకొని విచారవదనంతో నళిని అంది.

* * *

నళిని మామూలుగా రోజూ వచ్చినట్లే రత్నం దగ్గరకు వచ్చింది. అప్పుడు రత్నం ముకుళించుకు

పోయిన ముఖంతో విచారంగా కూర్చుంది. దేన్ని గురించో ఆలోచిస్తూ వున్నట్లు కన్పించింది. ఆమెను పల్కరించి ప్రసన్నురాల్ని చేయాలని నళిని తన ముఖంలో నవ్వుల వన్నెలకాయిస్తూ—"ఏం సోదరీ, ఇవాళ ఒంట్లో ఎట్లావుంది? మనస్సేం బాగాలేదా? ఒక్కసారి అటు ప్రకృతిని చూడు. వింత సోయగాన్ని వెదజల్లుతూవుంది. ఆ నీరెండచూడు. ఆ నీరెండలో మంచుతో ఆవరించుకొన్న పర్వతశిఖరాలు బంగారు కిరీటాల్ని ధరించినట్లు ఎలా మెరుస్తూ వున్నై. ఈ ఉద్యానవన సౌందర్యం, ఇందులోనుంచి వచ్చే శీతల మందపవనం..." అని అంటూ వుండగా.

"సరే చాల్లే, ఇక నీవాగుడు చాలించు, నళినీ" అని ఆమె మాటను మధ్యలోనే కత్తిరించి రత్నం రోషంతో—"ప్రకృతి బాగుందా? బాగుంటే బతుకు పోయి చావరాదూ, నాదగ్గర కెందుకొచ్చినట్లూ, పాపిష్టిదానా పో" అని గద్దిస్తూ అంది.

నళిని ఆవేశాన్ని అణచుకుంది. అకస్మాత్తుగా ఇవాళ మళ్ళీ రత్నంలో వ్యక్తమైన వికృతవికారానికి కారణమేమిటో నళిని ఊహించలేకపోయింది. రత్నం ప్రవర్తనలో కల్గిన ఊహాతీతమయిన పరివర్తనానికి ఏర్పడ్డ అవాంతరం ఏమిటని ఆమెను నళిని అడగటానికి వెనుకంజవేసింది. టెంపరేచరు చూడడానికి తీసిన థర్మామీటరునుకూడ ఆమెకు అందించడానికి సాహసించలేకపోయింది. అది నళిని చేతిలోనే ఉండి పోయింది. ఇప్పుడు ఏమి చేయటమా అన్నది నిశ్చయించుకోలేకపోయింది. నళిని ఔదాసీన్యాన్ని చూచి రత్నం ప్రేమ నొలకబోస్తూ—"నళినీ, సరేకాని నాకొకమాట చెప్పు. నువ్వు, డాక్టరు, ఇద్దరూ ఎందుకు నాకోసం వృథాగా శ్రమపడడం, సమయం దుర్వినియోగం చేసుకోవడం, ధనం వెచ్చించుకోవడం. రోగికి రోగం నయం చేయించుకోవాలనే అభిలాష లేదు, జీవించాలని తృణమాత్రమయినా తృష్ణ లేదు. అట్లాంటి జీవికి విశ్వప్రయత్నం చేసి బలవంతంగా జీవంపోసి మీరు సాధించేదేమిటి?" అని అంది.

నళిని జవాబు చెప్పబోతోంది. ఇంతలో వెనుకనుంచి "నళినీ, నళినీ ఒకసారి ఇటురా" అని అంటూ కేక వినిపించింది.

నళిని వెనక్కు తిరిగి చూచింది. చేతో ఒక కవరు పట్టుకొని డాక్టరు మధు నిల్చున్నాడు. నళిని రెక్కలు కట్టుకొని ఒక్కసారిగా ఆయన దగరే వాలింది—"ఏమిటి డాక్టరుగారూ? ఏమిటి సంగతి?" అని ఆతురతగా అడిగింది.

డాక్టరు మధు ఆమె చెవిదగ్గర నోరుపెట్టి మెల్లగా—"ఇవాళ రత్నం ఆరోగ్యం ఎట్లా వుంది?" అని అడిగాడు.

"ఆరోగ్యంమాట దేవుడెరుగు"—అని అయిష్టంగా చేతులు త్రిప్పుకుంటూ నళిని "రత్నం 'మూడ్' ఇవాళ సరిగ్గా లేదు, ఏందుచేతో, ఏమో?"నని చెప్పింది.

"ఆఁ, అట్లనా"—అని అంటూ డాక్టరు ముఖం గాంభీర్యాన్ని తాల్చింది.

"ఏం, ఏమిటూ సంగతి?" అని నళిని అడిగింది.

"ఆమె పేర ఒక టెలిగ్రాం వచ్చింది."

"టెలిగ్రామా! ఎక్కడ నుంచొచ్చింది? దాంట్లో ఏం వ్రాసుంది?"

"నేను ఆకవరు విప్పి చదవలేదు. చదవడం మంచిది కాదనుకున్నా."

"ఇన్నాళ్ళనుంచీ ఆమెకు ఒక ఉత్తరంకూడ వచ్చిన పాపాన పోలేదే. అకస్మాత్తుగా ఇవాళ ఆకాశాన్నుంచి ఊడిపడ్డట్టు వచ్చిందే ఈ టెలిగ్రాం! ఎవరిదయితే నేం? ఎక్కడనుంచి వస్తే నేం? ఇచ్చెయ్యండి ఆమెకు."

ఇంతలో తలపైకెత్తి రత్నం గొంతెంబిగరగా—"డాక్టరుగారూ, ఏమిటూ గుసగుసలు" అని కేకపెట్టి పిల్చింది.

డాక్టరు మధు అడుగులలో అడుగులు వేసుకుంటూ రత్నం దగ్గరకువచ్చి కవరు చేతికందించాడు. "నీ పేరుతో ఈ టెలిగ్రాం వచ్చిందని" అన్నాడు.

"టెలిగ్రాం!" — రత్నం ఒక్కక్షణకాలం డాక్టరు మధు చేతిలోవున్న కవరువంక భయ విహ్వలతతో చూచింది. కంపిస్తున్న హస్తాలతో అందుకొని కవరు చించింది. దానిలోనుంచి కాగితం తీసి సమాచారం చదివేసింది. వెంటనే ఆనందంతో ఒక్కగంతు గెంతింది. —"అబ్బా! ఆఖరుకు అతను చచ్చిపోయాడూ! మంచిపని జరిగింది! చాల బాగుంది! డాక్టరుగారూ! ఈరోజు నాకెంతో ఆనందంగావుంది. ఈ ఆనందసమయంలో నావద్దనే గనక

డబ్బుంటే మీకు కోరుకున్న బహుమతి నిచ్చేదాన్ని. ఇక నా ఆరోగ్యం బాగుపడుతుంది, డాక్టరుగారూ మీ మందులు, గింజులు నాకవసరంలేదు. అవేం లేకుండానే నా జబ్బు నయమవుతుంది. మీరు ఇక నిశ్చింతగా, నిర్భయంగా వుండండి" అని అంది.

డాక్టరు మధుకు రత్నం మాటలన్నీ వింతగా కన్పించినై. ఆయనకేమీ బోధపడటంలేదు. ఆయోమయంగా రత్నం ముఖంవంక తీక్షణంగా చూడసాగాడు. రత్నం టెలిగ్రాంను డాక్టరుకు అందించి— "నా మొగంవంక అట్లా చూస్తారెందుకు, ఈ టెలిగ్రాం చదవండి" అని అంది.

డాక్టరు మధు ఆమె చేతిలోనుంచి టెలిగ్రాం తీసుకొని చదివాడు. అందులో — "క్రిందటి శుక్రవారం జమీందారు బొంబాయిలో ఆస్పత్రిలో మరణించాడు' అని వుంది. జమీందారా! డాక్టరు మధు విస్తుపోయాడు. అనాథ, అసహాయురాలు అని శానిటోరియంలో ఆశ్రయమిచ్చిన రత్నం జమీందారు భార్యా! ఈ ఆలోచనతో డాక్టరు మధు నోటివెంట మాట పెగలలేదు. కన్నార్తి ఒకసారి రత్నంవంక విస్మయ దృక్కులతో చూచాడు. జాలిగొల్పే ఆమె కళ్లు జల జల కన్నీరు రాల్చినై. డాక్టరు మధు హస్తాల్ని తన రెండుచేతుల్తో పట్టుకొని రత్నం —"డాక్టరుగారూ, నేను నా వాస్తవ పరిస్థితిని దాచిపుచ్చి మీకు అబద్ధాలు చెప్పాను. ఇన్నాళ్లూ మిమ్మల్ని మోసగించాను. అందుకు నేను ఏవిధంగా క్షమాభిక్ష కోరుకోవాలో తెలియకుండావుంది. నేను ఇట్లా మోసంచేయడానికి అనుకూలించిన పరిస్థితులను గురించి వివరంగా చెప్తే, మీరు నన్ను క్షమిస్తారని భావిస్తాను" అని అంది.

డాక్టరు మధు ఏం మాట్లాడలేదు. రెప్పవాల్చకుండా ఆమెవంక చూస్తూనే వున్నాడు. రత్నం చీరకొంగుతో కన్నీటిని తుడుచుకొని డాక్టరు మధును బెడ్‌మీద ఒకప్రక్కన కూర్చోమని సంజ్ఞచేసి— "మీరొక్కనిమిషం కూర్చోండి. నా వాస్తవ పరిస్థితి వంతా విడమర్చి చెబుతాను" అని అంటూ నళినినికూడ దగ్గరకుపిల్చి... "సోదరీ! నువ్వుకూడ ఇట్లా వచ్చికూర్చో. మీ ఇద్దరికీ నా కరుణాపూరిత గాథనంతా పూస గ్రుచ్చినట్లు దాపరికం లేకుండా చెబుతాను. దీనితో నయినా నామనస్సు తేలికపడుతుంది, కుదుటపడుతుంది" అని దీనంగా అంది.

డాక్టరు మధు మౌనంగా బెడ్‌కు ఒక అంచున కూర్చున్నాడు. నళిని ఎదురుగా వున్న స్టూలుమీద కూర్చుంది. రత్నం తన దుఃఖభరితమైనకథ చెప్పటం ప్రారంభించింది.—"మా ఇంటిప్రక్కనే ఒక యువకుడున్నాడు. సుందరుడు, గుణవంతుడు. అతన్ని ప్రేమించాను. అతనూ నన్ను గాఢంగా ప్రేమించాడు. ఇద్దరం పెళ్ళిచేసుకుందామని ప్రతిజ్ఞ చేసుకున్నాం. నా అందచందాలనుగురించి జమీందారు తెలుసుకున్నాడు. ఆయన నా తండ్రిని పిలిపించాడు. కావలసినంత డబ్బిస్తానన్నాడు, భూములు వ్రాసిస్తానన్నాడు ఉన్నతోద్యోగం యిప్పిస్తానని ప్రలోభపెట్టాడు. మొదటనుంచీ నా తండ్రి ఆర్థిక యిబ్బందులతో సతమతమవుతూ బాధపడుతున్నాడు. అందుకని జమీందారుగారి ప్రలోభంలో చిక్కుకుపోయాడు. ఆయన కోరికను కాదనలేకపోయాడు. అప్పుడు ఆయనకు తన ఆర్థిక యిబ్బందులు చక్కజేసుకోవడమే కాదు, తన కూతురు జమీందారిణి అవుతుందని, కుటుంబగౌరవం పెరుగుతుందని, వంశం వన్నెకెక్కుతుందని, భవిష్యత్తు బ్రహ్మాండంగా వుంటుందని ఆయన ఊహ. వెంటనే వివాహం చేసేశాడు. నాపై ఆశలు, అపేక్షలు పెట్టుకు కూర్చున్న ప్రభాకరు చేతులు ముడుచుకు కూర్చోవలసి వచ్చింది. దుఃఖాన్ని దిగ్రమింగలేక జీవచ్ఛవం అయిపోయాడు. మా యిద్దరినీ కలుసుకోనివ్వలేదెవ్వరూ. వివాహానంతరం కొంతకాలం నన్ను ప్రేమించిన ప్రియుడు నా మనస్సులో మెదులుతూ నేవున్నాడు. కాని అడుగడుగుకు ఆనందాన్ని ప్రసాదించే జమీందారుగారి ఆ ప్రాసాదాల్లో వుంటూ అతన్ని విస్మరించాను. అంతేకాదు నన్ను నేనే మరచిపోయాను.

ఆ ప్రాసాదంలో జరిగే వాస్తవ విషయాల పరిజ్ఞానం క్రమేపి తెలుస్తూవచ్చింది. సత్యం వ్యక్తమౌతున్నకొద్దీ నాకళ్ళు తెరిపిన పడినై. కాముకుడు, త్రాగుబోతూ అయిన జమీందారు నా శీలాన్ని సర్వనాశనం చేశాడు. జమీందారుకోసం నిత్యమూ నవయువతులు వస్తూవుండేవారు. నన్ను వివాహమాడక పూర్వంకూడ వీళ్ళు వస్తూనేవుండేవారట. వివాహమైన తర్వాతకూడ వస్తూనేవున్నారు. ఈ సంగతులు నాకు తెలియకుండా వుండటానికి కట్టుదిట్టాలు చేశారు. నాకు ఇంకో అయి

# పేషంట్

ముగురు సవతులున్నారు. ఒక వందదాకా వుంపుడు కత్తెలున్నారు. ఈ విషయం నాకు వివాహానంతరం తెలిసింది. వీళ్ళందరికీ కూడ నాకు పట్టినగతే పట్టింది. అబలను నేనేం చేయగలను? జమీందారుగారి నవుకర్ల పహారాలోనుంచి పారిపోవటం సాధ్యమయ్యే సులువైన పనేంకాదు. ప్రభుత్వం జమీందారుగారి జమీనంతటిని కలిపివేసుకుంది. వారికి పాలీనా కొంత డబ్బు స్వంత ఖర్చులకు ఇస్తూవుంది. విచ్చలవిడిగా, విలాసంగా తిరగటానికి తగినంత డబ్బు జమీందారు దగ్గర లేదు. పాపం యేంచేస్తాడు. మమ్మల్నందరినీ కుక్కల కంటె కనాకష్టంగా తరిమివేశాడు. ఈ శానిటోరియం వెనుక ప్రక్క రోడ్డులో నేను ఏ పరిస్థితిలో మీకు దొరికానో మీకు తెలిసిన సంగతే. ఆస్థితిలో నేను నా నా సవ చరిత్ర నెట్లా చెప్పుకోగలనో మీరే ఊహించండి.

"నువు మానవతి వమ్మా, నువు నాతినయావు. రత్నం ఇంతకుమించిన పరిచయం నాకు అప్పుడూ అవసరం లేదు, ఇప్పుడూ అక్కర లేదు" అని డాక్టరు సానుభూతిగా అన్నాడు.

"కాదు, కాదు, నేను మానవతిని కాదు డాక్టరు గారూ"—అని రత్నం వలవల విలపిస్తూ—"ఒకప్పుడెప్పుడో మానవతి నేకావచ్చు. కాని ఆమె మరణించింది. ఇప్పటికీ కూడ ఎంతో మంది అబలల ఆర్తనాదాలు నా కర్ణపుటాలను పగులగొడుతూనే వుంటై. ఆనాడు నాగది ప్రక్కనే ఎంతమంది అభాగినులు ఆ నరరాక్షసుని బలాత్కారాలకు బలియైనారో నా మనోనేత్రాలకు సినిమా బొమ్మలవలె కనిపిస్తూ వుంటాయి. ఈ దుష్కృత్యాలను చూడకుండా, దురాచారాలను వినకుండా నేను ఈలోకాన్ని విడనాడిపోయినట్లయితే ఎంత బాగుండేది డాక్టరుగారూ" అని అంది.

"నిన్నొక నూతన జీవితం ఆహ్వానిస్తూ వుండడంవల్ల ఆపని జరగలేదమ్మా. మరణించడం మానవధర్మం కాదు. మరణించాలని ఆత్మహత్య చేసుకోవడం మహాపాతకం. మానవుడు జీవించి తోటి మానవులకు సహాయ, సత్కార్యాలు చేయడమే మానవధర్మం" అని డాక్టరు మధు టెలిగ్రాం కాగితాన్ని నలిపివేసి తుక్కుబుట్టలో పారేశాడు. చేతిగడియారంలో టయిము చూచుకొని "నేను వెళ్తాను. ఇంకా చాలా పనులున్నై. నువ్వు యిక నిద్రపోవమ్మా" అని బుజ్జగింపుగా అన్నాడు.

డాక్టరు మధు తన ఆఫీసుకు వెళ్ళిపోయాడు. రత్నం ఆవెళ్ళే డాక్టరు పాదాల వంక రెప్పవాల్చక మౌనంగా చూస్తూ కూర్చుంది.

* * *

వచ్చిన వ్యక్తిని ఆపాదమస్తకం ఒక్కసారి తీవ్రంగా చూచి డాక్టరుమధు—"ప్రభాకర్ బాబూ, రత్నం ఇక్కడున్నదని నీకెట్లా తెలిసింది?" అని అడిగాడు.

"ఇప్పుడు అనవసర ప్రసంగంతో వృథా కాలయాపన ఎందుకు చేస్తారు డాక్టరుగారూ? అన్వేషకులకు అచూకీయే చిక్కదంటారా!"

"ఈ అన్వేషణ కేవలం ఏకపక్షానికి సంబంధించినదే ప్రభాకర్"—అని డాక్టరుమధు ముసిముసినవ్వులు నవ్వుతూ..."రత్నం ఎన్నడూ నిన్ను వెదకించాలని ప్రయత్నం చేయనయినా లేదు. కనీసం నీ పేరయినా ఉచ్చరించి ఎరుగదు. ఈస్థితిలో ఆమె నీతో రావడానికి సిద్ధపడుతుందని నీవు ఎట్లా వూహించావు?" అని అన్నాడు.

"నాతో రాకపోయినాసరే, కాని ఆమెనొక్కసారి పిలిపించి అడిగి చూడండి"

"కేవలం అడగడం అయితే ఒక్కసారేం కర్మం వందసార్లు అడుగుతాను. పూర్వస్మృతులు జ్ఞప్తిచేస్తే ఆమెకు పిచ్చియెక్కే ప్రమాదంవుంది. ఈ సంగతి నువ్వు గ్రహించడంలేదు. ఎన్నోకష్టాలుపడి, ఎన్నో చికిత్సలుచేసి ఆమె నిప్పుడొక మనిషిగా చేయగలిగాను. ఆమె మనస్సులో గతించిన జీవితగాథ కలుక్కుమనకుండా వుండేటట్లు ఆమెకు ఒక్క క్షణమయినా తీరిక లేకుండా పని కల్పించి పని చేయిస్తున్నాను"

"ఆమెతో నన్ను కలిసి మాట్లాడనివ్వరు, నా విషయం ఆమెతో చెప్పనన్నా చెప్పరు. ఇందులో మీ అభిప్రాయం ఏమిటో బోధపడటంలేదు డాక్టర్" అని ప్రభాకర్ ఆవేశంతో అడిగాడు. కుర్చీలోనుంచి లేచి గదిలో యిటు నటూ పచారుచేయడం సాగించాడు. మళ్లీ—డాక్టర్ మీరు మంచివారు కావచ్చు, అనుభవజ్ఞులు కావచ్చు. కాని మానవమాత్రులు కారు. మీ...మీ...మీది హృదయంకాదు. నల్లరాతిబండ. మీ జీవితంలో, ఎవర్నయినా ఎన్నడయినా ప్రేమించారా?" అని అడిగాడు.

"లేదు, అందుకనే ప్రేమికుల పిచ్చిచేష్టలు చూస్తూవుంటే నాకు నవ్వు వస్తుంది." అని డాక్టరు మధు చిరునవ్వు నవ్వి సహజధోరణిలో అన్నాడు.

"ఈ విధంగా వ్యంగ్యంగా అనడానికి, నవ్వడానికి మీకేం అధికారంవుంది. కేవలం పెద్దవారూ, వృద్ధులు అయినా" అని ప్రభాకర్ గద్దిస్తూ అన్నాడు.

"కాదు"—అని దృఢంగా డాక్టరు మధు—"నేను ప్రేమరోగిని కాకపోయినందువల్లనే, ప్రేమ పిచ్చిలోపడి పతమతమవుతున్న రోగులకు ఎంతో నేర్పుగా చికిత్స చేయగలుగుతున్నాను" అని అన్నాడు.

ఈ సారి ప్రభాకర్ వ్యంగ్యంగా నవ్వేశాడు.-"మీరు విచిత్రవ్యక్తులే నే. మా ఇద్దరిమధ్యా నిలబెట్టని అడ్డుగోడగా అడ్డు వస్తున్నారే. ఈ అధికారం మీకెవరిచ్చారు?" అని అన్నాడు.

"అధికారాలన్నీ నా కున్నై. నేను రత్నం తండ్రిని ప్రభాకర్! ఏ తండ్రిఅయినా అనుభవ రహితుడైన యువకుని మాటలను విని మృత్యుముఖం నుంచి కాపాడుకున్న కుమార్తెను త్యజించగలడా?"

భలే, భలే బాగుంది. ఇప్పుడిక్కడ త్యజించడం అనే ప్రశ్నే బయలేరదే? మేమిద్దరం బాల్యం నుంచీ ఒకర్నొకరు ప్రేమించుకున్నాం. అప్పుడు ఆ జమీందారు అడ్డువచ్చాడు. ఇప్పుడు మీరు అడ్డు పడుతున్నారు. ఈ అడ్డులు లేకపోతే మేమీపాటికి వివాహమాడి సుఖంగా వుండేవాళ్లం."

"ప్రభాకర్, పూర్వపు సంగతులన్నీ మరిచిపో. ఇప్పుడు నువ్వు రత్నాన్ని ప్రేమిస్తున్నావని, వివాహమనే నెపంతో మళ్లీ ఆమెజీవితాన్ని నష్ట, కష్టాల పాలు చేయవని నే నెట్లా నమ్మటం?"

"అట్లనా!" అని రెండుచేతులూ నులుము కుంటూ ప్రభాకర్—"నేను చదువు కొన్న వాడిని. అందగాడను ఆరోగ్యవంతుణ్ణి. ఉద్యోగం చేస్తున్న యువకుణ్ణని చెప్పనే చెప్పాను. వివాహమే చేసుకోదలచినట్లయితే అందంగల ఆడపిల్లలు, సుగుణాలప్రోవు లనదగిన సుదతులు, చక్కగా చదువుకొన్న సుందరాంగనలకు కొదువేమిటి నాకు? కాని నామనస్సు రత్నంమీద లగ్నమయింది. నేనామెను ఎంతగా ప్రేమిస్తున్నానో ప్రదర్శించాలంటే—ఆనాడు హనుమంతుడు గుండెలు చీల్చి శ్రీరాముణ్ని చూపించిన చందంగా—ఇప్పుడు నేను నాగుండెలు చీల్చి ప్రదర్శించలేను. అయినా మీరు రత్నాన్నొకసారి పిలిచి అడిగి చూడండి. మీ కెంతయినా పుణ్యముంటుంది.

"సరే"—నని డాక్టరు మధు కాలింగ్ బెల్ మ్రోగించబోయాడు. ఇంతలో రత్నం గదిలోకి వచ్చింది. తలవంచుకునే—"నేను బయటనుంచి మీ సంభాషణ అంతా విన్నాను ప్రభాకర్. ఇప్పుడు నన్ను మళ్ళీ నువ్వు ఈమాయాప్రపంచంలోకి ఈడ్వకు. వట్టి అమాయకుడవు కావద్దు. నీవు ప్రేమించే రత్నం ఏనాడో చచ్చిపోయింది. ఇప్పుడు జీవచ్ఛవం లాంటి ఈ కంకాళాన్ని తీసుకుపోయి ఏం సుఖపడతావు?" అని అంది.

"రత్నం, ప్రేమ జ్యోతితో జీవితపు దివ్వెను వెలిగించి మళ్లీ జీవంపోస్తాను. ఈనాటికీ నీవు నాకు ఆ పూర్వపు రత్నానివే. నేను నీ శరీరాన్ని, యౌవనాన్ని ప్రేమించలేదు. నీ పవిత్రహృదయాన్ని ప్రేమించాను. అది ఎన్నో నష్టకష్టాలు సహించింది. కఠోర పరీక్షలకు గురియై రాటుదేలింది. ఆ నిగ్గుదేలిన హృదయాన్నే ప్రేమిస్తున్నాను బాహ్య శరీరం వడిలిపోయిందనే దుఃఖం నాకు లేనేలేదు. ఇక ముందుండదు. రత్నం నామాటల్ని నమ్ము"

"ప్రభాకర్, నా జీవితపుబాట మారింది. నా ప్రాణప్రదాతయగు ఈ తండ్రికి మాటయిచ్చాను. ఆయనచేసిన ఉపకారానికి ప్రత్యుపకారంగా నా ఈ జీవితాన్నంతా క్షయరోగులకు శుశ్రూష చేయడంలో గడుపుతాను. ఇదే నా నిశ్చయం."

"అయితే ఇటు నావంకొకసారి తలఎత్తి చూస్తూ నీ మనస్సులో నా కేమూలా స్థానమున్నది లేదని, నాకూ నీకూ ఇక ఏవిధమయిన సంబంధం లేదని, నీకు గాను నేను చనిపోయినట్లేనని చెప్పు. అంతే, మారుమాట్లాడకుండా యిక్కడనుంచి వెళ్ళి పోతాను."

"రత్నం ఏమీ సమాధానం చెప్పలేక పోయింది. ఆమెకళ్ళు జలజల కన్నీరురాల్చినై. ప్రభాకర్ ఒక్కక్షణకాలం ఆమెవైపు చూచాడు. పిమ్మట కుర్చీమీద పెట్టివున్న కోటు, సూటుకేసు తీసుకున్నాడు. డాక్టరు మధును సంబోధించి—"నమస్కారం డాక్టర్! మీ అమూల్య సమయాన్ని వృధాచేశాను. మీకు కష్టం కలుగజేసినందుకు క్షమించండి." అని అంటూ బయటకు వెళ్దామని ద్వారం వైపుకు అడుగు వేశాడు. ఇంతలో రత్నం ఓగ్గరగా ప్రభాకర్! అంటూ గబగబావెళ్ళి అతన్ని గాఢంగా కౌగలించుకుంది.

డాక్టరు మధు పిల్లిఅడుగులు వేస్తూ చడీచప్పుడు కాకుండా గదిలోనుంచి బయటకువెళ్ళి పోయాడు.

# తూర్పు యూరప్‌లో మానవవాద భూతము

థామస్ పి. విట్నే

ఈ భూగోళంమీద నివసించుతున్న ప్రతి మానవుడూ యిప్పుడు రెండు మహా సంఘర్షణలమధ్య నలిబిలి ఔతున్నాడు. వీటిలో మొదటిదీ, అత్యంత ప్రధానమైనదీ—సాంకేతిక పరిజ్ఞానాభివృద్ధికీ, సాంఘిక రాజకీయపరిణామానికీ మధ్య యేర్పడిన అఖాతం· సాంకేతిక పరిజ్ఞానం అవధులు లేకుండా అత్యంత త్వరితగతిని పెంపొందుతున్నది. కాని సాంఘిక రాజకీయ వ్యవస్థా పురోగమనం, నత్త నడకగా వుండి దాని గమనాన్ని అందుకోలేకుండావుంది. దీనివల్ల సాంస్కృతికరంగంలో ఎంతో సంక్షోభం చెలరేగుతున్నది. రెండవది ప్రపంచనాయకత్వం కొరకు రెండు అగ్రరాజ్యాలమధ్యనూ జరుగుతున్న సంఘర్షణ. ఇటు అమెరికా అటు సోవియెట్ ప్రభుత్వమూ విభిన్న సాంఘిక దృక్పథాలతో ద్వంద్వయుద్ధం చేస్తున్నాయి.

ఈ సంఘర్షణల వాతావరణంలోకూడా, ఈ ప్రపంచమంతా ఒకటేనని 'యేక ప్రపంచ' దృష్టిగల వారు సర్వత్రా వున్నారు. వీరు, ప్రపంచ సమైక్యతకు ప్రాతిపదికలుగా వుండదగిన జీవనసూత్రాలను అన్వేషించటానికి తంటాలుపడుతూనే వున్నారు. ఈ అన్వేషణలో కొందరు 'మానవుడు' అన్న శబ్దం వైపు దృష్టి మరల్చుతున్నారంటే ఇందులో ఆశ్చర్యపడవలసింది ఏమీ లేదు.

పారిస్ విశ్వవిద్యాలయంలో అధ్యాపకులుగా పనిచేస్తున్న ఆండ్రీ పీటర్ (Andre Piettre) 'రియాలిటీస్' (Realities) అన్న పత్రికలో ఇలా వ్రాశారు. 'ఈ ప్రపంచం అంతా ఒకటేనని సమైక్యభావాన్ని వ్యతిరేకించటం పాతకాలంనాటి మూఢత్వమని తేలిపోయినా, నిజానికి భవిష్యత్తులో ఏకైకము, సమగ్రము, అవిభాజ్యమూ అయిన మానవసంఘ సమీకరణకు ప్రాతిపదిక కాగల విశ్వమానవవాదం ఇంకా మనకు సిద్ధించలేదు. కాని ఆ నిర్మాణానికి కావలసిన శిలాఖండాలన్నీ సంసిద్ధమైవున్నాయి. వీటిని పేర్చి కట్టగల శిల్పి లభించితే ఈ భవిష్యన్నిర్మాణం సిద్ధించుతుంది."

అదే పత్రిక అదే సంచికలో శాస్త్ర విజ్ఞానము యొక్క విశ్వజనీనతను ప్రతిపాదించగల ఒక శబ్దం కొరకు అన్వేషణచేస్తూ, జె. రాబర్ట్ ఓపెన్‌హైమర్ (J. Robert oppenheimer) ప్రాచీన గ్రీక్ వాఙ్మయం వైపు దృష్టిమరల్చి 'మానవవాదం' (Humanitas) * అనే శబ్దాన్ని ఎన్నిక చేశారు. ఆయన ఇలా ప్రకటించారు.

'యీ అణ్వస్త్రాలు యీ మారణాయుధాలు– ఈ భూఖండంమీద ఇక మానవజాతి వుండదేమోననే భీతిని కలిగిస్తున్నాయి. అది జరగదనటానికి ఆస్కారమేమీ లేదు. కాని యింతకంటే భయదమైన పరిస్థితి యేమిటంటే, తనకున్న సంస్కృతి సంప్రదాయాలనూ, నాగరికతనూ మానవత్వంతో సహా సర్వనాశనంచేసుకుని మానవుడు మృగంగా తిరిగి యీ గడ్డమీద మిగులుతాడేమోనని నా భయం"—

పాశ్చాత్యదేశాలలో వ్యాపించివున్న 'మానవవాదాన్నిగురించి నేనిక్కడ చర్చించబోవటంలేదు. 'సామ్యవాద మానవవాదం' (Socialist Humanism) పేరా, 'మానవతా సామ్యవాదం' (Humane Socialism) పేరా 'సామ్యవాద' నియంతృత్వానికి ధూమకేతువుగా, కమ్యూనిస్టు ప్రాంతాలలో వ్యాపించుతున్న భావనా విధానాన్నిగురించి మాత్రమే పరిశీలనచేస్తున్నాను. "మానవతా సామ్యవాదశక్తి, ఇప్పుడు ఒక అదృశ్యభూతమై తూర్పు యూరప్ సర్వత్రా పరిభ

* 'Humanism' is the intellectual, scientific and literary movement of the 14 th and 16 th centuries, which exaulted Greek and Roman culture and learning: opposed to Scholasticism.

నించుతూ పెట్టుబడిదారీ వర్గాలనేగాక స్టాలినిస్టులను కూడా హడలగొడుతున్నది" అని గత నవంబరులో "కమ్యూనిస్టు ప్రణాళిక" తొలి వాక్యాలను వ్యాఖ్యానించుతూ, పోలిష్ పత్రికారచయిత్రి, ఎడ్డా వేర్ ఫెల్ (Edda Werfel) వ్రాసింది.

ఎడ్డా వేర్ ఫెల్ వ్రాసింది ముమ్మాటికీ నిజం. ఉదాహరణకు: సోవియట్ కమ్యూనిస్టుపార్టీ పత్రిక "కమ్యూనిస్టు", 1957 సం॥ 5వ సంచికలో, 'మానవవాదాన్ని' దుయ్యబడుతూ ఒక ప్రత్యేక వ్యాసం ప్రకటించటమే గాక, సంపాదకీయ వ్యాసంలో తొలి భాగాన్నంతా యిందుకు వినియోగించింది. ఆ సంపాదకీయం లెనిన్ సిద్ధాంతం మానవత్వాన్నంతా గుత్తకు పుచ్చుకున్నట్టు చెబుతూ. "కమ్యూనిస్టు సూత్రాల ప్రాతిపదికపై మానవ సంఘాన్ని పునర్నిర్మాణం చెయ్యటానికి విప్లవరూపంలో జరుగుతున్న ఈ మహా ప్రయత్నానికి మించిన మానవవాదం మరొకటి లేదు. ఇదే వాస్తవమైన మానవవాదం. మానవానురాగ వ్యక్తీకరణ ఇంతకు వినా మరొకటేదీ లేదు.' అని ఆ సంపాదకీయంలో వ్రాశారు.

ప్రత్యేకవ్యాసంలో మరింత మొండిగా వ్రాశారు. 'లెనినిజం'కు మానవత్వదృష్ట్యా సంస్కరణ జరుగవలసిన ప్రమేయమేమీ లేదన్నారు. 'మానవతా సామ్యవాదు'లు ప్రతిపాదించుతున్న మార్పులేవీ అవసరం లేదన్నారు. "క్రొత్తగా బయలుదేరిన ఈ సంస్కర్తలు, మార్క్సిస్టులమని చెప్పుకుంటున్నా, వారు మార్క్సిస్టు—లెనినిజంలో వున్న అత్యంత ప్రధానములైన సూత్రాలనే తొలగించాలని చెబుతున్నారు" అని వాళ్ళమీద ఒక విసురు విసిరారు.

'మానవవాద సూత్రాలపేర, ఈ మధ్య కొందరు, సోవియట్ విధానాన్ని దూషించటం పరిపాటి అయిపోయింది. అభూతము, ఊహానిర్మితమూ అయిన మానవ వ్యక్తిత్వాన్ని ఉన్నోన్ని పరిరక్షించాలనీ, మానవతఅనే దాన్ని ఉన్నోన్ని పరిరక్షించాలనీ, చేసే ఈ వివాదాలన్నీ, భూస్వామిక వర్గాలకు, పెట్టుబడిదారులకూ అనుకూలంగా, కార్మికకర్షక వర్గాల మనస్సులను కలుషితం చేయటానికి జరిగే ప్రయత్నం—శుద్ధ మోసం. ఇల్లాంటి 'పెటీ బూర్జువా' వివాదాలను లెనినిస్టు-మార్క్సిజం; సిద్ధాంతరీత్యా ఖండించుతోంది' అని 'కమ్యూనిస్టు' పత్రిక వీరి ధోరణిపట్ల తీవ్రమైన అసమ్మతిని తెలియజేసింది. మాస్కో పరిపాలకులు ఈ మానవవాదాన్ని ఖండించటమే గాక, దాన్ని చూసి కంగారు పడుతున్నారని యిందువల్ల స్పష్టంగా తేలుతున్నది. అయినా ఈ ఉద్యమాన్ని హత్యచేసి వెయ్యటం అంత తేలికైన పనిగాదు. పోలిష్ పత్రిక 'నోవాకుల్ టురా' (Nowa kultura) ఏప్రియల్ 28 తేదీన ఇలా ప్రకటించింది: సాంఘిక జీవితాన్ని యావత్తూ పునర్నిర్మాణం చేయుటం కమ్యూనిజం ఆదర్శం. సాంఘిక కొవనులలో మానవునికి స్వేచ్ఛ లభించాలి. మానవజాతికి ముక్తిలభించాలి. ప్రజాబాహుళ్యానికి నిజమైన సార్వభౌమాధికారాన్ని సంక్రమింపజేయాలి. ప్రజానీకంపట్ల బాధ్యత లేకుండా తయారైన పాలకవర్గానికీ సామాన్య ప్రజానీకానికీ మధ్య యేర్పడిన వర్గ తారతమ్యాన్ని నిర్మూలించాలి. జీవితంలో మానవత్వాన్ని సిద్ధింపజేయాలనే కమ్యూనిస్టు సిద్ధాంతం, విశ్వవ్యాప్తి కలది. ఈ భావన మార్క్సిజం కన్న ప్రాచీనమైనది. యుగయుగాలుగా పెంపొందిన సంస్కృతియొక్క పరిణామం'. 'నోవా కుల్ టురా' పత్రిక చెబుతున్న ఆ కమ్యూనిజం ఎటిదైనా, అది సోవియట్ కమ్యూనిజం కాదని స్పష్టంగా తేలుతోంది.

మరొక పోలిష్ కమ్యూనిస్టు, జర్ జీ అర్బన్ (Jerzy urban) మానవ వాదాన్ని నిర్వచించుతూ, 1956 జూన్ 10 వ తేదీగల 'పొప్రొస్టు' (Poprostu) పత్రికలో ఇలా వ్రాశాడు:

"మానవుని రక్షణ అనేది, సిద్ధాంతరీత్యా అనాదిగా వస్తున్న భావమే కావచ్చు. అయినా మానవతా సిద్ధి అనే విస్తృతాదర్శంలో అది ప్రధానాంశం. మానవ రక్షణలో, జీవితావసరాలను లభింపజేయుటమనేది తొలిమెట్టు. ఆర్థిక రంగంలో మనం ఊపిరి సలపటానికి వీలులేని ఉక్కుశాసనాల ఎన్నిటినో అమలుజరిపాం. ఉత్పత్తి విధానాన్ని నిర్వహించటానికి అభేద్యములైన వ్యవస్థలను ఏర్పాటు చేశాం. కాని ఈ సందడిలో మనం ఏ మానవుని కొరకైతే యిదంతా జరుగుతోందో ఆ మానవునే విస్మరించాం. మామూలు దైనందిన వ్యవహారాలలోనే కాదు, పెద్ద పెద్ద నిర్ణయాలు జరిగే తరుణంలోకూడా ఈ పొరపాటు చేశాం. ఆర్థిక రంగంలో మనం నిర్మించుకున్న ఈ శాసనాలు రద్దు చేయటానికి వీలులేని వేమీ కావు. మానవత పెంపొందే దృష్ట్యా సామ్యవాద మార్గాలద్వారా, ఉత్పత్తి విధానాన్ని నిర్వహించటం మన అవధి, ఆదర్శమూ అయి వుండాలి. మన విధానంలో ఇట్టి మార్పురావటం అవశ్యకర్తవ్యం. తన మట్టూ జరుగుతున్న ఈ కార్యక్రమమంతా ర

# తూర్పుయూరప్‌లో మానవవాదభూతము

గౌరవూ తన బాధ్యతతోనూ జరుగుతున్నాయనే భావం ప్రతి ఒక్కనికీ తోచేలాగు, పౌరుని, ఆత్మగౌరవం, అభిలషితావకాశాలూ పునరుద్ధరింపబడాలి."

పోలిష్ అధికార పత్రాలలోకూడా 'మానవవాద' ప్రసక్తి అక్కడక్కడ వినూనే వుంది. ప్రభుత్వాధికారాన్ని చేపడుతూ, 1956 అక్టోబర్ 20 వ తేదీన, వ్లాడిస్లావ్ గోముల్కా చేసిన ప్రకటనలో ఇలావుంది:

"సామ్యవాద పురోగమనంలో, వ్యక్తి ప్రాధాన్యత అనేది, అధికార చాలనంలో ఒక వ్యగ్రమైన పద్ధతి; ఇది మానవతా సామ్యవాద సిద్ధాంతాలకు విరుద్ధమైన పద్ధతులను అమలు జరుపుతుంది. మానవ స్వాతంత్ర్య విషయికమైన సామ్యవాద విధానానికీ, సామ్యవాద న్యాయానికి విరుద్ధములైన పంథాలను అనుసరించుతుంది."

ఈ 'మానవవాద భావన' అనేది, తూర్పు యూరప్‌లోనూ, కొన్ని సోవియట్ వర్గాలలోనూ పెంపొందుతున్న మహోద్యమాన్ని అవగతంచేసుకోటానికి భూతద్దంలాంటిది. 'మానవవాద' శబ్దంలో ఇమిడివున్న భావనయూతతో, వివిధ ప్రవచన రూపాలలో, వివిధ ప్రాంతాలలో వ్యక్తం అవుతూవుండటం గమనార్హం. క్రింద కొన్నిటిని పొందుపరుస్తున్నాము.

ఆడమ్‌వాజిక్ (Adam Wazyik): మానవతా సిద్ధికొరకు, తూర్పుయూరప్ దేశాలలోని ప్రముఖులు చేసిన విజ్ఞాపనలలో దేనిలోనూ, వాజిక్ చేసిన విజ్ఞాపనలో వున్నంత మహావేశం లేదు.

'వయోజనులకు ఒక గీతం' అన్న గేయం వార్సా పత్రిక 'నోవాకుల్‌టురా' పత్రికలో 1955 ఆగస్టు 19 తేదీన వాజిక్ ప్రచురించారు. ఆ గీతం తుదిభాగం ఇలా ముగుస్తుంది:

అంతులేని చాకిరితో
  అల్లాడుతున్న వారిపక్షాన
ఈ గడ్డమీద నిల్చుని
  ఈ హక్కులు కోరుతున్నాం!
ద్వారాలు వివృతాలు కావాలి
  గదులకు కిటికీలుండాలి
చెవుడుగారని గోడలుండాలి
  చవట సిద్ధాంతాలు నశించాలి—
మానవజీవితం సుఖవంతం కావాలి
  ప్రవాసి మానవుడు క్షేమంగా
పునరావాసితుడు గావాలి
  మాటలకూ చేతలకూ
తేడా కనుపించాలి

  ఈ గడ్డమీద నిలచి
ఈ హక్కులు కోరుతున్నాం

  జూదం కాదు మేమాడింది
లక్షలాదిజనం రణక్షేత్రంలో మరణించారు
  నిర్దుష్టమైన సత్యంకోసం
వాస్తవమైన స్వాతంత్ర్యంకోసం,
  జాజ్వల్యమాన మైన ఉపజ్ఞావిజయంకోసం
అనుక్షణం ఈ హక్కులు కోరుతున్నాం
  పార్టీ ద్వారా సిద్ధించాలని
అపేక్షించుతున్నాం."

టైబర్ టార్‌డాస్ (Tibor Tardos): 'ఇరోడాల్మి ఉజ్సాగ్' అనే పత్రిక 1956 సం॥ ఏప్రియల్ 7 వ తేది సంచికలో, టైబర్ టార్ డాస్ అనే హంగేరియన్ యువరచయిత ఇలా వ్రాశారు—తాము ఎలాంటి భయంకరమైన మహాకూపంలోకి విసరివేయబడివున్నారో అవగతం చేసుకున్న హంగేరియన్ విజ్ఞానవేత్తల భావాలకు ఇతడు రూపకల్పన చేశారు:

"రానురాను ఒక పరిణామదశలో మనం, హఠాత్తుగా మానవజీవితంయొక్క ప్రాధాన్యతనే త్రోసిరాజన్నాం—సిద్ధాంతాలకోసం మానవజీవితాన్ని బలిపెట్టాం. యౌవనదశలో మనం, యే విజ్ఞానస్వాతంత్ర్యంకొరకు ప్రతిజ్ఞాబద్ధుల మయ్యామో దానినే విస్మరించాం...ప్రతీదానికి తలవూపి సరేనన్నాం."

జోల్టన్ జెల్క్ (Zolten Zelk): మానవత్వ పునరుద్ధరణకొరకు కవులు పడుతున్న తాపత్రయం, "ఇరోడాల్మి ఉజ్సాగ్" (Irodalmi Ujsag) పత్రిక 1956 సం॥ మే 5 వ తేది సంచికలో జోల్టన్ జెల్క్ ప్రకటించిన ఈ గీతం విస్పష్టంచేస్తుంది.

'నేను మీ పొగడ్తకు అనర్హుణ్ణి.
మీరు నా విరహకావ్యాన్ని పొగడినప్పుడు
నా నరాలలో చలివబులు ప్రవహించుతుంది.
'నేను పులిని కాదు: మానవుణ్ణి
చితికిన నా హృదయం భయభ్రాంతుల గూడు.
నేను పిరికి పందను—కంగారు గొడ్డును.'

'నేను మానవుణ్ణి. మానవుడిలా బ్రతుకుతాను
నేను వీరుణ్ణి ఎలా అవుతాను
ఎందుకూ కొరగాని వ్యర్థుడ నౌతానేమోనని నా భయం.
మృత్యువుకంటే దీనికి నేను ఎక్కువగా భయపడు
తున్నాను."

ఆర్. జిమాండ్ (R. Zimand.) : మానవ క్షేమాన్ని గురించి, తాను చెందుతున్న ఆందోళనను, 'పొప్రాస్టు' పత్రిక 1956 డిశంబరు 9 తేదీ సంచికలో ఆర్. జిమాండ్ ఇలా వ్రాశాడు:

"నేను సోషలిజం ప్రసక్తి తేవటం లేదని, కొందరు నన్ను విమర్శించవచ్చు. కాని దానికి మనం ఎంతో దూరస్థులమై వున్నాం. సోషలిజం అంటే ఏమిటి? జనానికి తిండి వుండాలి, బట్టవుండాలి, జంతువులా బ్రతికే దుర్భర స్థితి పోవాలి. సాధించుకున్న స్వాతంత్ర్యాన్ని బలపరచుకుని పెంపొందించుకోవాలి. సోషలిజం అంటే ఇది నా అభిప్రాయం. పోలండ్ ప్రజల జీవన ప్రమాణం కనీసం ప్రాన్సు స్థితి కన్నా అందుకునే దాకా, మనం సోషలిజంను గురించి పెద్ద పెద్ద దీర్ఘోపన్యాసాలు చేసి లాభం లేదు."

స్టీఫాన్ కురొవ్‌స్కీ (Stefan Kurowski) పోలిష్ ఆర్థిక శాస్త్రవేత్త స్టీఫాన్ కురొస్కీ, 'జైసీ గోస్పొడారెజ్' (Zycie Gospodareze) అనే పత్రిక 1956 నవంబర్ 26 తేదీ సంచికలో ఒక వ్యాసం వ్రాస్తూ, పోలండు ఆర్థికాభివృద్ధి విధానం మారాలన్నారు. పెట్టుబడిదారీ దేశాలతో పోటీగా, భవిష్యత్తులో జీవన ప్రమాణాన్ని పెంచటానికిగాను, తీవ్రతరమైన పారిశ్రామిక పురోగమనాన్ని సాధించటానికి, వర్తమాన ప్రజల జీవన ప్రమాణాన్ని త్యాగం చేయాలని, సోవియట్ ప్రభుత్వం పదే పదే వల్లె వేస్తుంటే సిద్ధాంతం సరియైనది కాదని ఆయన విమర్శించారు. లక్ష్యం మంచిదైనా లక్ష్యసాధనకు అనుసరించే విధానం యుక్తమైనది కాదన్నారు. లక్ష్యంలో కూడా దోషం వున్నది. మానవ శ్రేయానికంటూ సాగుతున్న, సోవియట్ ఆర్థికాభివృద్ధి విధానం, ఆ మానవశ్రేయాన్నే విస్మరించుతున్నది. నిరుత్సాహ నీరసులౌతున్న ఈ ప్రజలు భవిష్యత్తును నిర్మించగలగటం అసంభవం. వీరినైరాశ్యంవల్ల ఉత్పత్తి ప్రమాణాలు దెబ్బతిని మొదటికే మోసం వస్తుంది" అన్నారు.

జార్జి పాలోక్జీ హోర్‌వాత్ (George Paloczi-Horvath) తూర్పు యూరప్ రచయిత లందరి రచనలకంటే హంగేరియన్ రచయిత జార్జి పాలోక్జీ—హోర్‌వాత్ వ్రాసిన "ఇరువురు యువకుల సమావేశం" అనే వ్యంగ్య రచన మనస్సును కలవరపరచేదిగా వుంది. ఇది 'ఇరొడాల్మి ఉస్జాక్' పత్రిక 1956 జూలై 7వ తేదీ సంచికలో ప్రకటించబడింది. ఈయన డాస్టవిస్కీ చిత్రించిన మూడు ప్రధానపాత్రలను సేకరించాడు 'క్రైమ్ అండ్ పనిష్‌మెంట్' (Crime and Punishment) నుంచి రోడ్యా రాష్కోల్నికోవ్ (Rodya Rashkolnikov)) ఒకడు, 'బ్రదర్స్ ఆఫ్ కారమజోవ్ నుంచి' ఇవాన్, ఎల్యోషాలు, గార్కీతో రచయితకూడా కలిసి, మూగవోయి కూర్చున్న పెద్ద ప్రేక్షకబృందం ముందుకువస్తారు— ఈ ప్రేక్షకబృందం స్టాలినిజంయొక్క దౌర్జన్యాన్ని అనుభవించిన వారన్నమాట.

రంగమీద నిల్చుని, ఇవాన్, ఎల్యోషాను ప్రశ్నించుతాడు : ఆ ప్రశ్న ప్రేక్షకులకుకూడా.

"నిర్మొగమాటంగా సమాధానం చెప్పాలి—మానవుని భవిష్యత్తును నీవే నిర్మించుతున్నావని ఊహించుకో. మానవజాతికి సుఖం చేకూర్చటం నీ పరమాశయం... కాని ఒకటి వుంది—దాన్ని సాధించటానికి, ఒకే ఒక ప్రాణినే ననుకో—నువ్వు హింసించి తీరాలి... ప్రతీకార రహితమైన ఆ ప్రాణి కన్నీరు స్రవించితేగాని ఈ నిర్మాణం పూర్తికాదు. ఆ ప్రాణిని అలా హింసించి నీ కార్యక్రమాన్ని కొనసాగించటానికి అంగీకరించుతావా?—అబద్ధ మాడకు-గుండెలమీద చెయ్యివేసుకు జవాబు చెప్పు."

'చెయ్యను—అలా చెయ్యలేను' ఎల్యోషా మందరస్థాయిలో గుస గుసగా జవాబు చెబుతాడు. ఇవాన్ : "అలాంటప్పుడు—ఏ మానవసమాజం కోసం ఈ కార్యక్రమం అంతా సాగుతోందో, ఆ మానవ సమాజం తన సౌఖ్యంకోసం, ఈ అల్పప్రాణి అన్యాయంగా హింసింపబడి అతని రక్తం చిందటం, సహించుతుందనీ, సంహించి అనంతరం సుఖశాంతులతో బ్రతుకుతుందనీ ఊహించగలవా?"

"అలా బ్రతుకలేరు" ఎల్యోషా తిరిగి సమాధానం చెప్పాడు.

# తూర్పుయూరప్‌లో మానవవాదభూతము

అనంతరం ఇవాన్ ప్రేక్షకుల వేపుతిరిగి ఇదే ప్రశ్న వేశాడు. అదే సమాధానం ప్రేక్షకులనుంచి ఏక కంఠంగా వచ్చింది.

ఇవాన్: "సోదరులారా! మీరు సరిగా ఆలోచించకుండా చాలా తొందరగా సమాధానం చెప్పేశారు. (ఎల్యోషావంక తిరిగి) వాళ్ళున్నారు చూశావ్—వాళ్లు—వాళ్లుకూడా మానవజాతి భవిష్యత్తును నిర్మించటానికే ప్రయత్నించుతున్నారు. భవిష్యత్తరాల సుఖంకోసం యత్నించుతున్నారు. ఈ జగత్తును శుభ్రమైనదాన్నిగా, వాసయోగ్యంగా, మహత్తరంగా పునర్నిర్మించటం వాళ్ళ ఆశయం. వాళ్ల ప్రేమ యావత్తూ రానున్న తరంకోసం ముడుపు కట్టేశారు. అందుచేత ఇప్పుడు బ్రతికివున్న వాళ్ళపట్ల చూపటానికి వాళ్ళ 'ప్రేమ' అణుమాత్రం కూడా మిగల్లేదు. వాళ్ళు పొందిన తరిఫీదు అలాంటిది. వాళ్ళ గుండెలు ఊహా కల్పితములైన భావాలతోనిండి నిష్ఠురములై వున్నాయి. అనుమాన భయభ్రాంతుల వాతావరణంలో వాళ్లకీ ఈ భావా లేర్పడినా వాళ్లు వాటిని నమ్ముతున్నారు. ఎల్లుండి రానున్న తరానికి సుఖం చేకూరితే ఈ నాటి మానవులగతి యేమైపోయినా ఫరవా లేదని వాళ్ళ పరమ విశ్వాసం."

ఈ దశలో ఎల్యోషా ఇవాన్ మాటలకు అడ్డు వచ్చి, ప్రేక్షకులను ఉద్దేశించి:

"మీకు ఇప్పటికే బోధపడివుంటుంది. ఇక నిట్లా బ్రతకలేమని మీకు తెలుసు. సుఖ సంపాదనకు ఇది మార్గంకాదని మీకు అవగతమై వుంటుంది. ఈ నిర్మాతలు కూడా ఇప్పటికి తెలుసుకునే వుంటారు. ధార్మికజీవులమై ఈ కార్యాన్ని నిర్వహించుతున్నామని నిరూపించుకోవలసి వుంటుందనీ, ఆదర్శం పవిత్రమైనదై వుండాలనీ,...పవిత్రాశయ సాధనకు పవిత్ర కార్యాచరణ విధానం వుండాలనీ"—

"కాని," అంటూ ఇవాన్ మళ్ళీ అందుకున్నాడు, "పశ్చాత్తాపపడినంత మాత్రాన లాభం లేదు. "మీరు అర్థం చేసుకోవాలి—ఓ దురదృష్ట జీవులారా! మీ రేఅవస్థలో వున్నారో మీకేమైనా బోధపడుతున్నదా? క్లిధ బుద్ధులైన మీరు, నైతిక ద్వంద్వంలో గిజగిజలాడుతున్న మీరు, పవిత్రమూ, మహత్తరమూ అయిన భవిష్యత్తును నిర్మించలేరనిమీరు తెలుసుకోవాలి."

<u>వ్లాడిమీర్ డ్యూటిన్‌స్టేవ్: (Vladimir Dudintsev)</u>. మానవజాతిపట్ల కరుణతో కూడుకున్న ఈ నవ్య మానవవాద స్ఫురణలు సోవియట్ భూమిలో కూడా అక్కడక్కడ వినిపించుతూనే వున్నాయి. యుద్ధానంతరం వెలువడిన సోవియెట్ సారస్వతంలో ప్రఖ్యాతి వహించిన నవల వ్లాడిమీర్ డ్యూడిన్‌సేవ్ రచన "నాట్ బై బ్రెడ్ ఎలోన్" (Not by Bread Alone) (తిండి ఉంటేసరా"?) దీన్లో నవ్యమానవవాద సువర్ణరేఖలు పేజీపేజీలోనూ తళతళా మెరుస్తున్నాయి. వ్లాడిమీర్ నవలలోని కథానాయకుడు లోపాట్కిన్ అనే యువకుడైన ఒక ఎంజినీరు. అతడు ఒక నూతన యంత్రాన్ని కనిపెట్టాడు. తన ఈనూతనసృష్టి గుర్తింపబడడానికి అతను తీవ్రంగా ప్రయత్నించుతాడు. లోపాట్కిన్ సోవియెట్ భౌతిక వాదానికి విభిన్నమైన ఆదర్శవాదానికి ప్రతిమూర్తి; సోవియెట్ బానిస భావానికి ప్రతిద్వంద్వియైన వ్యక్తి స్వాతంత్ర్యానికి ప్రతిరూపం; సోవియెట్ అధికార వర్గాల అజ్ఞానానికీ మాఢ్యానికీ విభిన్నమైన విజ్ఞాన తృష్ణకు మానవరూపం. అధికారవర్గాల రాక్షసత్వానికి వ్యతిరేకంగా, నిరంతరపోరాటం జరపటంలో చరితార్థత వున్నదనీ, కేవలం కారాగారాది హింసలవల్ల మానవుని ధీశక్తి నశించేదిగాదనీ ఈ పోరాటం సాగించటానికి అనువైన రణక్షేత్రం రాజకీయరంగమనీ లోపాట్కిన్ ప్రబోధించుతాడు.

ఈ విషయానికంతటికీ అంతరార్థమైన మానవవాద దృక్పథం నవలలోని చివరి ఘట్టంలో ప్రస్ఫుటమవుతుంది. లోపాట్కిన్, తనభార్య నాడ్యాతో సహా మేడమీది వరండాలో నిల్చుని భవిష్యత్తులోకి చూస్తాడు.

'పునఃప్రయాణ సంరంభంగా మూపుమీద వున్న బరువును సరిజేసుకుంటున్నట్లు ఆవేశంగా పిట్టగోడ మీదికి వంగాడు. అతని భుజాలలో ఇప్పుడు అనంతమైన శక్తి ఉజ్వలించింది. కాని అతను తన భుజాల మీద ఇప్పుడు అదనంగా కొత్తబరువును చాలా మోపుకున్నాడు—కొత్త బాధ్యత—నూతనంగా స్వీకరించిన మానవతా పరిరక్షణ బాధ్యత. 'నువ్వు రాజకీయవాదివి అయితీరుతావు" అని అతని మిత్రుడు గాలిట్‌స్కీ అతనితో ఏనాడో అన్న మాటలు జ్ఞప్తికి వస్తాయి. దాని పరమార్థమేమిటో అతను

తొలిసారిగా ఇప్పుడు అవగతం చేసుకోగలిగాడు. లోపాట్కిన్ తన యంత్రాన్ని నిర్మాణం చెయ్యటం అప్పగించివేయటం ఏనాడో జరిగిపోయింది. కాని ఇప్పుడు అతనికి కొత్త బాధ్యత పొడసూపింది. దూర దూరాంతరాలకు వ్యాపించుకుపోతూ అతని ముందు ఒక కొత్త రస్తా కనుపించుతోంది. దానికి తుది అంటూ కూడా కనుపించటంలేదు. ఆ మార్గం తన్ని ఆహ్వానించుతోంది. అనేక అజ్ఞాత ప్రదేశాల మధ్యగా నిష్ఠురమైన బాధ్యతలను మోస్తూ అత్యంత సహనంతో ప్రయాణం చేయవలసివుంది."

క్రుశ్చేవ్ డ్యూడిన్ట్సేవ్ గ్రంథాన్ని, "కృపణ ప్రచార"మన్నాడు.

<u>ఇతర సోవియెట్ రచయితలు:</u> సోవియట్ భూమిలో మానవవాద దృక్పథాన్ని వ్యక్తంచేస్తున్నది డ్యూడిన్ట్సేవ్ ఒక్కడే కాదు. ఇంకా చాలామంది వున్నారు. అతనితోపాటు సమర్థులూ, విశుద్ధ దృక్పథం కలవారూ.

"లివర్స్" (మీటలు) అనే కథలో, అలెగ్జాండర్ యాషిన్ ఒక సమష్టి వ్యవసాయ క్షేత్రంలో పనిచేస్తున్న ఒక దళం కమ్యూనిస్టులను చిత్రించుతాడు. వాళ్లంతా కూర్చుని, తమపరిస్థితిని గురించీ, పార్టీతో తమకుగల సంబంధాలను గురించీ బహిరంగంగా చర్చించుకుంటూ వుంటారు. వారిలో ఒకడు "నిజం" అంటే ఏమిటి? అని ప్రశ్నించుతాడు—ఉన్న పరిస్థితినీ, చెప్పేమాటలనూ పోల్చుతూ అక్కడున్నవాళ్లు నిరాశావాదధోరణిలో ఎవడికి తోచిన సమాధానం వాడు చెబుతాడు.

"విమర్శ—ఆత్మవిమర్శ—అనేవాటి మోస్తరుగానే, "నిజం" అంటే, ఉత్సవాల్లోనూ, మీటింగులలోనూ చెప్పేది" అని ఒకడు.

"అంటే యవ్వారాలలో పనికొచ్చేదిగాదు"— అని మరొకడు.

సంభాషణ ఈ విధంగా సాగుతుండగా పార్టీ నాయకులందరూ వచ్చి, కట్టుదిట్టమైన పద్ధతిని సభ చేస్తారు. ఆ సభలో మళ్లా వీళ్ళంతా మామూలు మొండి బాణీలో పార్టీ పాఠాలు అప్పగింత చేస్తారు. సభ ముగుస్తుంది. మళ్లా ఎక్కడివాళ్లు అక్కడ వెళ్లిపోతారు. మళ్లా వాళ్లు 'మీటలు'గా కాకుండా మామూలు మనుష్యులుగా నిజాయితీగా నిష్కల్మషంగా మాట్లాడుకుంటారు.

"స్వగ్రామానికి" అనే కథలో యన్. ఝుకోవ్ ఉన్నతాధికారి అయిన ఒక పార్టీనాయకుని కథనం వ్రాశాడు. ఇంటికాడ అతనితల్లి చనిపోతుంది. అంత్య సంస్కారాలు నిర్వహించటానికి అతను మాస్కోనుంచి స్వగ్రామానికి వస్తాడు.

ఆ గ్రామంలోవుండే సామాన్య ప్రజలు, తమ కష్టసుఖాలన్నీ అతనితో చర్చించుతారు. పార్టీ అధికారిగా కాకుండా గ్రామస్థులలో ఒకడుగా వారు చెప్పేదంతా వినవలసివస్తుంది. అతను సహించలేకపోతాడు — అక్కడ క్షణం వుండలేకపోతాడు— మాస్కోలోవున్న తన అధికారపు కూట్లోకి పోయి వాలటానికి తహతహలాడతాడు తన్ను—తాను మరిచిపోయి బ్రతకటానికి వీలుగా."

యూరీ నాగిబిన్ "లైట్ ఇన్ ది విండో" అని ఒక కథ వ్రాశాడు. ఆ కథలో ఒక "విశ్రాంతి గృహం" డైరెక్టరు వుంటాడు. అతను సత్రంలోని ఒక అందమైన గదిని, పరిశుభ్రంగా అలంకరించి, ఎన్నడూ వేంచేయని పార్టీనాయకునికోసం ప్రత్యేకించి వుంచుతాడు. సత్రం జనంతో క్రిక్కిరిసిపోయినాసరే, ఆ గది తాళం తియ్యడు. ఆ గదిలోకి అలా ఏ ప్రాణినీ అడుగుపెట్టనీయడు. అది అనంతంగా అలా వుండిపోవలసిందే. ఇలావుండగా, ఆ సత్రంచూసే పనిమనిషి, ఒకనాడు, తన కుటుంబంతో ఆ గదిలో ప్రవేశించి కొంచెం కులాసాగా కాలం గడుపుతూవుంటుంది డైరెక్టర్ అమాంతం ఉగ్రుడై వాళ్లని బయటికి వెళ్లగొట్టివేస్తాడు. కాని వెడుతున్నవాళ్ళ కళ్లవంక చూస్తాడు. తనలో వుండే అమానుషరాక్షసత్వం యావత్తూ, అతనికి వాళ్ళకళ్లల్లో కనుపించుతుంది — చకితుడౌతాడు.

సోవియట్ సాహిత్యాధికారులు 'డ్యూడిన్ట్సేవ్ రచనలవంటి చాలారచనలపైన ఆంక్షవిధించినా వారి దృష్టిపథంలోపడని రచనలు, మానవవాదధోరణిగలవి ఇంకా చాలా వున్నాయి.

మిలవాన్ జీలాస్ (Milovan Djilas) సోవియెట్ వ్యవస్థలో వున్న అంతర్వైరుధ్యాలను విమర్శించుతూ ప్రకటించిన అభిప్రాయాలు సర్వులకూ తెలిసినవే. అతను ఇటీవల ప్రచురించిన నూతన గ్రంథం

# తూర్పుయూరప్‌లో మానవవాదభూతము

మానవవాద భావనలతో నిండివుంది—ముఖ్యంగా తుది భాగం. ఈ భాగంలో ఆయన విశ్వప్రపంచ నిర్మాణాన్ని సాధించటానికి పనిచేస్తున్న వివిధ శక్తులను గురించీ చర్చించారు. గ్రంథాంతంలో ఇలా వ్రాశారు:

"మన హృదయాంతరాలలో అత్యంత ప్రధానమైన ఒక నూతనావేశం ఆవిర్భవించింది...ప్రపంచ సమైక్యతను సాధించాలనే మహావేశం.

'సంఘంలో ఒకవర్గం, పార్టీ గాని, నాయకత్వం గాని విమర్శనను అణచివేసినా, నిరంకుశాధికారాన్ని వహించినా, ఆ వ్యక్తిలో అహంకారం బలపటానికి, వాస్తవ స్థితిగతులను అర్థం చేసుకోలేని అంధత్వంలో పడిపోయి అతను తప్పుడు నిర్ణయాలు చేయటానికి ఆస్కారంవున్నది.

'కమ్యూనిస్టు నాయకులకు ఇప్పుడు పటిన గుర్తింపు ఇదే. వాళ్ళ కార్యాచరణపద్ధతులను వాళ్లు అదుపుచేసుకోలేరు. పరిస్థితులకు దాసులై మొండిబాణీలో వ్యవహరించుతారు. ఇందులో కొంత సౌలభ్యముున్నమాట నిజమే: పూర్వాంకంలో కార్యాచరణదక్షులైనవారు ఇప్పుడు చాలామంది వున్నారు. కాని దీల్లో చాలా ప్రతిబంధకాలువున్నాయి. వీళ్లు ఉజ్జాయింపుగానైనా వాస్తవ స్థితిగతులను అవగతం చేసుకోలేరు. వాస్తవ స్థితిగతులు ముఖంలో కొట్టుకుంటుంటే సమన్వయం చేసుకోవటానికి ప్రయత్నించకుండా, తమ పద్ధతులను తాము సమర్థించుకోటానికి ప్రయత్నించుతూ తమ అవకాశాలనన్నింటినీ, కాలాన్నంతటినీ తిగలేసుకుంటారు.

"ఏది యేమైనా పరిణామం అనేది వచ్చి తీరుతుంది. ప్రపంచం దానిపద్ధతిలో అది పురోగమించుతోంది. సమైక్యత, అభివృద్ధి, స్వాతంత్ర్యాలవైపు పురోగమించుతోంది. వాస్తవిక పరిస్థితులశక్తీ, జీవశక్తి, ఇవిరెండూ పటుశక్తులన్నిటికంటే, సిద్ధాంతాలన్నిటికంటే బలవత్తరములైనవి."

మానవవాద సిద్ధాంతాలను, ద్యోతమానం చేస్తున్న ఇలాంటిభాగాలను, సోవియట్ రచయితల నుంచీ, తూర్పుయూరప్ రచయితలనుంచీ అనంతంగా ఎత్తి చూపవచ్చు. ఇక్కడ ఉటంకించినవన్నీ యాథాలాభంగా ఎత్తిమాపినవేగాని పనిగట్టుకు ఏరినవిగావు. ఈ రచయితల భావాలలో చాలా వైవిధ్యం వుంది. ఎవరికివారే వ్యక్తిగతయోజనాపద్ధతి గలవారు. మరోయితర యే వర్గంతో చేర్చుతామన్నా వీరు చాలా తీవ్రంగా గర్హించుతారుకూడా. కాని ఈ అందరి భావనలోనూ, అంతర్లీనంగా, ఒక సమైక్యత కనుపించుతోంది. ఈ సమైక్యభావంవల్ల వీరు, సోవియట్ "లెనినిజం - మార్క్సిజం" పట్ల రాజీలేని ప్రతిద్వంద్వులుగా వున్నారు. వీళ్లు భావించుతున్న ఈ మానవవాదానికి సూత్రబద్ధమైన ఒక ప్రణాళికారూపంలో సిద్ధాంతగ్రంథంగా ఇంకా ఏదీ యేర్పడి ఉండకపోవచ్చును. కాని వీరు వ్యక్తంచేస్తున్న ఈ భావములనన్నిటినీ సంపుటీకరించితే అలాంటి సిద్ధాంతం రూపొందుతుంది. తూర్పు యూరప్‌లో వ్యాపించివున్న సాంఘిక నైతిక సమస్యల పరిష్కారానికి అది సంతరణోపాయు మౌతుంది. ఈ మానవవాదం, జీవిత సమస్యలపట్ల స్థూలంగా వ్యక్తంచేయబడుతున్న ఒక దృక్పథం మాత్రమేనని అనుకోకూడదు. ఈ దృక్పథంనుంచి, ఆర్థిక, రాజకీయ, సాంఘిక సమస్యల పరిష్కారానికి అనువైన అనేక సూత్రాలను సాధించటానికి వీలున్నది.

ఈ నవ్య మానవవాదం వైపు వీరినందరినీ సమీకరించుతున్న అంతర్లీన శక్తులేమిటో కొంచెము పరిశీలించుదాము.

వ్యక్తిగత స్వాతంత్ర్యము,ఆదర్శవాదము ప్రధాన ప్రాతిపదిక. ఈ ఆదర్శం ఊహాగానం కాదు వాస్తవమైనదీ, సువ్యక్తమైనదీ, మానవునియందు పరమ విశ్వాసము గలదీ, మానవక్షేమాసక్తి ప్రధానాశయముగా గలదీ. "అంతులేని చాకిరితో అలమటిస్తున్న వారికోసం ఈ గడ్డపై నిల్చుని ఈ హక్కులు కోరుతున్నాం...చవట సిద్ధాంతాలు నశించాలి...మానవ జీవితం సుఖవంతం కావాలి" అని ఆడమ్‌వాజిక్ వ్రాశారు.

ఈ ఉద్యమ సంచోదకశక్తులు కరుణవీరములు. 'ప్రయాణం సుదీర్ఘమై ఆయాసహేతువౌతుందని భయపడగూడదు...అంటాడు"తిండి దొరికితే సరా" అనే నవలలో ఎంజినీర్ లోపాట్కిన్. 'నేను చేతగానివాణ్ణవుతానేమోనని నాభయం.'అని వ్రాశాడు జోల్టన్ జెల్క్. 'ఒక అల్పజీవి హింసింపబడి అతని రక్తం చిందితే మానవజాతి సహించదు' అంటాడు 'పాలొక్టి' వ్యంగ్య రచనలో ఇవాన్ కార్కజోవ్.

మానవుడు సర్వ కార్యాచరణకూ కేంద్రంగా వుండాలనీ, ఆర్థికశాసనాలన్నీ మానవుని కొరకు సృష్టింపబడాలనీ, మానవుడు శాసనాలకు బానిసగా చేయబడరాదనీ, నవ్యమానవవాద సిద్ధాంతాలను విస్పష్ట రూపంలో అర్బన్, జిమాండ్ మొదలైనవారు వ్యక్తీకరించారు. "భారీ పరిశ్రమల ఉత్పత్తి లెక్కలకంటే, ప్రజల జీవనప్రమాణం ప్రధానమైన"దని 'ఖురాస్కీ' ప్రతిపాదించారు. మానవుని భౌతిక సంక్షేమం ప్రాతిపదికగా నవ్యమానవ వాదం ప్రారంభమౌతుంది. మానవస్వాతంత్ర్య గౌరవాలు, హక్కులు పునరుద్ధరింపబడాలని కోరుతుంది. ఈ భావపరంపరలో అంతర్లీనమై, మానవజాతి ఒకటే ననే అంతర్జాతీయ దృక్పథం, ప్రపంచ మానవసమాజ సమైక్యతవైపు పురోగమించుతున్నదనే విశ్వాసం ద్యోతమానమౌతోంది. మానవవాద కార్యాచరణ పద్ధతి స్పష్టంగావుంది. "లక్ష్యం సరియైనదైనప్పుడు సాధనవిధానం ఎటువంటిదైనా ఫరవాలేదనే" సిద్ధాంతం తప్పుడు సిద్ధాంతమన్నారు.

"పవిత్రమైన లక్ష్యాన్ని సాధించటానికి, పవిత్రమైన సాధనసంపత్తివుండాలి." జీవితం సర్వత్రా, సర్వకాల సర్వావస్థలయందూ సత్యం శిరోధార్యమై వుండాలి. విజయం అనేది ఓర్పుతో తుదివరకూ పోరాడితేగాని లభించేది కాద"ని డ్యానిన్ ష్నేవ్ తుది వాక్యంగా చెప్పాడు.

ఈ విషయాల నన్నిటినీ సమీకరించుకుంటే' ఒక సమగ్రమైన సిద్ధాంతం ఏర్పడుతుందనీ, సోవియట్ "మార్క్సిజం – లెనినిజం"కు ఇది కేవలం ప్రతిద్వంద్విగా వుంటుందనీ సర్వులూ అవగతం చేసుకోగలరు. 'నోవాకుల్ టురా' ఉల్లేఖించినట్లు, పిటిలో ఏదీ అధినూతనభావంగాదు. పాశ్చాత్య నాగరకతకు ప్రధాన ప్రాతిపదికలుగా అనాదికాలంనుంచీ వస్తున్నవే— సామ్యవాద ఉద్యమాల రూపంలోనూ, ప్రజాస్వామికోద్యమాల రూపంలోనూ గత శతాబ్దం పొడుగునా ప్రచారం చెయ్యబడుతున్నవే. స్టాలినిజంనుంచి బయటపడటానికి ప్రయత్నించుతున్న తూర్పు యూరప్, రాజ్యాలకు ఈ నవ్యమానవవాద సూత్రాలు చారిత్రకంగా ధ్యేయమౌతున్నాయి.

ఈ నవ్య మానవవాదం సోవియెట్ లెనినిజం-మార్క్సిజంకు ఎలా సవాలుగావుందో, అట్లాగే, మరొకవిధంగా పశ్చిమ రాజ్యాలకుకూడా సవాలుగా వుంది. వాక్స్వాతంత్ర్యంమీద నియంత్రుత్వ నిబంధనలు లేని పశ్చిమదేశాల వైజ్ఞానికులకు ఇది ఒక సవాలు. ఈ నవ్య మానవవాద సిద్ధాంతాన్ని సమగ్ర స్వరూపంలో త్వరితగతిని రూపొందించి, పశ్చిమ రాజ్యాలలో పెంపొందిన స్వాతంత్ర్యభావ పరంపరను దీనితో సంపుటీకరించి, మానవజాతి పునరైక్యతకు ఈ విజ్ఞానజ్యోతితో దారిచూపవలసివుంది. ఒక అధినూతన సిద్ధాంత మేదైనా రూపొందితే నేతప్ప, కేవల 'నేతివాదం'తో లెనినిజం పరాజయం పొందదనేది నిజం. స్టాలినిజనంయొక్క బానిసత్వాన్ని అనుభవించిన ప్రాచ్యవాసుల హృదయాలనుంచి ఈ నూతన జ్యోతి ప్రస్ఫుటంకావటం, పాశ్చాత్య విజ్ఞాన వేత్తలను సిగ్గుతో తలవంచుకొనజేసి, చోదనశక్తిగా తయారై కార్యోన్ముఖులను చేస్తోంది. నిజానికి నవ్యమానవవాదం ప్రాచ్య ప్రజలకు ఎంత ప్రధానమైనదో పాశ్చాత్య ప్రజలకు కూడా అంత ప్రధానమైనదే.

* న్యూ లీడర్ పత్రిక సౌజన్యంతో

# క్రిస్మస్

శ్రీ మిక్కిలి సుందరరావు

ఇది మీ మొద ఉగాదివలె
మామది నలరిన క్రిస్మస్ !
ఇది మీ వెన్నెల దీపావళిగా
మా కన్నుల వసంతావళి !

వేయి వసంతమ్ములు
ఒకరేయివలెను మెంచుకొని
గున్నమావి కొమ్మమీద
కమ్మని రాగాలగాథ
వినిపించెడి కోకిలవలె
కనిపించిన దీ క్రిస్మస్ !

బ్రతుకు బరువుగా తియ్యని
తలపు కరువుగా మారిన
ఆకలితో అంత మొందు
కటికదరిద్రుని దోసిట
అటికతోడ చెఱకురసము
అందించెడి సుందరివలె
హాయిగూర్చినది క్రిస్మస్ !

మొదటిరాత్రి భర్తమెదుట
నునుసిగ్గులుజాలువారు
కల్లకపట మెరుగని
ఓ పల్లెపిల్ల ఉల్లములో
కంపించెడి కాంతివోలె
కదలాడిన దీ క్రిస్మస్ !!

## భా ర తి

మోడువడిన మా బ్రతుకులు
నేడే చిగురింపజేయ
కన్నెమరియ గర్భమందు
ధన్యజీవి ఉదయించెను.

ఆకసంబున తార
అందంబుపొడగాంచి—
ఈరోజు హీరోదు
గుండె దడదడలాడి
చెండాడె నెన్నెన్నో
పండని శరీరాల.

*        *

మా హృదయము వెలిగింపగ
ఈ పృథివిని పండింపగ
వచ్చిన క్రిస్మస్ వృక్షము
ఇచ్చులే సదా మోక్షము !

# పరువు కోసం

**శ్రీ మల్లాది సత్యనారాయణ**

**పాత్రలు:** జనార్దనరావు, ప్రకాశరావు, రామం, చంటిబాబు, పానకాలశాస్త్రి, జానకి

* * జనార్దనరావుగారి గది. మధ్యతరగతి కుటుంబీకుని యింట్లో ఉండవలసిన సామాను ఉంటుంది. తెరలేవగానే జానకి నీళ్ళబిందె చంకని బెట్టుకొని వీధిలో నుంచి వచ్చి లోనికి వెడుతుంది. ఆ వెనుకనే చంటిబాబు పుస్తకాలతో వచ్చి రౌండ్ టేబిలు కెదురుగా ఉన్న కుర్చీలో కూర్చుండి పుస్తకాలు సర్దుతూ...

చంటి : వదినా!... వదినా!

[లోపల జానకి] : ఆ!

చంటి : స్కూలునుంచి వచ్చేశాను వదినా!

[లోపల జానకి] : అల్లాగా! ఇంకేం. అక్కడ నీ కాఫీ ఫ్లాస్కులో ఉందిగా.

చంటి : అదికాదువదినా! నాకు బలే ఆకలేస్తోంది వదినా!

[లోపల జానకి] : ఎందుచేత బాబూ అంత ఆకలి?

చంటి : ఏమోగాని వదినా! తినడానికి ఏదైనా పెడతావా? వట్టి కాఫీ తాగెయ్యమంటావా?

[లోపల జానకి] : వస్తున్నా బాబూ!

చంటి : అయితే ఏదో ఉందన్నమాటే (సన్నగాపాడతాడు) మావదిన మా మంచివదిన....

జానకి : (మైసూరుపాకం, కారప్పూస ప్లేటులో పెట్టుకుని ఒకచేత్తో మంచినీళ్ళగ్లాసు పుచ్చుకుని వస్తూ) నన్నేం పొగడ అక్కర్లేదులే. చంటిబాబుగారు చదివి చదివి అలిసిపోయారని...

చంటి : మైసూరుపాకం ఫలహారమా?

జానకి : ఆ! (అని డ్రాయరుపై పెడుతుంది)

చంటి : గైటో (తింటూ) చేశావాయేమిటి వదినా! బలేగా ఉంది!

జానకి : మరి ఎల్లుండి పండుగకదూ!

చంటి : అయితే పండుగ వెళ్ళేదాకా సరిపోయే మైసూరుపాకం చేసేశావన్నమాట. స్వీట్, హాట్; కారప్పూస కూడా కరకర లాడుతూ బాగానే ఉంది. ఇవన్నీ ఇంతబాగా చెయ్యడం ఎలా నేర్చుకున్నావు వదినా?

జానకి : నీ మొహంలా ఉంది? ఎలా నేర్చుకోవడ మేమిటి?

చంటి : అదికాదు వదినా! అటు చదువా యస్. యస్. యల్. సి ప్యాసయ్యావు. టైపు పరీక్షా హయ్యర్ ప్యాసయ్యావు. హిందీవచ్చు. ఇటు వంటా అద్భుతంగా చేస్తున్నావు పిండివంటలు చెప్పే అక్కర లేదు ఫస్టుమార్కు. ఇన్నీ ఎట్లా నేర్చుకున్నావా అని? చస్తున్నాను ఈ యస్.యస్. యల్. సి.లో ఇటు సంస్కృతం అటు కాంపోజిట్ మాథమిటుక్సు తీసుకొని ఉక్కిరి బిక్కిరి అవుతున్నాను.

జానకి : మరేం ఫరవాలేదు బాబూ! కష్టపడి చదవాలి. (డ్రాయరుమీద పుస్తకాలు దులిపి సర్దుతూ) నేనూ కాంపోజిట్ మాథమెటిక్స్ తీసుకుంట. నీకు తెలియకపోతే నేను చెబుతాలే.

చంటి : (కాఫీ త్రాగుతూ చిలక్కొయ్యకి ఉన్న బట్టలు చూచి) సరేగాని వదినా! అదే

విటి! నా పేంట్ చొక్కా ఇస్త్రీ చెయ్యనే లేదు. రేపు ఏం తొడుక్కు వెళ్ళను స్కూలికి.

జానకి : రేపటికి కదా. రాత్రే చేద్దామనుకున్నాను. మీ అన్నయ్య ఆఫీసునుంచి అర్జంటుగా టైపు చేయాలంటూ ఏవో కాగితాలు తెచ్చిపడేశారు. అవిటైపు చేసేసరికి రాత్రి మూడయింది. ఏం చెయ్యను? ఈ పగలల్లా ఈ పిండివంటలతో సరి పోయింది. ఈరాత్రి నీబట్టలు మీ అన్నయ్య బట్టలు యిస్త్రీ చేస్తాను.

చంటి : ఏవిటో వదినా—అనవసరంగా చాకలాణ్ని మాని పించేశావు.

జానకి : అనవసరం కాదు బాబూ! చాకలి ఖర్చు నెల కెంతయ్యేదో నీకు తెలియదు గనుకనా. మీ అన్నయ్య ఒక్కరి రెక్కల మీద నలుగురి పొట్టలు గడవాలా, మనపని మనం చేసుకుంటే తప్పేముంది.

చంటి : ఏవిటో నీదంతా అదోమతం. రాత్రి తెల్ల వార్లూ మేల్కొని టైపు చేశావు. ఈ పగలల్లా ఈ పిండి వంటతో సరిపోయింది. ఈ రాత్రి మేల్కొని బట్టలు యిస్త్రీ చేస్తావా? బాగానే ఉంది.

జానకి : మరేం ఫరవాలేదు బాబూ.

చంటి : ఆ భగవంతుడు నీకు యెంత ఓపిక పెట్టాడు వదినా! అయినా ఆఫీసులో టైపు కాగితాలు కూడా నీమీద పారేసి దర్జాగా సినీమాకు వెళ్ళక పోతే కూర్చుని టైపు చేసుకోకూడదు కాబోలు అన్నయ్య.

[వీధిలో పోస్ట్ అని కేక]

చంటి : (వీధిలోనికి వెళ్ళి పోస్ట్‌మాన్ యిచ్చినకార్డు తెస్తాడు)

జానకి: ఎక్కణ్ణుంచి బాబూ!

చంటి: మీనాన్నగారి దగ్గర్నుంచి అనుకుంటాను. (చదువుతాడు)

శ్రీయుతులు జనార్ధనరావు బావగారికి మీబావ మరది ప్రకాశరావు నమస్కరించి వ్రాయునది. ఈ పండుగకు మా అమ్మాయి జానకిని అల్లుడు రామాన్ని మాయింటికి పంపిస్తారని ఆశిస్తూ నేను బయలుదేరి బుధవారం మెయిల్ లో వస్తున్నా. తప్పక నాకోరిక తీరుస్తారని ఆశిస్తా.

చిత్తగించవలెను
ఇట్లు
ప్రకాశరావు

వదినా: బుధవారం అంటే ఇవాళే నన్నమాట.

జానకి: అవును ఇవ్వాళ మెయిలుకు వస్తున్నాడు కాబోలు.

చంటి: అలాగైతే స్టేషనుకు వెడతాను వదినా! అయితే వదినా! పండక్కి మీవాళ్ళింటికి వెడతావా?

జానకి: ఏం బాబూ! అల్లా అడిగావు?

చంటి: ఏమో వదినా! నువ్వు లేకపోతే నాకీ కొంపలో ఏమీతోచదు. మా అమ్మ చచ్చిపోయింది. అప్పట్నుంచీ రెండేళ్లు నాకీ కొంప నరకం లాగతోచింది. తరువాత నువ్వువచ్చావు. మళ్ళీ మా అమ్మ ఉన్నట్టే ఉంది. నువ్వు మీ వాళ్ళింటికి వెడతానంటే నాకెందుకో బెంగగా ఉంది వదినా! (కన్నీరు తిరుగుతుంది)

జానకి: తప్పకదు. అలా ఏడుస్తారా బాబూ! మీ అక్కయ్య వస్తుందిగా ఏం భయం? మీనాన్న గారు యీ సాయంత్రం తీసుకువస్తానని వెళ్లారుగా.

చంటి: మా అక్కయ్య వస్తుందనుకో...కాని...

జానకి: నీకోసమనే డబ్బాడు మైసూరుపాకం, కారప్పూస చేశాను బాబూ! మళ్ళీ పండుగ వెళ్ళగానే వచ్చేస్తాగా.

చంటి: నువ్వు లేకపోతే నాకీ యింట్లో యేం తోచదు వదినా! నేనీ యింట్లో ఉండలేను వదినా. (మళ్ళీ కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి)

జానకి: పోనీ వెళ్ళనులే. ఇక్కడే ఉంటాను. ఏడవకు బాబూ! వెళ్ళనుగా. సరేనా?

చంటి: కాదువదినా! నిన్ను మీవాళ్ళింటికి వెళ్ళొద్దనడం లేదు వదినా...మీ నాన్న నీకోసం వస్తూంటే నువ్వు రానంటే బాగుంటుందా?

జానకి: అవును. ఆమాటా నిజమే. గంపెడుఆశతో వస్తు న్నాడు.

చంటి: కాదు వెళ్ళిరా వదినా!...ఏమీ లేదు—తల్లి వున్నవాళ్లందరూ పండుగపూటా సర్దాగా

వుంటే— నేను దిక్కులేనివాణ్ణనిపించి దిగులుగా భయంగా వుంటుంది...ఏమో వదినా! నేనీ యింట్లో నువ్వులేకపోతే ఒక్క క్షణంకూడా ఉండలేను.

జానకి: పోనీలే, వెళ్ళను. ఇంతకూ మీ అన్నయ్య వెళ్లమనాలి, తానుకూడా వస్తాననాలి. అప్పుడుకదా నా ప్రయాణం.

చంటి: అప్పుడుమాటే వదినా! నే నుండలేను వదినా!

జానకి: పోనీ నువ్వుకూడా నాతో వద్దువుగాని.

చంటి: ఆ! నిజంగానా—నీతో నన్నుకూడా తీసుకెడతావా?

జానకి: ఆ! తప్పకుండా తీసుకువెడతా బాబూ!

చంటి: (అంతలోనే నిరుత్సాహం) మరి మా నాన్నగారు ఏమంటారో?

జానకి: నేను చెప్పివప్పిస్తాగా.

చంటి: ఎట్లా చెబుతావో వదినా! ముందు 'వాడుకూడా యెందుకు' అని తిడతారు.

జానకి: మరేం భయంలేదు. నేను చెబుతాగా! చెప్పి తప్పకుండా తీసుకువెడతా.

[రామం కోపంగా క్రొత్తసైకిలు నడిపించుకుంటూ లోపలికివచ్చి స్టేండ్ వేస్తూ]

రామం: ఎక్కడికి తీసుకువెళ్లడం.

జానకి: మావాళ్ళింటికండి. మాటలోనే వచ్చారు. మా నాన్న యీ మెయిల్ లో వస్తున్నారటండి. (ఆనందంగా)

రామం: ఎందుకు?

జానకి: పండక్కి మనిద్దర్నీ తీసుకువెళ్ళడానికి.

చంటి: నాన్నగారిపేర ఉత్తరం రాశారన్నయ్యా (ఇవ్వబోతాడు)

రామం: (పుచ్చుకోకుండా జానకితో) ఊ...తీసుకువెళ్ళి?

జానకి: అదేమిటండీ అల్లా అడుగుతారు?

రామం: వట్టిచేతుల్తో పంపడానికా? సిగ్గులేకపోతే సరి మొఖానికి ... మావ ... చెప్పుకోడానికి కూడా సిగ్గేస్తుంది మావ అని.

జానకి: ఏమిటండీ అది...ఏం జరిగిందో చెప్పరేం?

రామం: ఇంకేం జరగాలి. సినిమాలో ఎక్స్ట్రా వేషాలు వేసేవాడి అల్లుణ్ణనిపించుకోవలసి వచ్చింది ఈ వేళ.

జానకి: వేషాలు ఏమిటండీ?

రామం: ఏమిటా? మీ నాన్న సినీమాలో గుమ్మందగ్గర కాపలా ఉండే బంట్రోతు వేషం వేశాడు. తెలిసిందా...నా కర్మంకాలి మేట్నీకివెళ్ళాను. ప్రతివాడూ అడగడమే. 'ఒరేయ్! మీ మామగారు బంట్రోతువేషం వేశాడురోయ్' అని.

జానకి: ఒకవేళ వేశాడేమో!

రామం: పరువు మర్యాద అక్కరలే. ఆ బంట్రోతు వేషాలు వెయ్యకపోతేయేం? ఎందుకొచ్చిన బ్రతుకు.

జానకి: అవును. ఈ నిర్భాగ్యురాలికి పెళ్ళి కాదేమోనని భయపడి ఉన్న కొంప కాస్తా తెగనమ్మి కట్నం క్రిందపోసి పెళ్ళి చేశాడు. ఏంజేస్తాడు. కడుపుబాధ. ఎక్స్ట్రా వేషాలు వేస్తున్నాడు కాబోలు.

రామం: అదే నేను అనేది. తాను మానమర్యాదలు మంటగలుపుకున్నా ఇవతలవాళ్ల వంశం పరువు కొంచెమైనా గమనించలేక పోయాడనే చెప్పేది.

[ఈ మాటలు అంటూంటేనే చంటి గడియారం చూచి వీధిలోనికి నడుస్తాడు]

జానకి: ఎక్స్ట్రా వేషాలు వేసినంత మాత్రాన్ని తన మాన మర్యాదలు కాని ఇవతలవాళ్ళ పరువు కాని పోతుందని మా నాన్న తలచి ఉండడు.

రామం: ప్రతీవాడూ వాళ్ళ యిష్టమొచ్చినట్టు అడుగుతూంటే తల యెత్తుకు తిరగాలా?

జానకి: అడిగేవాళ్ళకి ప్రపంచజ్ఞానం లేదంటాను. మా నాన్న న్యాయంగా కష్టపడుతున్నాడు. సంపాదించుకుంటున్నాడు. ఎవరి కొంపలు దోచుకోవడం లేదు. మగపిల్లాణ్ణికని కట్నం పేరుచెప్పి ఎవరికొంప నిలువునా నీట్లో ముంచడం లేదు.

రామం: జానకీ!

జానకి: అవును. కట్నం నాలుగువేలిస్తేనే గాని పెళ్ళి చేసుకోనని చెప్పారు గాని తరువాత మా నాన్న బ్రతుకుతెరువుగురించి మీరేమీ కనుక్కున్నట్లు చెప్పలేదే?

రామం: చెప్పకపోతే......నాలుగువేలు పోసి ఘనముగా పెళ్ళిచేసిన పెద్దమనిషి అసహ్యంగా ప్రవ

రించి అల్లుడికి అపఖ్యాతి తెస్తాడని అనుకుంటామా?

జానకి : నిదానిస్తే ఇప్పుడు మీకొచ్చిన అపఖ్యాతి లేమీ లేదు.

రామం : అవును. ఇంటిలో కూర్చున్న నీకేం తెలుస్తుంది.

జానకి : నాలుగు వేళ్ళూ నోట్లోకి వెళ్ళేవాళ్ళు బయట ఎన్నైనా చెప్పుకుంటారు. అవి లెక్క చేస్తే మనం జీవించడమే కష్టం. నన్ను మొఖంమీదే అడిగింది. ఒకావిడ బుగ్గలు నొక్కుకుంటూ, 'ఏవిటి! చాకలాణ్ణి మానిపించేసి బట్టలు నువ్వే ఉతుక్కుంటున్నావట' అని, 'నీళ్లు తెచ్చే పనిమనిషిని కూడా మానిపించేశావుట అని' చదువుకున్న నీకేవిటి యీ రాత మహారాణీలాగ దాసీని పెట్టి చేయించుకోక' అని. వాళ్ళకేం తెలుస్తుంది మన బాధ. వాళ్ళేదో అన్నారని మనపని మనం చేసుకోవడం మానతామా?

రామం : ఆ బంట్రోతు వేషం వెయ్యకపోతే మరో పని ఏదయినా చేసుకు బ్రతకకూడదా అని నా బాధ.

జానకి : ఆయన్ని గురించి మీరు ఇప్పుడు బాధపడడం ఎందుకు? కనీసం ఈ కట్నంకోసం పొలం అమ్ముకున్నాక ఎట్లా బ్రతుకుతావనైనా మీరు ఆలోచించారా? కట్నాలు పొయ్యలేక నేనేదో ఉద్ధరిస్తానని కొంప కొస్తా తెగనమ్మి నాకు చదువు చెప్పించాడు. కొడుకువైనా నువ్వే కూతురువయినా నువ్వే అన్నాడు. కాని చివరకు ధైర్యం చేయలేకపోయాడు. నలుగురు నవ్వుతారని బాధపడ్డాడు. నాకిప్పుడు పెళ్లి వద్దు. ఏదైనా ఉద్యోగం చేసుకుంటానన్నా వినలేదు. ఉన్న పొలం కొస్తా తెగనమ్మి కట్నం క్రింద పోసి పెళ్ళిచేశాడు. చివరకు సర్వనాశనం అయ్యాడు నన్ను గురించి.

రామం: పొలం అమ్ముకుని నాలుగు వేలు మాకు గుమ్మరించి సర్వనాశనం కమ్మని, మాతో సంబంధం చేసుకుంటేనే గాని విలువలేదని మేమేమీ బలవంతం చెయ్యలేదే.

జానకి: నాలుగు వేలిస్తే నేమాట్లాడమన్నారు, లేకపోతే అవతలికి నడవమన్నారు. అది చాలదూ. ఒక అయ్యని దేహి అని చెయ్యిచాచి అడక్కుండా ఏ అన్యాయానికి పాల్పడకుండా సినిమాలో వేషాలు వేసికొని బ్రతుకుతూ పండుక్కి పరువుకోసం అల్లుణ్ణి కూతుర్ని తీసుకువెడదామని రాబోయే మామగారిపై కనీసం సానుభూతి చూపించడం పోయి పరువు పోయిందని మాట్లాడుతున్నారు. ఎవరో విజ్ఞానశూన్యులు ఏదో అన్నారని బాధపడుతున్నారా? పరిస్థితులు గమనించి ఒక్కసారి దూరం ఆలోచించండి.

రామం: ఆలోచించే చెబుతున్నాను.

జానకి: ఏమని.

రామం: నువ్వు మీ వాళ్లింటికి వెళ్లడానికి వీల్లేదని.

జానకి: సరే, మీ పరువుకోసం, మర్యాదకోసం, నేను మావాళ్ళింటికి వెళ్లడం మానేస్తాను. సరేనా?

రామం: మీ నాన్న నా గుమ్మం తొక్కడానికి కూడా వీల్లేదు.

జానకి: తీరా వస్తున్నాడుగా. ఇంకెప్పుడు రావద్దని చెబుతాను. సరేనా?

[ప్రకాశరావు చేతిలో సంచీతో అప్పుడే రైలు దిగి వచ్చి ఈ మాటలు వింటాడు; కూడా చంటి ఉన్నాడు]

ప్రకా : ఏవిటమ్మా అది.

రామం : (ప్రకాశరావుని చూచి లోనికి వెళ్ళిపోతాడు)

ప్రకా : అమ్మా! జానకీ! నా ఉత్తరం అందిందా?

జానకి : అందింది నాన్నా (అని లోనికి వెడుతుంది.)

ప్రకా : మీ నాన్నగారున్నారా చంటిబాబూ!

చంటి : మా అక్కయ్యని పండుక్కి తీసుకురావడానికి వెళ్లారండి.

జానకి : (చెంబుతో నీళ్లు తెచ్చి) కాళ్ళు కడుక్కో నాన్నా.

ప్రకా : (కాళ్లు కడుక్కొందుకు వీధిలోనికి వెడతాడు)

జానకి : (ఏమీ చెప్పవద్దని చంటికి సైగచేసి లోనికి వెడుతుంది.)

[ప్రకాశరావు కాళ్లుకడుక్కొని లోనికి వస్తాడు. చంటి చెంబు తీసుకుని తుండుగుడ్డ యిస్తాడు. ప్రకాశరావు కాళ్లు తుడుచుకుంటూవుంటాడు.]

జానకి : (మంచినీళ్ళు తెచ్చి తండ్రికిస్తుంది.)

ప్రకా : (మంచినీళ్లు త్రాగి) ఏవిటమ్మా! ఘర్షణ పడుతున్నారు?

జానకి : (మాట్లాడదు)

ప్రకా : నేనేమైనా నీపట్ల పొరబాటుచేశానా?

జానకి : లేదునాన్నా.

ప్రకా : పోనీ అబ్బాయి రామంపట్ల ఏదైనా పొరబాటు చేశానా?

జానకి : అవునట.

ప్రకా : ఏంచేశానమ్మా?

జానకి : ఆయన పరువు మర్యాద మంటగలుపుతున్నానట.

ప్రకా : నేనా?

జానకి : అవును.

ప్రకా : అంటే?

జానకి : సినిమాలో బంట్రోతు వేషం వేశావుటగా.

ప్రకా : వేస్తే!

జానకి : వేస్తేయేమిటి? ప్రతివాడూ ఆయన్ని అనుకుతున్నాడట 'ఏంరోయ్! మీ మామగారు బంట్రోతు వేషం వేశాడేమిటిరోయ్' అని.

ప్రకా : ఇదా నేనుచేసిన పొరబాటు. న్యాయంగా కష్టించి సంపాదించాలనే ఉద్దేశ్యంతో సినిమాలో చిన్న వేషం వెయ్యటంకూడా తప్పేనన్నమాట. చేసుకునే గుమాస్తాపనితో మా యిద్దరిపొట్టలు ఏలాగడుస్తాయి...

జానకి : మరియింకెందుకునాన్నా! సినిమాలో వేషాలు వెయ్యడం?

ప్రకా : ఎందుకా? పండుక్కి మీఆయన్ని నిన్ను తీసికొనివెళ్ళి మీ ఆయనకు నలుగురి మిత్రులలోను కొంత గౌరవంగాఉండేటట్లు ఘనంగా బహూకరిద్దామని.

రామం : (పెన్సిలు చెక్కుతూవస్తూ) అంత ఘనంగా బహూకరించలేనివారు ఈ పెళ్ళి ఎందుకు చేయాలి.

ప్రకా : ఎందుకా? ఆడపిల్లని కన్నందుకు.

రామం : మీరేనా ఆడపిల్లని కన్నది. లోకంలో ఇంకా ఎవరేనా కంటున్నారా?

ప్రకా : ఆడపిల్లల్ని కన్న ప్రతీతండ్రికీ యీ బాధలు ఉన్నవే.

రామం : మొదట్లోనే ఆలోచించుకోవలసింది.

ప్రకా : ఏమిటది?

రామం : పండుక్కి కూడా అల్లుణ్ణి తీసుకువెళ్ళలేనిమా [illegible]నుకున్నప్పుడు...

ప్రకా : ఈ వివాహం ఎందుకు చేశానంటావు.

రామం : అవును.

ప్రకా : ఆనాడే చెప్పాగా? నాలుగువేలు కట్నం కావాలన్నప్పుడే.

రామం : ఏమని?

ప్రకా : కాదూ కూడదు, నాలుగువేలు కట్నం యిమ్మంటే ఆ కొంప కాస్తా అమ్మెయ్యాలి. అది అమ్మేస్తే నా రెక్కలే మిగిలేది అని చెప్పా. రెక్కలు మిగిలాక ఘనంగా బహూకరించగలశక్తి ఎలా ఉంటుందనుకున్నావు బాబూ?

రామం : అందుకని అడిగిన నాలుగువేలు కట్నం యిచ్చి పెళ్ళిచేసేస్తే తరువాత పండుగ పబ్బాలకి తీసువెళ్ళక్కరలేదు. అల్లుడు ముద్దుముచ్చటలు తీర్చక్కరలేదు అనుకున్నారా?

ప్రకా : అందుకేకదు. ఎవరో వాళ్ళని ప్రాధేయపడి అడిగితే వాళ్ళ ధర్మమా అని ఏదో చిన్న వేషం ఇచ్చారు. ఆ డబ్బు భద్రంగా......

రామం : జాగ్రత్త పెట్టారు. ఆ పాపిష్టిసొమ్ము నాకిచ్చి ఈ పండుగ ఋణం తీర్చుకుంటారు. అంతేగా?

ప్రకా : నీ దృష్టిలో పాపిష్టిసొమ్ము అయినా నా దృష్టిలో రక్తం ధారపోసి సంపాదించిన డబ్బు.

రామం : అని మీ రనుకుంటే సరా?

ప్రకా : ఆ! మరెవరు అనుకోవాలి.

రామం : పెళ్ళిలో యిస్తానన్న గడియారం ఇంతవరకు యిచ్చారా?

ప్రకా : ఇవ్వలేకపోయాను.

రామం : క్రిందటి పండుక్కి రాలీసైకిలు ఇస్తానన్నారు యిచ్చారా?

ప్రకా : లేదు.

రామం : (వెనక్కు తిరిగి) మరి మళ్ళీ ఏ ముఖం పెట్టుకుని వచ్చారు.

ప్రకా : (కోపంగా) రామం. ముందు వెనుక ఆలోచించి మాట్లాడు. దురుసుతనంగా మాట్లాడడమే ఘనతకాదు...ఇప్పుడు తీసుకొనివెళ్ళి...

రామం : చాలు. ఇదివరకెంతయిందా. పండుక్కి అత్తారింటికి వెళ్ళివస్తే ప్రతీవాడూ అడగడమే. మామగారు ఏం పెట్టార్రా అని. చెప్పలేక చస్తున్నాను. మీకు లేకపోయినా మాకు పరువు మర్యాద

ఉన్నాయి. మానమర్యాదలు వదిలేసి బ్రతకడం లేదు.

ప్రకా: ఎవరో ఏదో అన్నారని...

రామం: అన్న మాటలన్నీ లెక్క చేసుకోకుండా బ్రతకడం మాకు చేతకాదు.

ప్రకా: లెక్క చేసుకోకుండా బ్రతకమని నే ననడం లేదు.

రామం: మరి.

ప్రకా: కొంత మంచి చెడ్డ ఉందిగా.

రామం: మంచి చెడ్డ ఆలోచించే నా సినీమాలో బంట్రోతు వేషం వేసింది.

ప్రకా: పోనీ గతాన్ని వొదిలెయ్యి బాబూ! ఇస్తానన్నవి ఇయ్యలేకపోయాను. పొరబాటే.

రామ: మళ్ళీ ఇప్పుడు తీసుకొనిపెళ్ళి ఎప్పటి పాటే పాడితే...

ప్రకా: నన్ను శాంతంగా చెప్పనియ్యకపోతే ఎలా బాబూ?

రామం: ఏమిటి చెప్పేది? మళ్ళీ నలుగురిలోను తలెత్తుకు తిరగలేను!

ప్రకా: ఇప్పుడా సైకిలు గడియారం కొనిద్దామనే...

రామం: అక్కర్లేదు. ఆ రెండూ నా డబ్బుతో నే కొనుక్కుని పరువుకోసం నా మిత్రులతో మా మామగారు కొనిపెట్టారని చెప్పుకున్నాను. ఏం చెయ్యను.

ప్రకా: మంచి పని చేశావు బాబూ! చిన్నవాడవైనా నా పరువు నిలబెట్టినందుకు అభినందిస్తా. పోనీ సైకిలు గడియారం కాకపోతే మరొకటి.

రామం: (మరల పెన్సిలు చెక్కుతూ) నాకేం అవసరం లేదు. నేను మీ యింటికి రాదల్చుకో లేదు.

ప్రకా: ఆ! దూరం ఆలోచించి చెప్పు నాయనా? ఆ చెక్క పెన్సిలు అక్కడపెట్టి నా వంక చూచి చెప్పు బాబూ! నువ్వు చెక్కేది పెన్సిలు కాదు. నా హృదయాన్నే చెక్కుతున్నావు.

రామం: నేనేమీ మీ హృదయాన్ని చెక్కడం లేదు. మనిద్దరి హృదయాలు బయటవాళ్లు చెక్కకుండా నేను చెప్పే సలహా యిది. దూరం ఆలోచించే చెబుతున్నాను. నేను మీయింటికి రాకపోవడం వల్ల మీకూ యిబ్బందివుండదు. నాకూ యిబ్బంది ఉండదు. మీ అమ్మాయిని వస్తానంటే తీసుకువెళ్ళండి మళ్ళీ పంపని పద్ధతిని. నా అభ్యంతరం లేదు (లోనికి వెళతాడు)

ప్రకా: (రామం వెళ్ళిన వైపు చూస్తూ) రామం! మళ్ళీ పంపనిపద్ధతికోసం నీకిచ్చి పెళ్ళి చెయ్యలేదు. చిలకా గోరింకల్లా కాపురం చేస్తుంటే చూచి ఆనందిద్దామనే అడిగిన కట్నం యిచ్చి పెళ్ళి చేశాను. కూతురు సుఖాని కాశించానే గాని తాతలనాటి కొండ్రకొంత అమ్ముకుంటున్నామే అన్న విచారం అప్పుడు గాని ఇప్పుడు గాని సుంతైనా లేదు. ఆనందపెట్టవలసిన అల్లుడు దొరికాడు గదా అనే గర్వపడ్డాను. ఒక్కగాని ఒక్క బిడ్డ పండుక్కి తీసుకుపోదామని వచ్చానుగాని మీ భార్యా భర్తల్నిద్దర్ని విడదీయడానికి కాదు వచ్చింది. అది మాత్రం గుర్తుంచుకో...
చిన్నవాడవైనా నిన్ను ఒక్కటి అడుగుతున్నా నామీదుండే క్రోధం అమాయకురాలు ఈ నా బిడ్డ జానకిమీద మాత్రం చూపించి బాధపెట్టకు. అంతే నేకోరేది. మీ రిద్దరూ సుఖంగా ఉండడమే నాక్కావలసింది. నాయింటికి వస్తే సంతోషమే. ఆపైన నీ యిష్టం. రానంటావా నీ మనస్సును బాధపెట్టను. వస్తా, అమ్మా!

జానికి: నాన్నా! (ఏడుస్తుంది)

ప్రకా: తప్పమ్మా! అలా కన్నీరు పెట్టకోవచ్చా?

జానకి: కొడుకువైనా నువ్వే, కూతురువైనా నువ్వే అని కొంప కొంత తెగనమ్మి చదువు చెప్పించావు. కొండ్ర కొంత తెగనమ్మి పెళ్ళిచేశావు. ఈ నిర్భాగ్యురాలి కోసం ఉండడానికి కొంప తినడానికి తిండి లేకుండా చేసుకున్నావా నాన్నా.

ప్రకా: పోనీలేమ్మా! అదంతా యెందుకిప్పుడు నువ్వు సుఖంగా ఉండడమే నాక్కావలసింది. అతడేదో ఆవేశంలో అన్నాడన్నా నీపట్ల కఠినంగా ప్రవర్తించే అజ్ఞాని కాడనే నమ్ముతున్నాను. నువ్వేం బాధ పడకమ్మా. అతని మనస్సు శాంతిపడితే మరో పండుక్కి. ఏం చేస్తాం తల్లీ. వారానికోసారి అయినా మీ యిద్దరి యోగక్షేమాలు కొంత కోర్తుమక్క

వ్రాస్తాండు. అతనికి తీరుబడి ఉండకపోవచ్చు. వస్తా. నేను మళ్ళీ అతనికి కన్పించి అతని కోపాన్ని రెచ్చగొట్టి మీయిద్దరి మధ్య అనురాగాన్ని చెడగొట్టడం కన్న వెళ్ళిపోవడమే మంచిదను కుంటానమ్మా.

జానకి: నాన్నా వెళ్ళిపోతావా? (ఏడుస్తుంది)

ప్రకా: తప్పమ్మా ఏడవ కూడదని చెప్పానా?

చంటి: (వదిన ఏడుస్తూంటే తనకు కూడా దుఃఖం వస్తుంది. కళ్ళనీళ్ళు తుడుచుకుంటాడు)

ప్రకా: చూడు పాపం నువ్వేడిస్తే చంటిబాబు కూడా ఏడుస్తున్నాడు. ఊరుకో తల్లీ! ఊరుకో చంటి బాబూ!

చంటి: మామగారూ: మా అన్నయ్య ఏదో ఆవేశంలో ఏవేవోమాటలు మిగిలాడు. మీకు మా వదినెకు కూడా కష్టం కలిగించి ఉంటాడు. కాని కొంచెం నామాట వినరూ?—మీరు వెళ్ళిపోవడం అట్టే మంచిపని కాదు.

ప్రకా: ఏం చెయ్యమంటావు బాబూ!

చంటి: పెద్దవారు మా నాన్నగారు వచ్చేవరకు ఉండి వారిని కూడా అడిగి వెళ్ళడం ధర్మమేమో మరొక్కసారి ఆలోచించండి. చిన్నవాణ్ణి మీకు చెప్పదగ్గవాణ్ణి కాదు గాని.

జానకి: అవును నాన్నా. అట్లా చెయ్యకూడదూ. అప్పటికి ఆయనకీ కొంచెం కోపం తగ్గుతుంది. దూర దృష్టితో చెప్పిన మా చంటి బాబు మాటలు కొట్టెయ్యడానికి వీల్లేదు నాన్నా. ఇవ్వాళ నేను లేచిన వేళావిశేషం గాకపోతే సైకిలు గడియారం విషయం ఆయనెప్పుడూ ఎత్తలేదు. ఇవాళ ఆయన బయట విన్న మాటలకు మనస్సు బాగా కష్టపెట్టుకుని ఉండాలి.

చంటి: అట్లా చెయ్యండి మామగారూ! కాస్సేపటికి మా నాన్నగారు కూడా వచ్చేస్తారు.

ప్రకా: సరేబాబూ! అట్లాగే చేస్తాను. మీ నాన్నగారిని కూడా అడిగే వెడతా. అంతవరకు నేను ఎదురుగుండా ఉండి మీ అన్నయ్య కోపాన్ని రెచ్చగొట్టడం కన్న అలా నా స్నేహితుని యింటికి వెళ్ళి మీ నాన్నగారు వచ్చాక వస్తా. అమ్మా! ఈ సంచి జాగ్రత్త చెయ్యి తల్లీ!

జానకి: అలాగే నాన్నా!

ప్రకా: వస్తానమ్మా. (వీధిలోనికి వెడతాడు)

జానకి: చూశావా చంటీ! ఏం జరిగిందో? తానొకటి తలిస్తే దైవం ఒకటి తలచాడంటారు. నిన్ను కూడా తీసుకువెడతానని ఆశ పెట్టాను.

చంటి: ఇప్పుడు మాత్రం ఏమయింది వదినా! నాన్నగారు రానియ్యి చెబుతాను యీయన సంగతి. పెద్దమనిషి గుమ్మంలోకి వస్తే నోటికంత వస్తే అంతా అనెయ్యడమే మంచిచెడ్డ లేకుండా...

జానకి: నోర్మూయియ్యి చంటీ! అన్నయ్యని అలా అనొచ్చా.

చంటి: నీకు కోపంవచ్చినా సరేగాని అన్నయ్య అయ్యేది తండ్రి అయ్యేది, న్యాయం ఉండక్కరలే.

జానకి: అయినా సరేబాబూ! ఇదంతా నా గ్రహస్థితి కాకపోతే ఎప్పుడైనా అన్నయ్య యీ యింట్లో ఎవరి పట్లైనా ఇంత కఠినంగా మాట్లాడారా? అన్నయ్యని అట్లాంటి మాటలు అని నా మనస్సు కష్ట పెట్ట దలచుకుంటే నీ యిష్టం వచ్చినట్లు అను. (ఏడుస్తుంది).

చంటి: లేదు వదినా! నీ మనస్సుకు కష్టం కలిగించను వదినా! ఏడవకు వదినా! అన్నయ్య నేం అనను వదినా!

జానకి: అన్నయ్యనేకాదు. పెద్దల్ని ఎవర్ని కూడా తూలనాడకూడదు. తల్లిలేని బిడ్డవు. నేనే నిన్నిట్లా తయారు చేశానని లోకం ఆడిపోసుకుంటుంది.

రామం: (లోపలినుంచి వస్తూ) పాపం. కొనిస్తాడట సైకిలు గడియారం. సిగ్గులేకపోతే సరి మొఖానికి. ఇస్తానని యెగ్గొట్టిందిచాలక ఇప్పుడు మళ్ళీ నా గుమ్మం త్రొక్కడానికి సిగ్గెలా లేదో.

జానకి: మా నాన్న ఇక్కడ లేరండీ.

రామం: అహా! ఇప్పుడిక్కడున్నాడని ఈ మాటలు నేనంటే నన్ను తీసుకువెళ్ళడానికి బ్రతిమాలతావని నేననడంలేదు. అయినా వెళ్ళిపోయేవాడికి ఉండమని సలహా యిచ్చారుగా వదిన మరిది పోగయి.

చంటి: అవును అన్నయ్యా! నీకు కోపం వచ్చినా సరే గాని వదిన్ని పుట్టింటికి పంపడానికి నువ్వెవరవు.

రామం: అంటే!

చంటి: నువ్వెంత భర్తవయినా ఈ కుటుంబానికి పెద్దయిన నాన్నగారు యింకా బ్రతికే ఉన్నారు.

జానకి: చంటీ! } (ఇద్దరూ ఒకేసారి
రామం: ఏమిటావు నోర్ముయ్యి } అంటారు).

చంటి: (ఏడుస్తూ) వదిన మనస్సుకు కష్టం కలిగించడం భావ్యంకాదు అన్నయ్యా! వదిన కన్నీరు పెట్టిందంటే అది మనకు జయంకాదు అన్నయ్యా! అమ్మ బ్రతికివుంటే ఇవ్వాళ నీ మాటలు వింటే ఏమయేది?—ఈ ఇంట్లో అమ్మకీ వదినకీ తేడా యేమిటి?

జానకి: (ఏడుస్తూ) అబ్బబ్బ! వదిన, వదిన, వదిన... కాస్సేపు నువ్వు వీధిలోకి వెళ్ళుబాబూ. నీకంతైనా పుణ్యముంటుంది. (వీధి వైపుకు గెంటుతుంది).

చంటి: (ఏడుస్తూనే) అదికాదు వదినా!

జానకి: చంటి! నీకే చెప్పేది. వెడతావా? వెళ్ళవా? (ఏడుస్తూ)

చంటి: వెడతాను వదినా! (వెడతాడు)

రామం: ఊ! అట్లా తయారుచేశావు వాణ్ణి.

జానకి: (తెల్లబోయి) నేనా?

రామం: అవును

జానకి: (మాట్లాడలేదు. కన్నీరు కారుతూంటుంది. లోనుంచి దుఃఖం పొర్లి పొర్లి వస్తూంటుంది. బలవంతంగా దుఃఖాన్ని అపుజేసుకుంటుంది. కళ్ళు మూసుకు నిలబడిపోతుంది)

[కొద్దిక్షణాలు నిశ్శబ్దం]

రామం: కొంపలో యింత రాద్ధాంతం యెందుకు? నీకంత వెళ్ళాలనుంటే వెళ్ళరాదూ?

జానకి: నేను మీతో చెప్పానా? వెళ్ళాలని ఉందని.

రామం: వేరే చెప్పాలా?

జానకి: మరి దీన్నిబట్టి గ్రహించగలిగారు. అయినా పరువు మర్యాదలేని కొంపకి మీ అర్థాంగినయిన నేను వెడితే మీ పరువు పోదూ.

రామం: నోర్ముయ్యి.

జానకి: మూసుకునే ఉన్నాను. శాస్త్రం చూస్తూ చదువుకొవటంచేత విజ్ఞానంతో మనిషిలా బ్రతుకగలనని ఆశపడ్డాను

రామం: ఇంతిట్లో నీ ఆశయేమీ నిరాశకాలేదు.

జానకి: ఆశ నిరాశా కాలేదు. నేను మనిషిలా గుర్తింపబడ లేదు.

రామం: ఎందువల్ల?

జానకి: మీ వలెనే నాకు తలితండ్రులపై మమకారం ఉంటుందన్న విషయం మరచి పోయారు. సుమ్మంలోకి వచ్చిన కన్నతండ్రిని కనీసం మర్యాదచేసి మంచిచెడ్డ అడగడానికైనా నోచుకోని ఒక అభాగ్యురాలి హృదయావేదనను గమనించలేక పోయారు.

రామం: పొరబడుతున్నావు జానకీ! నిన్ను తీసికొని వెళ్ళవచ్చునని మీ నాన్నకే చెప్పాను.

జానకి: ఏమని చెప్పారు. మీ అమ్మాయి వస్తానంటే తీసుకు వెళ్ళండి మళ్ళీ పంపని పద్ధతిని అనేనా? ఏమిటి ఈ మాటకర్థం?—తేలికగా అనేశారు మగవారు గనుక.

రామం: పెళ్ళిలో గడియారం యిస్తానని మొదటి పండుగకి సైకిలిస్తానని నలుగురిలో యెందుకు చెప్పాలి.

జానకి: ఇద్దామనే చెప్పాడు.

రామం: ఇచ్చాడా?

జానకి: ఇవ్వలేకపోయాడు.

రామం: నేను కొనుక్కునే వరకు తలెత్తుకు తిరగలేక పోయానే. అడిగే వాళ్ళకు సమాధానం చెప్పలేకపోయానే.

జానకి: మా నాన్నది పొరబాటే. ఇవ్వడిస్తానంటున్నాడుగా.

రామం: ఎందుకు కొనుక్కున్నాక?

జానకి: అదిగాకపోతే మరొకటి.

రామం: నమ్మకం మేమిటి?

జానకి: మాటే నమ్మకం. పోనీ యీ ఒక్కసారి చూడవచ్చును. గంపెడాశతో వచ్చాడు ఇద్దర్నీ తీసుకు వెడదామని. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. మరొక్కసారి ఆలోచించండి.

రామం: ఆలోచనకేముంది. నేను రానని చెప్పేశానుగా.

జానకి: చెప్పినంతమాత్రాన్ని మళ్ళీ వెళ్ళకూడదని యెక్కడుంది.

రామం: ఏమో! నా మనస్సెందుకో బాధపడుతూంది. వెళ్ళడానికి యెంతమాత్రం అంగీకరించడంలేదు.

జానకి: పోనీలెండి. మీ మనస్సు బాధ పడుతూంటే వెళ్ళవద్దు. మానివేద్దాం. నేను మా నాన్నకి వచ్చ

చెప్పి పంపించి వేస్తాను. మీ మనస్సుమాత్రం పాడుచేసుకోకండి.

రామం : అనవసరంగా నీ హృదయాన్ని కష్టపెట్టాను జానకీ! నన్ను గురించి నువ్వేం బాధపడవద్దు. నువ్వెడతానంటే నా అభ్యంతరం లేదు. హృదయ పూర్వకంగా అంగీకరిస్తాను.

జానకి : ఇంత గొడవ జరిగాక ఇంక నేనూ మీరు లేకుండా వెళ్ళలేను. వెళ్ళినా నా మనస్సంతా కల్లోలంగా వుంటుంది.

[పానకాలశాస్త్రి వీధిలోనుంచి వస్తూ]

పాన : జనార్దనరావుగారూ!

రామం : ఎవరు? (వెనక్కు తిరిగి) ఓ! పానకాల శాస్త్రిగారా!

పాన : అవును బాబూ! నాన్నగారు లేరూ?

రామం : లేరండి. చెల్లాయిని పండుక్కు తీసుకురావడానికి వెళ్ళారు.

పాన : అల్లాగా! బాగుంది. చేసుకున్న పొడుం అయిపోయింది. ఒక్క పట్టు పొడుం తీసికెడదామని వచ్చాను.

రామం : అయ్యో పాపం— లేరండి.

పాన : పోనీలే. ఏమిటి మీ మామగారు వచ్చి నట్టున్నారు?

రామం : అవునండి.

పాన : అప్పుడే వెళ్ళిపోతున్నారేమిటి?

జానకి : వెళ్ళడం లేదండి. అలా స్నేహితులింటికి వెళ్లారు.

పాన : బావుందమ్మా. ఏమిటోయ్ రామం. మీ మావగారు ఇన్నేళ్ళొచ్చి ఇప్పుడు మొదలు పెట్టాడుట యేమిటి సినీమాలో వేషాలు వెయ్యడం.

జానకి: ఎవరు చెప్పారు బాబూ మీకు?

పాన: అహా! మా అబ్బాయి ఈపూట సినీమాకు వెళ్లాడు. అందులో గుర్తుపట్టాడుట మీ నాన్న గారిని.

జానకి: ఏమోలెండి. వేశారు కాబోలు.

పాన: అదేనమ్మా. అది. పండుక్కు తీసికొని వెళ్ళడానికి వచ్చారా మీ నాన్నగారూ!

రామం: (అసహ్యంగా అయనవంక చూచి లోనికి వెడతాడు.)

జానకి: అవునండి.

పాన: అయితే వెడతారా?

జానకి: ఏదో చేస్తాంలెండి.

పాన: వచ్చి ముద్దు ముద్దుగా పిలిస్తే వెళ్ళకపోతే బాగుంటుందా మరి

జానకి: అవునులెండి.

పాన: అయితే సైకిలు గడియారం యిచ్చారు కాదని ఏదో మాట మాట పట్టింపు వచ్చిందని విన్నాను.

చంటి: (వీధిలోనుంచి లోనికివస్తూ) విన్నారా? ఎక్కడ విన్నారు బాబూ! ఏ వీధిలో విన్నారు? గోడచాటున్నుంచుని విన్నారా? ... చాలు చాలులే వెళ్ళవయ్యా? ఒకళ్ళ యింట్లో గొడవలు తెలుసుకోవడమే పనిలాగుంది నీకు. మా మామగారు ఇన్నేళ్ళొచ్చినా సినీమాలో వేషాలు వేస్తున్నారేగాని ఇంకేం తప్పుడు పనులు చెయ్యడంలేదు. వాళ్ల జుట్టుకు వీళ్ళజుట్టుకు ముడెట్టి ఎవరికొంపలు ఆగ్గెయ్యడంలేదు. అమాయకురాలైన కోడలికి కొడుక్కి మధ్య కలహాలు లేవదీసి పడకుండాచేసి కోడల్ని పుట్టింటికి పంపించేసి మళ్ళీ కట్నంకొట్టెయ్యొచ్చునని కొడుక్కి పెళ్ళి ప్రయత్నాలేమీ చెయ్యడం లేదు వెళ్ళవయ్యా! ఇక వెళ్ళు.

పాన : ఆ! ఆ! అదేమిటి? మా కోడల్ని నేను పంపించి వేయండే. అదే వెళ్ళిపోయింది.

చంటి : పాపం. అల్లాగా!

పాన : ఆ! మా వాడికి పెళ్ళి ప్రయత్నం నేను చేస్తున్నానా; వాళ్ళంతట వాళ్ళు వచ్చి పెళ్ళాం ఉన్నా సరే కట్నం యింతియిస్తాం అంతియిస్తాం అని అడుగుతూంటే......

చంటి : అడిగినంతమాత్రాన్ని ఆశించి మళ్లీ పెళ్ళికి యిష్టపడేరు గనుక — చేతికి బేడీలు తగిలించి లాక్కుపోతారు.

పాన : పెద్దవాణ్ణి పట్టుకొని అల్లా దులిపెయ్యడం ఆట్టే మంచిపని కాదబ్బాయి.

చంటి : వయసులో మీరు పెద్దయితే అయి ఉండొచ్చు. కాని ఆలోచనలలో చాలా చిన్నవారే. మీ మెదడు చాలా చిన్నది. నన్నాట్టే రెచ్చగొట్టక మీ దారిని మీరు సెలవుపుచ్చుకుని మళ్లీ ఈ ఇంటి చాయలకు కూడా రాకండి. నా చేతికి పని చెప్ప వలసి వస్తుంది.

పాన : వస్తానమ్మాయి నా కెందుకు. ముక్కుపొడుం కోసం వచ్చానుగాని (వెడతాడు).

చంటి : ముక్కు పొడుంకోసం వచ్చాట్ట పాపం. వదినా!.........

జానకి : (చంటిలోనికి వచ్చింది లగాయతు చంటివంకే చూస్తూ నిలబడిపోయింది. దుఃఖంపొర్లి వస్తోంది. కన్నీరు ప్రవహిస్తోంది. మాట్లాడదు).

చంటి : అదేమిటి వదినా! ఏడుస్తున్నావు.

జానకి : బాబూ! వదిన చచ్చిపోతే నేగాని నీకే దురుసు తనం తగ్గదా?

చంటి : ఏం మాటలవి వదినా!

జానకి : అవును బాబూ! ఇప్పుడే మీ అన్నయ్య అన్నారు—నిన్నిట్లా నేనే తయారు చేస్తున్నా నని.

చంటి : ఇంకెప్పుడూ ఎవరినీ ఏమీ అనను వదినా.

రామం : (లోనుండివస్తూ) సరేగాని నాఆఫీసు ఫైలు కనబడదేం?—టైపు చేసుకోవాలి.

జానకి : రాత్రి ఆకాగితాలు టైపుచేసి ఆఫైలు నాపెట్టెలో పెట్టాను.

రామం : ఏమిటీ! ఆకాగితాలన్నీ టైపు చేశావా?

జానకి : అవునండి—ఏం?

రామం : అన్ని కాగితాలూ! (ఆశ్చర్యంగా)

జానకి : (మౌనం)

రామం : నేనేదో మాటవరసకంటే...

జానకి : ఏమో! అర్జంటేమో ననుకున్నాను.

రామం : ఏంపని చేశావు జానకీ!

జానకి : మరేం ఫరవాలేదు లెండి.

చంటి : అదుగో నాన్నగారు వస్తున్నారు; అక్కయ్య యేదీ?

[జనార్దనరావుగారు వస్తారు]

చంటి : ఏం నాన్నా? అక్కయ్యేదీ?

జనా : మాట్లాడకుండా కండువా కుర్చీమీద వేసి కోటు విప్పి అక్కడ పడేస్తాడు)

జానకి : (కాళ్ళు కడుక్కొందుకు నీళ్ళు తెచ్చి యిస్తుంది)

జనా : పుచ్చుకోకుండా (కుర్చీలో కూలబడతాడు.

జానకి : (లోనికిపోయి మంచినీళ్ళు తెచ్చియిస్తుంది)

జనా : (పుచ్చుకోకుండానే) అక్కర్లేదమ్మా.

[ఒక్కక్షణం అంతా నిశ్శబ్దం]

రామం : ఏం నాన్నా! చెల్లాయిని పంపలేదా:

జనా : లేదు—

రామం : ఏం?

జనా : తెలియనట్లు అడుగుతావేం నాయనా? కట్నంతాలూకు బాకీ పూర్తిగా యివ్వలేదు గదా. పూర్తిగా యిచ్చి పిల్లని తీసుకు వెళ్లమన్నాడు.

రామం: అల్లాగేం.

జనా : అవును. అతని తప్పేముంది. అన్నాడంటే అనడూ! ఆనాడు గొప్పకి యిస్తామన్నాము. పూర్తిగా యివ్వలేక పోయాము. అడిగాడని బాధ యెందుకు? అడగడంలో తప్పేముంది. అయినా ప్రాధేయపడ్డాను; ససేమిరా పంప నన్నాడు.

రామం : పంపనన్నాక ప్రాధేయపడ్డం అనవసరం నాన్నా!

జనా : నీకేం తెలుస్తుందిరా యిప్పుడు. రేపొద్దున్న ఇద్దరు ఆడపిల్లలు పుట్టి పెళ్ళిళ్లు చేసినప్పుడు గాని తెలియదు. ఆడపిల్లని కన్నతండ్రి హృదయం ఎంత బాధపడుతుందో నీకేం తెలుసురా? తల్లి లేని లోటు కనబడకుండా పండుక్కి తీసుకు వద్దామని వెళ్ళా—అల్లుడు అగ్గిమీద గుగ్గిలం అయ్యాడు. పంపనంటే పంపనన్నాడు. మహాలక్ష్మిలా నట్టింట ఈ నాలుగు రోజులూ కళకళ లాడుతూ తిరుగుతుందనుకున్నా (కళ్లు నీళ్ళు తిరుగుతాయి)

జానకి : పెద్దలు. ధైర్యం వహించాలిగాని అంతలోనే అలా బెంబేలు పడిపోతే ఎట్లా?

జనా : ఏమోనమ్మా! చెప్పొద్దూ హృదయం బాధ పడుతూనే ఉంది. చెట్టంత తండ్రిని ఇంకా బ్రతికుండి పండక్కి బిడ్డను తీసుకురాలేకపో యాను. కాకుల్లా పొడుస్తారు ప్రతివాడూను అమ్మాయిని తీసుకురాలేదేం అని. ఇటు పరువు కోసమే ఏడవనా! అటు బిడ్డ నట్టింటికి రాలేదని ఏడవనా.

రామం : (మెదడు చికాకై వెనుక వైపున అటూ యిటూ తిరుగుతాడు)

చంటి : (తండ్రిమాటలు వింటూ మధ్యమధ్య రామం వంక చూస్తూంటాడు)

జానకి : మీరేంచేస్తారు.

జనా : చేసేదేముందమ్మా? కట్నంతాలూకుసొమ్మువస్తే నే గాని ఆ దొరగారు పంపరు. పొట్టలు గడ వడమే కష్టంగా ఉంది. ఒక్క రెక్కమీద నలుగురు బ్రతకాలి. మహానుభావుడుమీ నాన్న,

చెయ్యొత్తి దణ్ణం పెట్టాలి. అన్నుకున్నమాట ప్రకారం ఆయిన కొండ్ర కాస్తా తెగనమ్మి అనుకున్న కట్నం అణాపైసలతో నలుగురి లోనూ యిచ్చి నా గౌరవాన్ని కాపాడి తన గౌరవాన్ని కాపాడుకున్నాడు. నేనూ ఉన్నాను. ఎందుకూ? ఆ కొండ్ర కాస్తా అమ్మేశాక పాపం యేం ఇబ్బంది పడుతు న్నాడో మీ నాన్న.

చంటి : మీకు ఇవ్వాళే ఉత్తరం రాశారు నాన్నగారూ!

జనా : ఎవరు?

చంటి : వదిన నాన్నగారే. ఇదిగో (యిస్తాడు)

జనా : (చదువుకొని) హుం! పాపం! 'నా కోరిక తీరు స్తారని ఆశిస్తా' (అని ఉత్తరంలోని ఆఖరి ముక్కలు చదివి) ఇంతలోనే తీర్చావని అను మానం యెందుకువచ్చిందో పాపం...అను కున్నానమ్మా జానకీ! అమ్మాయిని తీసుకువచ్చి నిన్నూ అబ్బాయినీ మీ యింటికి పంపాలను కున్నా. ఏంచేస్తాం. మా తిప్పలు మేము పడ తాము. మీ నాన్నవస్తే తప్పక యిద్దర్నీ పంపు తానమ్మా.

రాము : (లోనికి వెడతాడు).

చంటి : అన్నయ్యా పంపేశాడు.

జనా : ఎవరిని?

చంటి : ఎవర్నేమిటి? మావగారి నే.

జనా : వచ్చారా ఆయన.

చంటి : ఆ!

జనా : ఏమిటమ్మా జానకీ?

జానకి : వచ్చారండి.

చంటి : అదికాదు నాన్నగారూ! వచ్చీరాగానే ఆయ నతో అన్నయ్యా దెబ్బలాడి మా గుమ్మంలోక్కూ వద్దన్నాడు. వదిన్ని పంపనన్నాడు. ఆయన వెళ్ళి పోతానంటే మీ రొచ్చేదాకా ఉండి మిమ్మల్ని కూడా అడిగి వెళ్ళమన్నాను.

జనా : ఆఁ! ఏరీ ఆయన.

చంటి : ఎవరో స్నేహితులున్నారట వెళ్ళారు. ఇంక ఇక్కడ ఉండడం ఇష్టం లేక.

జనా : ఓహో! గోపాలరావుగారింటికి కాబోలు — ఎంత పనిచేశాడు దౌర్భాగ్యుడు.

జానకి : వారినేమీ అనకండి. ఏదో ఆవేశంలో అన్నారు. అనాలనీ కాదు.

జనా : ఆవేశమా! పీడెత్తు ధనంపోస్తే దొరుకుతుందా అట్లాంటి బాంధవ్యం.

చంటి : అదికాదు నాన్నగారూ! ఆయన సినీమాలో బంట్రోతువేషం వేశాట్ట. అందరూ అన్నయ్యని ఆడిగారట. అది అన్నయ్య 'ప్రిస్టేజికి' భంగంట.

జానకి : చంటీ!

చంటి : నువ్వెంత అన్నయ్యని వెనకేసుకు వచ్చినా నాకిట్లాంటివి నచ్చవు వదినా! మా నాన్నతో చెప్పకపోతే ఎలా?

జనా : ఆయన సినీమాలో వేషాలు వేసుకుంటే ఈయన గౌరవానికి భంగం వచ్చింది? మనకన్న వెయ్యి రెట్లు నయం అని తెలుసుకోలేకపోయాడు. ఒకమాటకి కట్టుబడ్డాడు.

రామం : (లోనుంచివస్తూ) ఆ కట్టుబడ్డాడు. పెళ్ళిలో యిస్తానన్న రిస్టువాచీ యిచ్చాడు. మొదటి పండుక్కి కొనిస్తానన్న సైకిలు కొనిచ్చాడు.

జనా : నువ్వూ యిచ్చావుగా నీబావమరదికి కట్నం పూర్తిగా.

రామం : నేనేం యిస్తానని వాగ్దానం చెయ్యలేదు.

జనా : ఒరేయ్, కుటుంబానికి అయిన పెద్దకొడుకువి. నువ్వంటే ఒకటి, నేనంటే ఒకటి కాదురా. అల్లాకాకుండా అణా పైసలతో యిచ్చాడు మీ మామగారు. సైకిలువాచీ అన్నావు. ఇవ్వలేక పోయాడు.

చంటి : ఈపండుక్కి తీసుకువెళ్ళియిస్తానన్నాడునాన్నా పాపం ఆయన. ఆయన సినీమాలో వేషం వేస్తే యీయనగారి పరువు పోయిందట. గుమ్మంలోనికి వచ్చిన పెద్దమనిషిని అడ్డమైన మాటలు అంటే ఈయన పరువు నిలబడిందిప్పుడు. అప్పుడే మన బ్రతుకులు వీధినిపడ్డాయి. లేక పోతే ఎన్ని వేల గుండెలతో ఆపానకాలశాస్త్రి వచ్చి మీ మామ గారూ మీరు దెబ్బలాడుకున్నారా అని అడుగు తాడు.

జనా: ఏమిటమ్మా జానకీ!

జానకి : ఏవీ లేదు మామగారూ?

చంటి: ఏవీ లేక పోవడమేమిటి నాన్నగారూ! అన్నయ్య ఇష్టం వచ్చినట్టు మాట్లాడాడు.

రామం: అందుకే వంటావురా యిప్పుడు?

చంటి: ఏమిటనేది. ఏమీ అనక్కర్లేదు.

జనా: ఒరేయ్ రామం! వాడనేదేముందిరా. ఈ విషయంలో. పసివాడు, వాడిమాత్రం దూరపు ఆలోచన చెయ్యలేక పోయావు. కుటుంబ గౌరవాన్ని గురించేనా ఆలోచించలేకపోయావు.

జానకి: పోనీలెండి మావగారూ! వారినేమీ అనకండి.

జనా: పిచ్చితల్లి! నీ సహనమే వాణ్ణి యింతమట్టుకు తెస్తోంది. ఏవిరా రామం! ఏది ఎట్లా ఉన్నా గుమ్మంలోకి వచ్చిన పెద్ద మనిషిని గౌరవించకుండా వచ్చిన దారిని పొమ్మనడం మర్యాదేమో ఆలోచించావా? మొన్న పండక్కి తీసుకువెళ్ళాడు. నువ్వు కోరుకున్న ఫురెన్ మోటారు కొట్టించి యిచ్చాడు. మనం నీ చెల్లెల్ని బావని తీసుకురాగలిగామా?

జానకి: ఇప్పుడా గొడవెందుకు మావగారూ!

జనా: ఉండవమ్మా! ఏవిరా ఆయన మంచివాడు గనుక పల్లెత్తుమాటనకుండా వెళ్ళాడు. నీ బావమరిదికి కట్నం తాలూకు డబ్బు పూర్తిగా యిచ్చావా అంటే ఏం చెబుదువురా నువ్వు? నీ బావమరిదిని ఎన్ని పండుగలకి తీసుకు వచ్చావు! సైకిలే కొనిచ్చావా! రిస్టువాచీయే కొనిచ్చావా? అని అడిగితే ఏం చెబుదువురా నువ్వు! ఒకరి తప్పులు ఎంచేటప్పుడు మనతప్పులు వెనక్కి తిరిగి చూసుకోపోతే ఎట్లా బాబూ? చెప్పు. సినీమాల్లో వేషం వేస్తే తప్పా? బంట్రోతు వేషం అయితే మాత్రం.

రామం: ప్రతీవాడు అడగడమే. మీ మావగారు బంట్రోతు వేషం వేశావేవిటిరోయ్ అని.

జనా: అడుక్కుతాగు వెధవలు. పూటకి గతిలేని వెధవలు. కానీ సంపాదనలేని దౌర్భాగ్యులు. నువ్వు పచ్చగా ఉంటే చూచి ఓర్వలేని నిర్భాగ్యులు. ఆ మాటలు పట్టుకొని బాధపడడం అట్టే మంచి పనేమో మరొక్కసారి ఆలోచించు. నీకు చెప్పే ఈ వెధవలు చేసేనీతిమాలినపనులు నీకు తెలియనివి గనుకనా? అక్కడిదాకా యెందుకు? మనం చేసిందేవిటి? ఆ కొండ కొస్తా కట్నం కోసం అమ్ముకుంటే తరువాత ఆ పెద్దమనిషి ఏమైపోతాడో అనేనా ఆలోచించామా? మన కట్నం, మనం, సంఘంలో గౌరవంకోసం అను, ధనంమీద ఉండే కాంక్ష అను, గుంజుకున్నాం. మన అల్లుడికి పూర్తిగా కట్నం యింతవరకు యివ్వలేకపోయాం. అడ్డమైన మాటలు అల్లుడితో పడుతున్నాం. ఈ పరిస్థితుల్లో గుమ్మంలోకివచ్చిన ఆ పెద్దమనిషిని...

జానకి: వారేమీ తూలనాడలేదు మావగారూ?

జనా: నువ్వు సర్ది చెప్పడానికేం లేవమ్మా? ఏవీ తూలనాడకపోతే వచ్చిన పెద్దమనిషి మనస్సుకు ఎంత కష్టం తోచకపోతే, వెంటనే, ఇంట్లో ఉండకుండా ఇంకో చోటికి వడతాడా?

జానకి: పోనీలెండి. మా నాన్న ఏమీ కష్టపెట్టుకునే మనిషి కాదు.

జనా: ఏమైనా మనధర్మం మనం నిర్వర్తించుకోవాలమ్మా.

జానకి: వారి మనస్సేదో బాధపడింది. వెళ్ళడానికి యిష్టపడలేదు. నన్ను వెళ్ళమన్నారు. వారు లేందే నేను వెళ్ళడం నా ధర్మం కాదని నేను రానన్నాను. ఇందులో ఎవరి తప్పులేదు. పోనీలెండి. మరో పండక్కి వెడతాము.

జనా: రామం! నా మాట విను నాయనా! ఆ పెద్దమనిషి హృదయం ఎంత బాధపడుతోందో, నీ చెల్లెల్ని పంపనంటే పంపనని నీ బావ చెప్పే సరికి నా హృదయం ఎంత కుమిలిపోయిందో నీకేం తెలుసు. అక్కడే భోరున ఏడవాలనిపించింది. (కళ్ళ నీళ్లు తిరిగి మాట్లాడ లేక పోతున్నాడు.)

రామం: (తనకు కూడా కళ్ళ నీళ్ళు తిరిగాయి. తుడుచుకుంటున్నాడు.

జనా: ఏడవలేక పోయాను. నావలెనే మీ మామగారు బాధపడి ఉంటారు. ఇద్దరూ నా మాట విని వెళ్ళండి. అమ్మా! జానకీ!

రామం: జానకిని వెళ్ళమనండి. నా అభ్యంతరం లేదు.

జనా: ఇంత గొడవ జరిగాక ఆ పిల్లమాత్రం ఒంటరిగా వెళ్ళగలదా? కాబట్టి నా మాటవిని ఇద్దరూ ప్రయాణంకండి

జానకి: పోనీలెండి మావగారూ! పండుగ పూటా మీరు మాత్రం బాధపడవద్దూ. వదినగారు వస్తే మీకు ఇబ్బంది ఉండక పోదు. ఇప్పుడు వెళ్ళకపోతే యేంలెండి. మరో పండక్కి వెళ్ళవచ్చు.

జనా: ఫరవాలేదమ్మా! మా తంటాలు మేము పడతాము. నా మాటకు ఎదురు చెప్పక మీరిద్దరూ చిలకా గోరింకల్లా వెళ్ళి ఆ కన్న తండ్రి

హృదయానికెంతో ఆనందం చేకూర్చిరండమ్మా. నాకెల్లాగూ లేదు ఆ ఆనందం. రామం. నామాట కింక అడ్డం చెప్పకు నాయనా!

రామం : కాదు నాన్నగారూ! నే నెట్లాగూ రానని చెప్పేశాను. ఇంక వెళ్ళడానికి నాకు యిష్టం లేదు. నా మనస్సెందుకో బాధపడింది. వెళ్ళడానికి అంగీకరించడం లేదు.

జానకి : వారిని బాధపెట్టకండి మావగారూ!

రామం : బయట విన్న మాటలు మనస్సును బాధ పెట్టాయి. ఏదో ఆవేశంలో ఏవేవో అనేశాను. ఇన్ని మాటలూ అయ్యాక మళ్ళీ సిగ్గులేకుండా నే నెట్లా వెళ్ళను ఆయన గుమ్మంలోనికి. ఆయ నేదైనా అన్నాడా మళ్ళీ నాకు కోపం వస్తుంది.

ప్రకా : (వీధిలోనుంచి వస్తూ) ఎందుకంటాను బాబూ!

జనా : రండి బావగారూ! మీరు వచ్చేసరికి నేను లేకపోవడం, మావా డేదో తొందరపడి మీ మనస్సుకు కష్టం కలిగించడం జరిగిపోయిందని విన్నాను. అదంతా నా తప్పిదంక్రింద నన్ను క్షమించాలి.

ప్రకా : ఎంతమాట. ఇందులో రామం తొందరపడ్డది లేదు. నాకు కష్టం కలిగిందీ లేదు. ఆడపిల్ల నిచ్చుకున్నవాణ్ణి. నా వల్ల అనేకం లోటుపాట్లుండ వచ్చు. మీరే నన్ను క్షమించాలిగాని...

జనా : మీ వల్ల లోట్లా! ఒక్కనాటికనలేను ఆ మాట.

ప్రకా : నాయనా రామం! చిన్నతనంచేత ఏదో ఆవేశంలో మనస్సు బాధపడి కంగారుగా మాట్లాడావు. అంతమాత్రాన్ని అనుభవంతో ఏళ్ళు గడిచిన నేను కంగారుపడి ఏదైనా అంటానని అనుకుంటున్నావా? నిన్నేదైనా అంటే అది నా కూతురికి కాదూ? పిచ్చివాడా! మీరు సుఖంగా ఉండడమే నా క్కావలసింది. ఇక్కడనుండి అనవసరంగా నీ హృదయానికి బాధ కలిగించడం యిష్టంలేక నా స్నేహితు నింటికి వెళ్ళాను. మీ నాన్నగారు వచ్చాక, నీ కోపం సర్దుకున్నాక రావచ్చు ననుకున్నాను. జరిగిందంతా మర్చిపో నాయనా! బావగారూ! ముందు మిమ్మల్ని అడగడం ధర్మమనుకుంటూను. ఈ పండక్కి మా అమ్మాయిని అల్లుణ్ణి పంపించమని అర్థిస్తున్నా.

జనా : ఈ మాత్రం దానికి అర్థించాలా బావగారూ!

ప్రకా : నాయనా! రామం! నువ్వు నీ భార్యవచ్చి ఈ నాలుగురోజులు నా యింట్లో ఉండి నా కానందాన్ని చేకూర్చు. ఇంక నా మాట కాదనకు. సైకిలువాచీ కొనుక్కున్నా నన్నావు గనుక ఏం కావాలో అడుగు. నలుగురిలోను నీ పరువు నిలబడేటట్లే నిన్ను సత్కరిస్తాను. ఏం బాబూ! నా మాట కాదనకు.

రామం : సరే మీ యిష్టం.

ప్రకా : అమ్మా జానకీ!

జానకి : అది సరేకాని నాన్నా! పండుగపూటా మామగారు చెయ్యికాల్చుకోవాలి నాన్నా. ఏమంత ఖర్మం వచ్చింది. మావదినెగారు వస్తారేమో నేను మనయింటికి రావచ్చుననుకున్నాను. మా వదినగారు రాలేదు.

ప్రకా : ఏంబావగారూ! అమ్మాయినితీసుకురాలేదూ

జానకి : లేదు నాన్నా! వారి అత్తవారంతా ఈ పండక్కి వస్తున్నారట. ఈవిడే పెద్దకోడలుగా. ఈవిడ లేకపోతే ఎట్లా? మరోపండక్కి తీసుకు వెడుదురుగానిలెండి అని అన్నారట

ప్రకా : అట్లాగా!

జానా : ఎంత పుట్టు పెట్టావమ్మా నీకు భగవంతుడు. నీ లాంటి సద్గుణాలు కలిగినపిల్ల కోడలుగారావడం మాఅదృష్టం అదికాదు బావగారూ! మీ దగ్గర దాపరికం యెందుకు? అల్లుడు కట్నం తాలూకు సొమ్ము పూర్తిగా యివ్వలేకపోయాము. అది ఇస్తేనేగాని అల్లుడు అమ్మాయినిపంపనన్నాడు. ఎక్కడ నాగౌరవానికి లోటొస్తుందోనని మీ అమ్మాయి అట్లా మార్చి చెబుతోంది.

ప్రకా : ఇందులో బాధపడవలసిందేముంది. అన్ని కుటుంబాలు ఒక్కమాదిరిగానే ఉన్నాయి. కాలు చెయ్యి కూడదీసుకుని మీరే సర్దేస్తారు. ఆడపిల్ల సొమ్ము ఏతండ్రీ అపహరించడు.

జనా : అని మనం అనుకుంటేసరా! బావగారూ! అల్లుళ్ళకికూడా అంత దూరదృష్టి ఉండాలిగదా.

ప్రకా : సరేగాని బావగారూ! పండుగపూటా ఏం ఇబ్బంది పడతారు. మరోవిధంగా భావించక మీరూ, వదినా, కూడా వస్తే నా హృదయమే

కాకుండా మా అమ్మాయి హృదయంకూడా ఆనందపడుతుంది.

జనా : మేమెందుకు బావగారూ!

ప్రకా : అమ్మా! నీవైనా చెప్పమ్మా.

జానకి : మావగారూ!

జనా : అమ్మా! మేముకూడా యెందుకమ్మా! పోనీ ఒకపనిచెయ్యితల్లీ! చంటికూడా వస్తాడులే. నీతో తీసికొనివెళ్ళు.

జానకి : మీరొక్కరూ యీ యింట్లో ఏముంటారు మామగారూ! నేనుంటానుగా అక్కడ మీకే లోటు రానివ్వను.

జనా : అయ్యో వెర్రితల్లీ! నాకు లోటొస్తుందనా?

జానకి : మీఆరోగ్యం అసలే మంచిదికాదు. ఒక్కరూ యిక్కడ యిబ్బందిపడాలేరు. నామాట కాదనకండి.

ప్రకా : బావగారూ! ఇంక మీరు మరోమాట చెప్పొద్దు.

పానకాలశాస్త్రి : (లోనికివస్తూ) అవును, వారనగనం మీరుకూడా వెళ్ళటం ధర్మమే.

చంటి : అదిగో మళ్ళీవచ్చావా? నీసర్మపన్నాలతో మాకేమీ నిమిత్తంలేదు దయచెయ్యి.

పాన : అదేమిటి? నేనేంచేశాను? దెబ్బలాడి వెళ్ళిన వియ్యంకుడు మళ్ళీవస్తే ఏంజరుగుతోందో చూచి ఒక్క పాడుంపట్టు వేయించుకు పడదామని వచ్చానుగాని నాకెందుకండోయి.

ప్రకా : మేమేమీ దెబ్బలాడుకోలేదే.

చంటి : మరి నేను చెప్పేదేమిటి? ఇల్లాంటి వాళ్ళవల్లే సంసారాలు పాడవటం. వీళ్ళఅబ్బాయి చెప్పాట్ట మామగారు సినీమాలో వేషంవేశాడని. అదిట్టు కొచ్చి అన్నయ్య వడుగుతున్నాడు పేళనగా యీ పెద్దమనిషి.

పాన : అబ్బాయి! అంత పొగరు మోత్తనం పనికిరాదు.

జనా : వెళ్ళవయ్యా! పొగరుమోత్తనంలేదు, ఏమీలేదు. ఏంజరుగుతోందో చూడ్డానికివచ్చాట్ట.

పాన : ఒక్క పాడుంపట్టు వెయ్యరూ!

జనా : బజార్లో అమ్ముతున్నారు.

పాన : పోనీలెండి. నాకెందుకు వెళతాను (వెడతాడు)

జనా : దెబ్బలాడుకుంటే చూచి ఆనందిద్దామని పాపం.

ప్రకా : ఉంటారు బాబూ రకరకాల మనుష్యులు. భిన్నప్రవృత్తులు.

చంటి: నాన్నా: నీ బట్టలుకూడా సర్దేస్తాను.

జనా: (ప్రకాశరావుగారితో) ప్రయాణం అంటే సరి మావాడికింక అన్నంకూడా అక్కరలేదు. అందులో వదినగారింటికి. బావగారూ! మావాడికి వదినగారంటే పంచప్రాణాలు. వదినగారి మీద కొంత మాట పడనివ్వడు. ఇంతెకూ చెప్పొద్దూ. జానకి నిజంగా మా చంటికి కన్నతల్లి లేనిలోటు తీరుస్తోంది. అంటే పొగడ్తకింద ఉంటుంది కాని మా అదృష్టంకొద్దీ దొరికింది జానకి మాయింటికోడలుగా.

చంటి : వదినా! నాన్నగారి బట్టలు నా బట్టలు నా పెట్టెలో సర్దినా?

జానకి : నీకెందుకు బాబూ అంత శ్రమ. నేనున్నానుగా సర్దడానికి.

చంటి : (వీధివంక చూచి) అదేమిటి? బావ వస్తున్నాడు నాన్నోయ్!

జనా : ఆ! బావే!

చంటి : అదుగో బావే! అదిగో బండిలో అక్కయ్య.

జానకి : అమ్మయ్య! వదినగారుకూడా వచ్చేస్తున్నారు. [అంటూ వీధిలోనికి వెళుతుంది]

చంటి : అక్కయ్యా (అంటూ వీధిలోనికి వెళతాడు)

రామం : (వీధి గుమ్మందాకా వచ్చి వీధివైపుకు చూస్తుంటాడు)

జనా : బావగారూ! మా అల్లుడుకూడా మనస్సు మార్చుకున్నట్టున్నాడు. అమ్మాయిని తీసుకుని కారులో బయలుదేరి ఉంటాడు. అమ్మయ్య! నాబిడ్డ నట్టింటికి వచ్చింది. బావగారూ! ఇవాళ ఎంతో సుదినం. బిగువెక్కిన మన హృదయాలు రెండూ తేలికపడ్డాయి. ఇంక యీ పండుగ మీ అల్లుడు కూతురుతో మీరు మీ యింటిదగ్గర మా అల్లుడు కూతురుతో నేను మా యింటిదగ్గర ఆనందంగా గడుపుదాం. ఇంక యింతకన్న వయసు మళ్ళిన మనకు కావలసిందేముంది. మన పరువు కాస్తా నిలబెట్టారు మన అల్లుళ్ళు. చూడండి. ఈమధ్యతరగతి కుటుంబాలున్నాయి చూశారూ పరువుకోసమే బతికేది. పరువుకోసమే బాధపడేది. ఆ పరువుకోసమే సర్వనాశనం అవుతున్నదీ.

[తెర]

# శబ్దశక్తి

## శ్రీ వినోబాభావే

సాహితీపరులు స్వయముగ వినమ్రులై వుంటారు. కాని వినమ్రులైకూడ వారు చాల ఉన్నతులై వుంటారు. నమ్రతవల్లనే వారికీగొప్పతనం లభిస్తుంది.

శబ్దానికి మనం చాల విలువకడతాం. శబ్దానికున్న శక్తి మరి ఏ యితరవస్తువులోనూ కన్పించదు. నా జీవితంమీద పడిన శబ్దప్రభావాన్ని ఆధారం చేసుకునే నేనీసంగతి చెబుతున్నాను. "ఏకఃశబ్దః సమ్యక్ జ్ఞాతః సమ్యక్ ప్రయుక్తః స్వర్గలోకే కామధుక్ భవతి" అని పాణిని సూత్రం. అలా ఒక్క శబ్దమువ్చరించినప్పటికీ 'స్వర్గలోకే కామధుక్' అవుతుంది. సంస్కృతభాషలో అనాదిగా శబ్దశక్తి చాలా వికసించింది. ఇంగ్లీషులో గూడ లక్షలాది శబ్దాలున్నవి. కాని అవి కేవలము శబ్దసంగ్రహం మాత్రమే. వాటివల్ల అభీష్టమైన శక్తి లభించదు. ఒక్కొక్క యంత్రానికి అసంఖ్యాకంగా ఉపాంగాలు వుంటవి. ప్రతిదానికీ వేరవేరే ఒక్కొక్క పేరుంటుంది. ఈవిధంగా ఒక్కొక్క యంత్రానికి డజన్లకొలది శబ్దాలు వాడవలసి వస్తుంది. కాని ఇటువంటి శబ్దభాండారమువలన శబ్దశక్తి పెరుగుతుం దనుకోవడానికి వీల్లేదు. జీవితంలో పరిగ్రహం పెరిగినకొద్దీ, చెత్త చెదారము పోగయినకొలదీ శబ్దసంఖ్య పెరుగుతుంది. అది కేవలం శబ్దసమూహం మాత్రమే. దానివల్ల భావసంపద పెరుగదు. ఇంగ్లీషులో భావసంపద చాలా వున్నది. కాని సంస్కృతంలో మనకు కన్పించు శబ్దశక్తి అందు చూడము. కొత్తవస్తువులు తయారయినకొలది, కొత్తకొత్త మాటలు ఏర్పడుతూవుంటవి. ఇటువంటి మాటల సంగ్రహంవలన అనవసరమైన బరువు పెరుగుతుందని పాశ్చాత్యులుగూడ ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నారు. కనుకనే ఒక్కొక్క యంత్రానికున్న వివిధాంగాలకు వేరువేరు పేరులిడక అంకెలద్వారా వానిని గుర్తించడము మొదలుపెట్టారు. ఏదైనా ఒక యంత్రానికి ఒకచీల కావలసివస్తే ఫలానాయంత్రానికి ఫలానానెంబరు చీల అనే అడుగుతారు.

కాని సంస్కృతంలో మనం చూచేదేమిటి? సంస్కృతంలో ప్రతిశబ్దమూ భావస్ఫోరకంగా వుంటుంది. ఉదాహరణకు 'పృథ్వి' అనే శబ్దాన్ని తీసుకుందాము. ఇంగ్లీషులో "యర్తు" అని, లాటిన్‌లో "టెరా" అని అంటారు. ఈవిధంగా యర్తు, టెరా అని రెండుశబ్దాలుమాత్రమే వున్నాయి. కాని సంస్కృతంలో కొన్ని డజన్లశబ్దాలు దొరుకుతాయి. పృథ్వి = వ్యాపించియున్నది, ధర = ధరించునది, భూమి = వివిధపదార్థములకు జన్మనిచ్చునది, గుర్వి = బరువైనది, ఉర్వి = విశాలమైనది, క్షమ = సహించునది; మనము కాలితో తన్నిన ఆమె సహిస్తుంది. ఇలా ఒక్కొక్క శబ్దము ఒక్కొక్క గుణవాచకము. శబ్దముతోపాటు దానికున్న ప్రత్యేకగుణముకూడ మనదృష్టికి వస్తుంది. కొందరు కవులు తమ కవిత్వంలో గణపూర్తికొరకు ప్రతిశబ్దాన్నీ పర్యాయపదంగా వాడతారు. వారి దృష్టిలో ఛందోనిర్మాణాని కనువుగనుండుటకొరకే ఈ పదజాలమంతా యేర్పడింది. కాని అది నిజంకాదు. అసలు నిజం చెప్పాలంటే ప్రతిశబ్దము స్వతంత్రవ్యక్తిత్వం కలిగి వున్నది. ఒక్కొక్కగుణాన్ని వెలువరించడానికి ఒక్కొక్క శబ్దం పుట్టింది. నలువైపుల వ్యాపించి విస్తరించియున్న ఈ భూమాతను "పృథ్వి" అని పిలచినప్పుడు మన మాపదార్థముయొక్క అంతర్దర్శనము చేసుకొనగలుగుతాము.

ఈవిధముగ సంస్కృత శబ్దాలలో భావం నిండివుంటుంది. కనుకనే ప్రతిశబ్దము మనతో సంభాషిస్తూ వుంటుంది. ఇంగ్లీషు శబ్దాలలో ఈ శక్తి కనుపించదు. 'వాటర్' శబ్దము మనతో

అనువాదం: శ్రీ యలమంచిలి వెంకటేశ్వరరావు

మాటలాడలేదు. మనమే దానితో మాట్లాడదలచుకొంటే అది వేరేసంగతి. కాని సంస్కృత శబ్దం మనలను పలుకరిస్తుంటుంది. పయః=పోషించునది. పానీయం=తృప్తినిచ్చునది. ఉదకము=లోపలినుండి వచ్చినది. చూట్టానికి "సముద్రం" ఒక చిన్న శబ్దం. కాని ఇదికూడ మనల్ని పలుకరిస్తుంది. సమ=నలువైపుల సమముగ వ్యాపించిన, ఉద్ =పైకి లేచిన, పైకి పొంగివచ్చిన నీరు, రమ=ఆహ్లాదదాయకమయిన,—ఎగురునది=కేళిసల్పునది,-ఆనందమిచ్చునది; సముద్ర (సమ+ఉద్ +రమ). "సముద్రాత్, ఊర్మిః మధుమాన్ ఉదారత్"—ఈ హృదయంలో సముద్రమువలె అసంఖ్యాకమయిన భావరాశి యున్నది. భావతరంగములు ఉప్పొంగుతూ వుంటవి. ఈ హృదయము నిజముగ సముద్రమే. సముద్రపు దృశ్యము ఈ హృదయంలో ప్రకటితమాతూ వుంటుంది. కాని "సీ" అంటే ఏమి ద్యోతకమవుతుంది? అది ఒక పదార్థం. ఆ శబ్దము మాట్లాడదు. దుగ్ధం=దోహనము చేయబడిన సారరూపము!—ఘృతం=మిక్కిలి పవిత్రమైన, నిర్మలమైన, తుక్కు తీసివేయబడిన—"ఘృతం మే చక్షుః"—నా కన్ను నెయ్యి అని విశ్వామిత్రులవారంటున్నారు. "ఇంగ్లీషులోగాని మరి ఏ యితరభాషలోగాని "నా కన్ను ఘృతము" అని చెప్పబడినటు ఎక్కడ చూడబోము. "ఘృతం మే చక్షుః" అనగా నా కండ్లు మిక్కిలి పవిత్రమైనవి; వానిలో ఏవిధమైన పాపమును గ్రహించు వికారములేదు. అవి నేతివలె నిర్మలము, స్వచ్ఛమునైనవని అర్థము.

అగ్ని అంటే "ఫైర్." కాని "ఫైర్" అంటే ఏమన్నా బోధపడిందా? ఏమీ లేదు. కాని 'అగ్నె!' అంజవాలీత్ అగ్నిః! అంటే ఒక స్వరూపం కంటిముందు నిలుస్తుంది—వ్యక్తమాతుంది. "వహ్నిః" — అది వాహకము — తీసుకువెళ్తుంది. సందేశవాహకము. యజ్ఞంలో ఆహుతి వసివేస్తే, అగ్ని మీ భక్తిని పైకి తిన్నగా భగవంతుని వద్దకు చేరుస్తుంది. అయితే, 'అగ్నిమీడేపురోహితం'కు మారుగా 'వహ్నిమీడే పురోహితమ్' ప్రయోగిద్దామంటే చెల్లదు. పొత్తుగా అర్థమే మారుతుంది. ఈవిధంగా ఒక్కొక్క శబ్దానికి ఒక్కొక్క విశేషమైన మహత్తువున్నది. సంస్కృతంలో ప్రతిశబ్దమూ ఒక వ్యక్తిత్వాన్ని కలిగివుంటుంది. 'పీయూషం,' 'అమృతం,'. 'సుధ'—ఈ మూడు శబ్దాలు అమృతానికి వాడబడతాయి. కాని ప్రతి శబ్దమూ ఒక విశిష్టమైన అర్థాన్నిస్తుంది. 'అమరానిర్జరాదేవాః' అని అమరకోశపు ప్రారంభమే ఈ వాక్యంతో జరిగింది. 'అమరా' వేరు, 'నిర్జరా' వేరు. ఎవరు చావరో వాళ్లు అమరులు. కాని ఒకడు ముసలి, రోగిష్ఠిఅయినవాడనుకొండి. అతను అమరుడు కాగోరతాడా? అతను 'దేవా! నన్ను తొందరగా తీసుకుపో' అని ప్రార్థన చేస్తాడు. 'నిర్జరా' అంటే జరారహితము. జరారహితులు కాగలిగినప్పుడేగదా అమరులు కాగల్గుట!

సంస్కృతభాషలో శబ్దకోశముకూడ కావ్యత్వం కలిగివుంటుంది. ఒక శబ్దానికి ఎన్నివిధాల వ్యుత్పత్తి! ఒక శబ్దానికి అనేక అర్థాలు, అనేక అర్థాలకు ఒక శబ్దమూను! కనుకనే వ్యుత్పత్తీకరణ సంస్కృతంలో జరిగినంత నిర్మలంగా బహుశా మరే యితర భాషల్లోనూ జరగదు. ఈ దేశంలో శబ్దశక్తి చాలా హెచ్చుని నా భావం. గ్రీక్, లేటిన్, అరబ్బీ భాషల్లోకూడ కొంత శబ్దశక్తి వున్నది. ఇక్కడ పోల్చికూడ చూపవచ్చు. కాని సంస్కృత శబ్దాలవలె అవి స్వయం ప్రకాశకములు కావు. 'ఘట' మనే శబ్దం తీసుకుందాం. ఘటమంటే కుండ. ఘటమంటే శరీరమనే అర్థంకూడ వున్నది. కుండలో నీరునింపుతాము. అలాగే ఈ శరీరంలో ఏమివున్నది?—నీరే నిండివున్నది. నీళ్ళతో నిండినకుండద్వారా, పూర్ణకుంభంద్వారా మనం స్వాగతం చెపుతాము. అంటే మనం చెప్పదలచిందేమిటి? మా హృదయం భక్తిభావంతో నిండివున్నదని. ఈ అర్థంలో ఆ 'ఘట' శబ్దం వుపకరిస్తుంది. 'ప్రభువు ఘటఘటంలోనూ నిండివున్నా' డన్నాడు నానక్. మన యెదుట నున్నవన్నీ 'ఘటా'లే—అన్నీ నిండివున్నవే. కాని దేనితో నిండివున్నవో చెప్పలేము. కొన్ని పనికిమాలిన వస్తువులతోకూడా నిండివుండవచ్చు. పోతే, మనం ఇక్కడ చెప్పేదు నేది 'ఘట' శబ్దానికున్న విశిష్టతనుగురించి మాత్రమే. 'పాట్'కు ఈ విశేషం స్ఫురించదు. కారణం, 'ఘటా'నికి ఒక ఘట్టంవున్నది. మన శరీరం ఒక ఘట్టాన్ని కలిగివున్నది. 'ఘట' శబ్దం ఒక ఘట్టాన్ని సూచిస్తుంది. ఇంగ్లీషు, ఫ్రెంచి శబ్దాలు ఈ విధంగా వాటిలోపలకు మనకు ప్రవేశమియ్యవు. సంస్కృత శబ్దం అంతరంగంలో ప్రవేశించడం తేలిక. కనుకనే శబ్దశక్తి ప్రకటితమాతుంది.

# శబ్దశక్తి

'చక్షు' అనే శబ్దమున్నది. 'చక్షు' ధాతువు నైర్మల్యానికీ, స్వచ్ఛతకు ప్రతిబింబము. మనం కంటితో మాట్లాడినంతగా నోటితో మాట్లాడము. కోపంవస్తే కన్ను మాట్లాడుతుంది. లోపల జాలివుంటే కన్ను మాట్లాడుతుంది. శబ్దానికంటె కన్ను వెలుతురునిస్తుంది. అందుకనే 'వ్యాజ చక్షతే' అంటే వ్యాఖ్యానించుట అని అర్థం. 'చక్షు'నుండియే వ్యాఖ్యానశబ్దం పుట్టింది. మన భారతీయులం ఇతరులకు హెచ్చుగా ఉపదేశించడమంటే యిష్టపడము. మన మహాపురుషులమీద మనకున్న శ్రద్ధయే దీనికి కారణం. వారి కండ్లద్వారా పరిస్ఫుటమైనంత, ఇంక దేనిద్వారా వెలువడదు. వారి కండ్లలో కారుణ్యం నిండివుంటుంది. కారుణ్యమంటే ఏమిటి? 'మర్సీ', 'కైండ్‌నెస్'—ఏదన్నా వుపయోగించండి, ఆ భావం వ్యక్తంకాదు. కాని కరుణ ఏమి చెబుతుంది? ఎప్పుడు ఏదో ఒకటి చెయ్యమని పురికొల్పుతుంది. హృదయంలో ప్రేమ వున్నది. కాని దానితోపాటు కర్మప్రేరణ కలుగకపోతే అది కరుణ కాదు. కరుణ పూరికే కూర్చోనీయదు. అనేకులు అనుకుంటూ వుంటారు—"బాబాజీ (వినోబాజీ) ఎందుకు ఇలాగ తిరుగుతాడు? ఇంత తిరిగినా అలవదేమిటి?" అని. ఈ కారుణ్యమే అతన్ని తిప్పుతుంది? అది ఏదోఒకటి చేస్తూ వుండమని బాబాని ప్రోత్సహిస్తూ వుంటుంది—పూరికే కూర్చోనీయదు. పిల్లవాణ్ని తేలు కుట్టిందనుకోండి. మనం చూస్తూ కూర్చుంటామా? ఒక్కసారిగా సేవ చేద్దామని పరుగెత్తి వెళ్లము? కరుణకూడ శాంతంగా కూర్చోనీయదు. లేవమనే ప్రేరేపిస్తుంది. 'బుద్ధి'ని చూడండి. అది మనకు బోధ చేస్తుంది. దానికున్న విశేషలక్షణమది. మనయెదుట శుభ్రమైన వస్త్రాలు కన్పడుతున్నవి. 'శుభ్ర' మంటే ఏమిటి? శుభ్రమంటే పవిత్రమైనదని అర్థం. 'శుభ్ర'మంటే కేవలం 'వైట్' కాదు. 'శుభ' శబ్దంతో దానికి సంబంధమున్నది. మరి 'శోభ'తో కూడ దానికి తక్కువ సంబంధము లేదు. అప్పుడు సౌందర్యము, పవిత్రత ఒకచోట మేళవించిన వన్నమాట. ఎదురుగా ఆకాశంలో 'శుక్ర' తార ఉదయిస్తూ వుంటుంది. శుక్రమంటే పవిత్రం. 'శుచి' శబ్దాన్నుంచి శుక్రశబ్దం వచ్చింది. దాన్ని చూచేసరికి పవిత్రమైన భావం స్ఫురిస్తుంది. 'సూర్య' శబ్దం తీసుకుందాం. 'సూ' ధాతువునుండి 'సూర్య'శబ్దం పుట్టింది. సూర్య=ప్రేరేపించుట; 'మిత్ర' శబ్దమున్నది. మిత్రుడు చేయునదేమిటి?—ప్రేమిస్తాడు. హిందువులు సూర్యునకు 'మిత్ర' నామకరణం చేశారు. అతని కిరణాలు—అవి ఎంత తీవ్రంగా వున్నా—మనం భీతిజెందము. మనలను ప్రేరేపించి, మనచేత కర్మను చేయించువాడు మనకు నిజమయిన మిత్రుడు. మనం నిద్రిస్తుంటే అతను మేలుకుంటాడు. మనం కూర్చుంటే మనచేత పనిచేయిస్తాడు. ఇంతమేలు కోరేవాడే మిత్రుడు. 'మిత్ర' శబ్దం కేవలం సూర్యవాచకమే కాదు. "ప్రేమతో అందరికీ సేవచేయువాడు" అనే అర్థం ఇందులో ఇమిడి వుంది. మన మిక్కడ కూర్చున్నాము. గది తలుపులు మూసివున్నవి. సూర్యభగవానుడు బయట వుదయిస్తున్నాడు. ఆయన ఏమి చేస్తాడు? మనకు సేవచేయవలెనని ఆయన కోరిక. సేవకుడుగా, మన తలుపుమీద చెయ్యిపెట్టి తత్పరతతో నిలబడతాడు. మనం కొంచెం తలుపు తెరిస్తే, కొంచెమే లోనికివస్తాడు. పూర్తిగా తెరిస్తే, ఆయన స్వేచ్ఛగా లోపల ప్రవేశిస్తాడు. తలుపులు మూసివుంటే గబగబ నెట్టి లోపలికి రాడు—బయట నిలబడివుంటాడు. ఇది 'మిత్ర' మర్యాద. ఆయన ఎన్నడు నాగాపడడు. యజమాని ఎంతసేపు నిద్రపోయినా, అతడు వేళ దప్పడు! ఇటువంటి సేవక భావం పూర్తిగా సూర్యునిలో కనిపిస్తుంది. ఇలా శబ్దాలు మనలను పలుకరిస్తూ వుంటవి.

ఈ విధమైన సాహిత్యశక్తి భరతభూమిలో వున్నది. ఇటువైపుకు మీరంతా దృష్టిపెట్టాలి. సరిగా అర్థం కావలెనంటే, మనం జీవితం లోపలిభాగంలో ప్రవేశించాలి. 'సుమన' మంటే ఉత్తమ పుష్పం. దానిని మనం సమర్పిస్తాం. అంటే దీని రూపంలో, మనము స్వచ్ఛము, నిర్మలము నైన మనస్సును సమర్పిస్తాం. 'సుమన'ములో నున్న ఈ విశేషము మరే పదములోనూ లేదు. ఇదంతా దృష్టిలో పెట్టుకుని మనం సరియైన పద్ధతిలో చింతన చేయవలసి వుంటుంది. అప్పుడే భరతభూమి చింతన, ఆలోచనాక్రమం ఇతర దేశాలకు భిన్నంగా కన్పడుతుంది. బయటినుండి దిగుమతియైన శబ్దాలు తెచ్చి మన భాషలకు ముడిపెడితే, మన జీవితంలో అవి ('ఏసిమిలేటు') జీర్ణంకావు.

మనవాళ్లు 'సెక్యులర్ స్టేటు' అన్నారు. ఇది బొత్తుగా ఏకాంగ కల్పన. ఇది మనకు జీర్ణంకాదు. యూరపుఖండంలో వున్న పరిస్థితినిబట్టి అక్కడ

ఆశబ్దం పొసగబడి అయినది. మన దేశానికి అనుగుణ్యమైన శబ్దం 'ధర్మం.' ధర్మమంటే ఏమిటి? ధర్మమంటే అందరిని ధరించునది. 'స్టేటు' అన్నా ధరింపబడడమే. ఒకవేళ ఎవరైనా, 'స్టేటు'కీ ధర్మానికీ ఏవిధమైన సంబంధం లేదని అంటే, ఈ దేశపుస్థితి మరీ అధ్వాన్నమౌతుంది. 'సెక్యులర్' అంటే పరలోకాన్ని గురించి ఆలోచించనే కూడదనీ, ఇహలోకాన్ని గురించిమాత్రమే ఆలోచించాలనీ అర్థమా? అయినా, ఏకత్వాన్నీ, సమానతను ఒప్పుకొంటూనే వున్నారు గదా! అప్పుడు పరస్పర విరుద్ధకల్పనలు ఉత్పన్నంకావు మరి! అందరికి సమానంగా ఓటు హక్కు నివ్వదలచారు. సరే బాగానే వున్నది. కాని అందరికీ సమానప్రతిపత్తిని కలగ జేయడమంటే అది కేవలం భౌతిక సృష్టికి సంబంధించిందేనా? ఈ ప్రశ్నకు వారివద్ద సమాధానం లేదు. ఒకడు బలవంతుడయితే మరియొకడు బలహీనుడు. బాహ్యసమత్వం ఏది? దీన్ని బట్టి చూస్తే, ఇది శరీరానికి సంబంధించింది కాదని తేలిపోతుంది. బుద్ధినిబట్టి నిర్ణయిద్దామా అంటే, ఒకడు బుద్ధిమంతుడయితే మరియొకడు మూర్ఖుడు. ఒకేయింటిలో జ్ఞానీ వుంటాడు అజ్ఞానీ వుంటాడు. అప్పుడు అందరికీ మతాధికారం ఇవ్వడంలో అంతరార్థం ఏమైవుంటుంది? ఇందుకు జవాబు కావాలంటే ఆధ్యాత్మ ప్రపంచంలో కాలుపెట్టక తప్పదు. అందరికీ ఓటు హక్కిచ్చారంటే, ఆత్మయొక్క ఏకత్వాన్ని ఒప్పుకున్నారన్నమాటే. తర్క దృష్టితో అయితే, ప్రతిఒక్కడికి ఓటుఅనే సమస్యేవుండదు. అయినా అందరికీ ఓటుహక్కు ఇచ్చారంటే ఏ సామ్యంమీద? భౌతికసామ్యంమీదనా? కాదు. ఆత్మైక సామ్యం మీదనే. దీని అర్థం మీరు ఆత్మైక్యతను స్థిరపరచివల్లే. 'మేము కేవలం భౌతిక సామ్యంమాత్రం చూస్తాము.' అని ఇక మీరు వాదించ వీలులేదు. అంటే, 'సెక్యులర్ స్టేటు'లో (స్పిర్చ్యుయల్ వాల్యూస్) ఆధ్యాత్మిక విలువలను ఒప్పుకున్నారన్నమాట. 'సెక్యులర్ స్టేటు' శబ్దంలో వున్న న్యూనతను గమనించే, అందరికీ ఓటు అధికారం ఇవ్వబడింది. కనుక, సరియైనశబ్దం ఉపయోగించనప్పుడు, ఇటువంటి పొరపాట్లకు అస్కారం వుంటుంది. 'ఇండిపెండెన్సు' ఎంత పనికిమాలిన శబ్దం! ప్రపంచంలో ఏమి జరుగుతున్నది? ప్రతిమనిషీ రెండోవాడిమీద ఆధారపడివున్నాడు! ఇంకెక్కడి ఇండిపెండెన్సు? కాని 'స్వరాజ్యం' సరియైన అర్థాన్ని ఇస్తుంది. స్వయమేవ రాజ్యమది. అది స్వయం ప్రకాశితం. ఇక్కడ కూర్చుని మనం విదేశపుబుద్ధితో ఆలోచిస్తూంటే, అది స్వరాజ్యమెలా అవుతుంది? మన రాజ్యాన్ని మనం పాలించినంతమాత్రాన, అది స్వరాజ్యమైపోయిందా? వేదంలో ఆదిత్యుడు 'స్వరాజ్యం'తో ఉపమింపబడినాడు. సూర్యుడు "స్వరాట్—" అతడు స్వయం ప్రకాశితుడు గనుక. చంద్రుడు పరప్రకాశితుడు 'యతే మహిస్వరాజ్యే—' స్వరాజ్యము కొరకు మేము ప్రయత్నిస్తున్నాము—అని వేదంలోని అత్రిమండలంలో చెప్పబడింది. అంటే, ఆ యుగంలో వారిమీద ఇంకొకరి ఆధిపత్యమున్నదని, వారు పరతంత్రులని దీని అర్థమా? కాదు—కాదు. బుద్ధి ఆత్మనిష్ఠం కానంతవరకు స్వరాజ్యంలేదు. లోపలినుంచి వెలుతురు లభించినప్పుడే నిజమైన స్వరాజ్యం. కాని మీరు 'ఇండిపెండెన్సు' అంటారు. ఒక దానికొకటి పొసగదు.

'సోషలిస్టిక్ స్టేట్' నిర్మించాలంటారు మీరు. హిట్లరుది కూడ ఒకవిధమైన సోషలిజమే! అసలు దీనికి సరియైన అర్థమేమి? వ్యక్తిని సంఘంనుండి వేరుచేసి, సంఘానికి వ్యక్తినిదూరంచేసి ఆలోచిస్తే సమన్వయం ఎలా కుదురుతుంది? కల్పనలోకూడ విడదీయడానికి వీలులేని అవిభాజ్యమైన అంగాలను ముందు రెండుగా విడదీశారు. రెంటికీ మధ్య ఘర్షణ అనివార్యమని సిద్ధాంతీకరించారు. ఈ ఘర్షణ తొలగాలంటే సోషలిజం కావాలంటారు.

నేడు ప్రతిఒక్కరు తమనుగురించే ఆలోచిస్తున్నారు. మనచింతన అంతా తప్పుడుమార్గంలో నడుస్తున్నది. మనం మన శబ్దశక్తిని గుర్తించకుండా, పాశ్చాత్యుల శబ్దాలు వాడుతున్నంతకాలం మన చింతన ఇలాగే పెడదారిపట్టక మానదు. మనం మన పరంపరలో చింతన సాగించినప్పుడు అది ప్రపంచానికి భిన్నంగా వుంటుంది. ఈపని అంతా సాహిత్యస్రష్టలయిన వారు చెయ్యవలసి వున్నది. ఇంగ్లీషు, చైనా, జపాను, ఫ్రెంచి మొదలైన భాషలలో సాహిత్యం వుంది. అందులోవున్న మంచిని (మనకు సరిపొయ్యే దానిని) మనం తప్పక గ్రహించాలి. కాని అది మన దేశశక్తికి ప్రతికూలంగా వుండకూడదు. మనం తీసుకున్న భావం మనశబ్దాలకు అనుకూలించినప్పుడే అది సరియైనదని అనుకోవాలి. నేడు చేసే తప్పుడుశబ్దాలు మన

చింతనలో ప్రవేశించినవి. దానికి ఫలితంగా తప్పుడు చింతన జరుగుతున్నది. కనుక సాహిత్యపరులు శబ్ద శోధన చేయవలసి యున్నది. సరియైనశబ్దాలు వాడుక లోకి తెస్తే, ఎన్నో తికమకలు తప్పిపోతవి.

"ఎంతోమంది సాధుపురుషులు పుట్టారు. వారు ఎన్నో ఉపదేశాలు చేశారు. కాని 'ఫోర్స్'ను ఉపయోగించకుండా ఏ పనియైన జరుగుతున్నదా? అని ఒక సోదరుడు ప్రశ్నిస్తున్నాడు. ఇంత మంది సాధు మహాత్ములు పుట్టబట్టే, మనమిప్పుడున్న స్థితిలోనన్నా వున్నామని గుర్తుంచుకోవాలి. వారు లేకపోతే, మనం పశుకోటిలోనే వుండేవాళ్లం. మనం ఎక్కడనుండి ఎక్కడికి వచ్చాం! భారతంలో, భార్య మీద భర్తకు అధికారం వున్నదా లేదా? అని ఒక చోట ప్రశ్న వచ్చింది. ప్రశ్న చాల కఠినమై పోయింది. భీష్ముడు, ద్రోణుడు, విదురుడు మొదలైన వారెవరూ జవాబు చెప్పలేకపోయినారు. కాని నేడో! ప్రతిపిల్లవాడు చెప్పగలడు. 'విదుర' అంటే ఏమిటి? "యథా విదుర భిదుర్" అని పాణిని సూత్రం. ఛేదించుటలో మిక్కిలి ప్రవీణతగల శక్తిని 'భిదుర్' అంటారు. భిదుర్=బ్రద్దలుగొట్టు. బ్రద్దలు కొట్టేది వజ్రం. వజ్రాన్ని భిదుర్ అంటారు. విద్ మరియు భిద్ అనే రెండు ధాతువులకు 'ఉరు' ప్రత్యయం చేర్చినందున రెండు విశేష అర్థవాచక శబ్దాలు ఏర్పడినవని సూత్రంలో చెప్పబడింది. భిద్ ధాతువుకు 'ఉరు' ప్రత్యయం చేరినందువల్ల భిదుర్ అయింది. భిదుర్ అంటే ఛేదించుటలో ప్రవీణమైన. విద్, ఉరు కలిసి విదుర్ అయింది. విదుర్ అంటే మహాజ్ఞాని. అంతటి మహాజ్ఞాని అక్కడ కూర్చుని వున్నాడు. కాని నిర్ణయం జరగలేదు. చైతన్యమయమైన ప్రాణిని 'పణంలో ఒడ్డవచ్చునా లేదా? అన్నదే ప్రశ్న. ధర్మరాజు ధర్మనిష్ఠ, సత్యనిష్ఠ కలిగిన రాజు. జూదానికి పిలిస్తే రానని లేకపోయినాడు. కాదనడం ధర్మ విరుద్ధమనిపించింది. నేడు జూదమాడుట చట్ట విరుద్ధమే కాక, అనైతికమని కూడా చట్టం చెబుతుంది. కాని ఆ రోజుల్లో ధర్మరాజు కాదనలేకపోయినాడు. అధర్మమని భయం వేసింది. చూట్టానికి చాలా చిన్న సమస్యలు. కాని ఇవి చిక్కు విడడానికి యుగాలు పట్టినవి. ఈ పరిష్కారానికి తోడ్పడినది సత్పురుషుల కృషియేనని మరువకూడదు.

నేడు ప్రపంచమంతట 'వరల్డు పీస్'కు ప్రయత్నిస్తున్నారు. కాని జరిగేది రవ్వంత లేదు. దీని అర్థం సాధుపురుషులు, మహాత్ములు చేసిన ప్రయత్నం పూర్తిగా వమ్మయిపోయిందని కాదు. నేడు 'పీస్' లేకపోవడానికి కారణం ఆ శబ్దంలో ప్రాణం లేకపోవడమే. ఆ శబ్దమే అర్థశూన్యం. మన శాంతి ఆ 'పీస్' కాదు. ఆ 'పీస్' 'సైలెంట్' కూడ కావచ్చు. కొన్ని దేశాలలో వ్యాపారబహిష్కరణ జరుపుతూ వుంటారు. ఇది పూర్తిగా 'పీస్ ఫుల్ ఏక్షను' కాని ఇందులో హింస వున్నది. ఇది శాంతి కాజాలదు. శాంతికీ పీస్ కీ సంబంధమే లేదు. 'పీస్ ఫుల్' అంటే ప్రత్యక్షంగా కొట్టడం తిట్టడం జరగదు గాని యుక్తి ప్రయుక్తుల ద్వారా చర్య జరుగుతూనే వుంటుంది. కనుకనే 'పీస్' విశ్వానికి శాంతిని కలుగజేయడంలో నిరుపయోగమైనది. పాశ్చాత్య శబ్దాల వాడుకవల్ల మన చింతనలో భావదోషం ఏర్పడింది. కనుక శబ్దశుచిత్వం వైపు దృష్టి పెట్టండని నేను సాహితీపరుల నందరనూ అర్థిస్తున్నాను. శుద్ధశబ్దాన్ని ఆవిష్కరించినపుడే శుద్ధమైన ఆచారము, విచారము ఏర్పడగలదు.

'నీవు దాన మెందుకు అడుగుతావు?' అని ఒక సోదరుడు ప్రశ్నిస్తున్నాడు. అసలీప్రశ్న ఎందుకు ఉదయిస్తున్నది?—దానమనే పదానికి అర్థం తెలియకనే. 'దానం సంవిభాజనం' అని శంకరాచార్యుల వారు దానశబ్దాన్ని వ్యాఖ్యానించారు. 'దా' ధాతువుకు అర్థమే 'విభాజన'మని. 'దా' అంటే రెండు తుంపులు చేయడం!—విభజించడం అని మూల అర్థం. ఇదంతా తెలిస్తే శంక కలుగదు. ఇది తెలియనందువల్లనే దానమంటే చెడ్డగా కన్పడుతుంది. దయ చెడ్డది, కరుణ చెడ్డది, వైరాగ్యం చెడ్డది, సన్యాసం కూడ చెడ్డదే! ఇంక మంచి ఏమిటో మీరే చెప్పాలి. ఈ విధంగా మంచి అర్థమిచ్చే శబ్దాలు గతించిపోతే, ఇక మిగిలే దేమిటి?

# మంటలు

శ్రీ మంథా వెంకట రమణారావు

**పాత్రలు:** రామో, రామూర్తిపంతులు, డ్రయివర్లు, సెర్వర్లు, కాన్స్టేబులు, శారద, శౌరి.

## రంగం: 1

* * రామోహోటలు—హోటలు విశాలమైన ఒకేగది రెండుకిటికీలు. ఒకద్వారం లోనికి; ఒకద్వారం బైటకి; గోడకి ఆనుకుని బెంచీలు వాటిముందు పాత బల్లలు. ఒకమూల అద్దాలు పగిలిన పాతబీరువా - అందులో కాళీ పింగాణీ బేసిన్‌లు-తామర ఆకులు.

హోటల్ గుమ్మంవద్ద ఒక వైపున చిన్న టేబిలు, క్యాష్‌పెట్టి, మరొక వైపు భగభగమండే మంటలతో జోడు బొగ్గు పొయ్యలు* - ఒక దాని మీద కాలేపెనం - మరొకదానిమీద పెద్ద కెటిల్-

సమయం: తెల్లవారుజాము 4 గం॥— ఒక్కొక్కరే వస్తున్నారు హోటలులోకి. రామో గబగబా వేస్తున్నాడు దోసెలు పెనంమీద; వయస్సు 40-45; ఉంగరాల జుత్తు; పచ్చటి శరీర ఛ్ఛాయ; మంచి హుషారుగా పని చేస్తూ ఉంటాడు - కాని-ఆ చురుకైన కన్నుల వెనుక ఏదో ఆందోళన వ్యక్త మౌతూ ఉంటుంది.

రామో: (దోసెతిరగవేస్తూ) ఆఁ...ఆఁ...రా ఇందర్! ఒరే సాహూ ఇందర్ కి వేడి వేడి ఇడ్లీ.
-[వెనుకనుండి సాహూ గొంతు] కొరప్పొడా... అల్లప్పచ్చడా ఇందర్ గురూ?...
[ఒక ఆజానుబాహు వ్యక్తి ప్రవేశించి]

ఇందర్: తెలీదేటి...రోజూ ఇదో ప్రశ్న?

రామో: నేనే అడగనుంటాలే-ఏమో-ఏ నిమిషాన కలా మనసౌతుందో...ఎంత ఇష్టమున్నా ఒకోరోజు మొగ్గాం నిపిస్తూ ఉంటుంది...ఒప్పుకుంటావా?

ఇందర్: యిందర్ కి తిరుగులేదు రామోమావాఁ—మనది ఒకటే పంథా.

రామో: (ఆలోచిస్తూ) అదీమంచిదేలే. అయినా నీలాగుండె నిబ్బరం ఉన్న మనుష్యులు ఎక్కడోలే.

ఇందర్: ఇరవై ఏళ్ళయిఉంటాది స్టీరింగుపట్టి ఇప్పటికి ఒక్క యాక్సిడెంటు కాని, ఒక్క పోలీసుకేసు కాని చూపిట్టు నామీద...

రామో: నాకు తెలీదా ఇందర్. బొబ్బిలికి మూడు గంటల్లో దుల్లగొట్టుక వెళ్ళగల్గిందెవడు?

ఇందర్: మరాసంగతులన్నీ యెందుకులే మావా—ఆ కాలం అయిపోయింది.

రామో: సంగతులు పాతవయినా మరిచిపోగలమా? పెసరట్టు వెయ్యనా?—

---

* ఒరిస్సాలో సర్వసాధారణంగా హోటలు గుమ్మంలో ఉంటాయి పొయ్యలు. పెద్ద ఊళ్ళలో కూడా.

ఇందర్: కానీ...

రామా: ఒక్కడివే నేమిటి ఇవాళ లైనుకి...తక్కిన వాళ్ళేరీ...

సాహూ: అదిగో గురూజీ — సాంబ - సత్యం... పంతులు...

ఇందర్: ఏఁరోయి పంతులు గారూ...మందెక్కువయి పోయిందేటె...ఇంత వేగం ఒచ్చేసేవ్ లైనుకి.

పంతులు: ఓరి తప్పాదియ్యా...యిప్పు డిప్పుడే కదా వాలుగ యింది...అయినా పిల్లల వాడ్నం టావా?

సాంబ: పిల్లలుంటె కేటి చేస్తారే. యిద్దరు పెళ్ళాల్నుంచు కుని......

[రామాముఖం పాలిపోతుంది]

పంతులు: నోర్ముయ్యి సాంబా......

[రామానికళ్ళతో చూపిస్తాడు]

సత్యం: నోటి కొచ్చిందల్లా కుయ్యాపమేనట్రా సాంబా......

సాంబ: నువ్వుసెప్పు ఇందర్ —పంతుల్నంటే తప్పేటి

ఇందర్: (రామానికళ్ళతో చూచిస్తూ) యెవ్వడ్ని కాని—...

సాంబ: సరే...సరే...తూగాపు తెలారలేదు యెందుకు తగువు...ఏది సాహూ...ఇడ్లీ అల్లప్పచ్చడి... ఈయేళ ఒంట్లో అదోలాగుంది—

పంతులు: ఒకట్రెండు కనడంలే. రాత్రి ఎంత ఊదిస మయిందో—

సాంబ: సొండ్లో దుత్తి నీళ్ళుపోసేదేస్—యీడి బాబుగాడి సొమ్ములాగ వాల్లు లాగేసేసం— ఏం గీటాగలే......

సత్యం: గురువు సంగతి కెక్కడికనిలే

సాంబ: బగవొంతుడే చూస్తాడు...ఎంత కాలం చెస్తాల్లే...ఈచార్ పోలీసు...

సాహు: సాంబగురూ కిదో లెక్కా పూరాగాయేసి, రివర్సాలో బండిని గాటే ఎక్కించలేదా? ఏం గురూ....సెప్తారుకదా నిజవే...

సాంబ: నిజమో...అబద్ధమో ఎందుకురా...గుంటనా కొండెలు...(పొయ్యివేపు చూస్తూ) ఔన్లే... మాకాలం దాటిపోయింది...అంతా మీదే...

సత్యం: ముసలోడివై పోయినట్టుమాట్లాడతా వేటిగురూ! ...ఇంకా ఎన్నిసార్లు లైను కెళ్లాల ఎందరు పోలీసోళ్ళతో తగవులు లేవాల, ఎన్ని దాకల కలు కర్చవాల...

సాంబ: ఏదీ...రామా బావ నడుగు. ఏం రామాబావా

రామా: ఇప్పుడ్నించి వైరాగ్యం పనికిరాదు సాంబా— సత్యం అన్నదేం అబద్ధంకాదు. అయినా ఎంత కనిలే. కాలం అంగాటేది-విరక్తి పుటసం ఆశ్చర్యం ఏంకాదు...అమాటకొస్తే నేనే...(టక్కున ఆగిపోయి) రవ్వదోసె వేశేదా సాంబా?

సాంబ: ఒద్దు రామా బావా......ఏదేడి పెసరట్టు వేయించు...

[ఇంతలో ఇద్దరు ముగ్గురు వ్యక్తులు వచ్చి డ్రయివర్ల పక్కని కూచుంటారు.]

ఒకవ్యక్తి: మూడు ప్లేటు ఇడ్లీ......

సాహు: కారప్పొడా...అల్లప్పచ్చడా?

వ్యక్తి: ఏదో ఓటి యేసి లేవయ్యా.

సాహు: ఏదో ఓటంటే ఏది?

వ్యక్తి: మా కానోడా ఉన్నావే......కారప్పొడేసి పట్రా......

రెం॥వ్యక్తి: వాకల్లప్పచ్చ డెయ్యమని సెప్పు గవరయ్యా

వ్యక్తి: మా అన్నకి అల్లప్పచ్చడి.

రామా: ఏమిటి వెంకయ్యగారూ యింతవేగం ఒచ్చేసేరు.......

రెం॥వ్యక్తి: పంతికదా......

రామా: ఈసారి స్వయంగా బయల్దేరేరు...పెసరట్టు వెయ్యనా వేడివేడిది......

రెం॥వ్యక్తి: ఎయ్యి రామా...లాఖోర్గుణో! డయివర్ గారికి పెషల్ టీ చేసి లేవయ్యా......

సాంబ: అక్కర్లేదు సెట్టీ...ఈ ఏళ సి. ఎస్. ఓ. టూరు-దాన్లో పట్టుకుంటే ఉద్యోగం ఊడు తాది...నీ సొమ్మేం పోయింది......

రెం॥వ్యక్తి: బాబ్బాబు—సాంబా—మాటసిన్న దేలే— యెనక్కే కూకుంటాను...పోలీస్ టేషన్ దగ్గర దిగిపడిచేస్తాను...ఇదిగో—యిదుంచు...

[రెండురూపాయలు అందిస్తాడు...]

పాంబ: అబ్బొబ్బొ...డబ్బుకొక్కోడు సెట్టి...ఈ యేళ కథాకాక్ట్రి పద్దానంటే ఉద్యోగం పోతుంది... లాబంలే...

రెం॥ వ్య: సాంబా...సాంబా...ఈ యేళ సంతరోజు ...ఇవి సీతులుకావు కాళ్లిమకో...

పాంబ: యేటను కోడమయ్యా...పొద్దుటే బస్సులో పోరాదా ?

రెం॥ వ్య: బస్సులో సీటుండదు కాబట్టే--సంతరోజు కదా...కొత్తలాగ మాటాడతా వేటి సాంబా...

పాంబ: కొత్తమాట కాదయ్యా...నువ్వు ముఖ్యమా... నా ఉద్యోగం ముఖ్యమా? ఉద్యోగంపోతే నువ్విప్పిస్తావా ?

శెట్టి: ఈయేళ ప్రయివేటు వాళ్ల కిటిప్పులు నేవు... నువ్విలా అన్యాయం చేస్తివా ?

రామో: సాంబా—సంతరోజు—సరుకు ఉంచిపోతే ఎవరు తిన్నట్టూ కాదు...శెట్టిగారూ మనో రెండిచ్చిండి ఎందుకీ తగవు...సాంబకీ కష్టమే దొరకూడా ఒస్తున్నాడా...

పాంబ: ఏటిబావా...నువ్వెప్పుడూ ఇకే పితలాటకం పెడతావ్...మరోసారిలా మొగమాటం పెట్టకమా—ఊఁ...సరే...ఏదీ...(డబ్బు పుచ్చుకుని) ఒకటోసుకి సాలదు...ఎందుకీ డబ్బుండి ...లాఖోక్కణో...ఏది...శెట్టిగారు సెప్పినటే పట్రా...

లాక్షోణో: రెడీ గురూ...

[టే ఇస్తాడు]

శెట్టి: బతికించేవ్ రామో...

రామో: ఇదిగో మీ పెసరట్టు ... ఆఁ ... దాని కేముంది...యెవరికీ నష్టంలేకుండా పనులై పోడం కావాలివాడు...

[మనుష్యులు వచ్చిపోతూ ఉంటారు...బయట లారీల శబ్దం వినిపిస్తూ ఉంటుంది.]

చింకిరి జుత్తుతో ఒక వ్యక్తి: రామోగురూ......జేబు కన్నం ఉండి డబ్బులు జారిపోయేయి...రేపు ఉదయం ఇచ్చేస్తాను...

రామో: ఏం బాధలేదు భైరవో...రేపుకాదు...నెలా ఖరుకియ్యి...డబ్బు సంగతి ఎత్తొద్దని చెప్పేవా లేదా?

వ్యక్తి: (ముఖం వికసించగా) అయితే నెలాఖరికి మొత్తం ఇచ్చేస్తాను...ఏం?

రామో: నెలాఖరకి కాకపోతే రెండునెలల తరవాత...ఆపాటి నమ్మకం లేకపోతే ఇన్నేళ్ళయి హోటలు ఎలా నడుస్తున్నాది...

వ్యక్తి: ఏం అనుకోక్కురుమా...

రామో: భైరవో...నీ కిష్టమొచ్చినంత తిను...నువ్వు వాదో స్తీవి...మనకీ మనకీ డబ్బుల ఊసేలేదు... మరి నాకు కోపం తెప్పించకు...

వ్యక్తి: గురూ...గురూ...నువ్వు సానా మంచోడివి గురూ...

[పామ్యుని రామో చెయ్యి ఊపుతాడు.]

శెటి: పిచ్చి వాకొండే...

పాంబ: అబ్బ ... ఆదోళాయిగాడూ ఈడూ ఎంతదో సీఎంత బుజాలూ బుజాలూ రాసుక తిరిగేవోరూ...

శెట్టి: ఏఁవఁయినా అంత అంటుకపోకూడదయ్యా...

పాంబ: మంచిరోజు చూసేకు...ఈడి పెళ్ళాన్ని తన్నుక పోయేకు...

[రామో ముఖం పాలిపోతుంది.]

ఇందర్: నేనయినాను కాను—కయినా చేసేద్దును...

పంతులు: అదేం చేస్తాడేస...ఆ పెదానికి బుద్ధి ఉండాలి...స్త్రీ బుద్ధీ ప్రళయాంతకా అన్నారు...అది వాడెంటబడితే నువ్వేటి జేస్తావ్ నేనేటి జేస్తాను.

[రామో బాగ్గా జుత్తులోకి వేళ్ళు పోనిచ్చి మంటలకేసి చూసి లోనికిపోయే ద్వారంగుండా పోతాడు.]

పాంబ: దానిగురిం చీకు పిచ్చెత్తిపోవ మేటి......అది కాపోతే దానమ్మ మగో త్తి...లకులు.

పంతులు: గురూ...తిడితే తిట్టు కాని, మందు కొట్టడం తప్ప మరేటిచేత కాదు నీకు—ఆడముండ అంత పని చేసేక ఎలాగుంటందయ్యా ఎవరికైనా... ఆ వెర్రోడు పిచ్చెత్తిపోయేడంటే ఏటుంది ఆశ్చర్యం...

పాంబ: పదరా పంతులూ...పద బండెక్కు...మానీతులు సెప్తున్నావ్... సీకటి పడితే సోంబారి తోటకాడ మన దర్శనమే మొదట...

పంతులు: ఓ. ఎస్...నాకేం అలాంటి దాపరికాలు లేవు గురోయి...లేలే...పద...

సత్యం: ఈడు పిచ్చెత్తి ఈధులెంట తిరుగుతూంటే అదెలాగుందో...దానికేం అనిపించ దంటావా పంతులూ...

పంతులు: అన్నీ అనిపిస్తాయి లేవయ్యా......మాయ గురూ! మాయ!...మహామాయ అని ఎందు లోనో చిన్నప్పుడు చదివేలే...అదే ఇది... పద...పద...పడేసీసరికి గాటీ దిగిపోవాలి... నా బండికి శేరింగు సొంగిస్తున్నాది.

సాంబ: పద సెట్టీ...పద...ముందుకుంది పండుగ... దొర మాస్తే...

పంతులు: చాల్లే గురూ...మరెంత సణుగుతావ్... పోనీ వాకిచ్చి పురుగుల్ని...

సాంబ: అర్రె...రామో బావేడీ......సాహూ... రామో యేడీ...?

సాహూ: డబ్బులక్కడుంచీ గురూ...బాధ నేదు...

సాంబ: సరె...సరె...సెట్టీ డబ్బు లక్కడుంచీ...

[ఇందర్ తప్ప తక్కిన డ్రయివర్ లు వెడతారు]

సాంబ: (పోతూ) రాగురూ...

ఇందర్ : మీరెడుతూ ఉండండి దార్లో కలుస్తాను...

సాంబ: ఏటంత అర్జంటుపని?

ఇందర్ : వెళ్లమని చెప్పేను వెళ్లు...

[సాంబ పోతాడు-ఇద్దరు ముగ్గరు కొత్త డ్రయివర్లు వచ్చి కొసబెంచీల దగ్గరకి పోతారు...మనుష్యులు వచ్చిపోతూ ఉంటారు-సెర్వర్లు డబ్బు వసూలుచేస్తూ ఉంటారు. కొద్దిసేపట్లో రామో వస్తాడు. పాలిపోయిన ముఖంతో]

రామో : (చిరునవ్వుతో) నిలబడిపోయేవేంఇందర్... అంతా వెళ్ళిపోయినట్టుంది మనవాళ్లు...

ఇందర్. ఔను...నిలబడిపోయేను... ఇలారా...మాట (ఒక ప్రక్కకి వెడతాడు...రామో వెంట వెడుతాడు) ఏటి సంగతి?

రామో : (ఆశ్చర్యం నటిస్తూ) సంగతా...ఏం సంగతి

ఇందర్ : నా దగ్గర దాపరికం ఎందుకుమావా...యిరవైఏళ్ళయి మన పరిచయంకదా...జ్ఞాపకం ఉందా నేను క్లీనర్ గా ఉండేవోడ్ని...ప్రసాదరావు బండిలో. నువ్వప్పుడే కొత్తగా హోటల్ పెట్టేవు...

రామో : మరిచిపోతావా ఇందర్...నాకు సాయంగా ఇక్కడే పడుకొనేవాడివి...

ఇందర్ : సాయమేటి మావాఁ-ఎక్కడా పడుక్కొందుకి చోటు లేకపోతే నువ్వేకదా అక్కున పడ్డావ్.

రామో : అలా గప్పుడూ అనకు...ఇన్ని ఇళ్లూ... ఇన్ని రోడ్లూ అప్పుడెక్కడివి? ఆవెనక నేకదా ఆ మేడున్న చోట శ్మసానం దిబ్బ...ఎవడికన్నా బెదురుగా నేఉండేది. ఇక్కడ పడుక్కుంటే శవాల్ని కాల్చడం కనిపించేది....

ఇందర్ : ప్రతి శనివారం పూజ...భజన—.

రామో: సాహు!...బాబుల కేమిటి కావాలో చూడు—వర్మ బాబుగా రొచ్చేరు...నెయ్యి ఎక్కువగా వెయ్యి (ఇటు తిరిగి) హోరా హోరిగావర్షాలు కారిపోతూ తడికల కప్పు.

ఇందర్ : ఆరోజులే బాగుండేవి — ఏం మావా! నెల్లాళ్ళు కొయిలా పడ్డాను గేపకం ఉందా! కొత్తగా డ్రయివరయినపుడు—అన్నదమ్ముడిలా చూసేవ్...నిన్ను మరిచిపోగలనా మావా.

రామో: దానికేముంది ఇందర్—నాకొస్తే నువ్వు చూసి ఉండవా?

ఇందర్ : చూడు—మరినాకాడ ఎందుకు దాస్తావ్... నేనిందాకట్నుంచి కనిపెడుతున్నాను. రోజూలాగ లేనే లేవు...నా దగ్గర దాచగలవా...చెప్పు సంగతేమిటి?

రామో: ఏమీ లేదు—రాత్రి సరిగా నిద్రపట్టలేదు—మైకంగా ఉంది...లొఖ్కోణో!...మనవాళ్ళొచ్చేరా?

లొఖ్కోణో: అదుగో తయారయిపోతున్నారుగురూజీ

రామో: ఇవాళ నాలుగేసి ఇడ్లీఇచ్చి...కప్పటీ ఒక్కొక్కడికి వాళ్ళ డొక్కుల్లో పొయ్యి...

లొఖ్కోణో: అలాగే గురూజీ—ఆ తుంటియాగాడు రోజూ అల్లర పెట్టేస్తున్నాడు గురూజీ—

రామో: చాలవంటాడా...మరో రెండు పెట్టలేకపోయావ్....రోజల్లా ఉండంలా మరి?

లొఖ్కోణో: అది కాదు గురూజీ...ఇన్నేళ్ళయి తింటున్నాను కదా...ఒక్కనాడన్నా డబ్బు

తీస్తేనేకాని మనస్సు బాగుండదు—ముక్తి తీరిస్తేమాత్రం ఆ డబ్బులు కావా...అది మరి కష్టం కాదా...ఒక్కసారన్నా పుచ్చుకో మంటాడు. ఈయేళ పుచ్చుకుంటేనేకాని వదల్డు.

రామో: వారేవా...సరే కానీ...చూదాం...(నవ్వుతాడు)

ఇందర్: అబద్ధం ఆడకుండా ఈమండుతున్న పొయ్యిల మీద చెయ్యేసి చెప్పు మావా.

రామో: (ఆలోచిస్తూ) ఇందర్. నన్నేమీ అడక్కు.

ఇందర్: నేనంటే నమ్మకం లేదా మావా. ఏంటో చెప్పు. ఏం కావాలంటే అది చేసి తీరుతాను.

రామో: లేదు ఇందర్. నన్నేం అడక్కు.

ఇందర్: చెప్తేకాని యివాళ లైను కెళ్ళను.

రామో: అయ్యయ్యో. ఇదేం పట్టుదల...

ఇందర్: నే నేం వెర్రోణ్ననుకోకు. ప్రతిదీ కనిపెడుతూనే ఉన్నాను...

రామో: తెలుస్తే ఎందుకడుగుతావ్?

ఇందర్: ఈయేళ నీ మొఖం చూస్తే అదోలాగుంది-నాకు నిజంగా భయం వేసిందంటే నమ్ము... ఔను...ఒట్టమ్మ...స్టీరింగు సాక్షి.

రామో: (కొంతసేపు ఆలోచించి) ఇందర్...రేపు ఉదయం నించీ ఈ హోటలు ఉండదు...ఇవాళతో సరి...

ఇందర్: (మాట్లాడక రామోని చూస్తూ ఉంటాడు)

రామో: నేను కూడా ఉండను...

ఇందర్: (నమ్మలేనట్టు చూస్తూ) నిజవేఁ! ఏటిమావా ఈ మాఁట...?

రామో: నిజవేఁ—

ఇందర్: మావాఁ...బుర్ర కరాబయి పోలేదుకద...

రామో: ఔను...నువ్వు నమ్మలేవు...

ఇందర్: నమ్మకపోడ మేటి—నీ సంగతి కొత్తగనక నా కాని ఇదేంబుద్ధి. యాపారంమంచి పూటులో ఉంది. హాయిగా ఉండక...లాబం లేదు మావా. జరగనియ్యను.

రామో: అందుకే నీకు చెప్పనన్నాను-అయినా భయమేముంది-నువ్వుండలే విందర్ -

ఇందర్: చూస్తాను—ఇవాళ లైనుకి వెళ్ళను...

రామో: ఇదేనా స్నేహం—నన్ను కష్టపెట్టడమేనా...

ఇందర్: కాని ఎందు కిదంతా...ఏటయింది నాకు చెప్పు...

రామో: (ఆలోచిస్తూ)పాతికఏళ్ళయింది ఈపొయ్యిలు రగిల్చి...ఆరకుండా మండుతున్నాయి. ఎంత వేడి ..ఎంత వేడి...

ఇందర్: ఎప్పుడూ యేదాంతమేనయ్యా ... సరిగ్గా చెబ్దూ...

రామో: తీర్థయాత్రలకి పోతానయ్యా...

ఇందర్: హారినీ...ఇదా సంగతి. దీని కింత రహస్యం దేనికి...ఎవడికీ చెప్పకుండా ఉడాయించేద్దామని చూస్తున్నావ్.

రామో: తెలుస్తే వెళ్ళనిస్తారూ మీరు—

ఇందర్: ఎక్కడా వాసనన్నా తగలనివ్వలేదు-రాత్రి వరకూ హోటలు నడిపించి...

రామో: రేపు వస్తానని ఇవాళ హోటలు మూసెయ్యాలా?

ఇందర్: నెల్లాళ్ళా—

రామో: (తల ఊచుతాడు)

ఇందర్: రెండా...

రామో: (తల ఊచుతాడు)

ఇందర్: మరి?

రామో: నాకే తెలీదు...

ఇందర్: ఇదేటి వోయిరాగం నీకు...నలభై యేళ్ళు దాటాయో లేదో...

రామో: పాతికేళ్ళు ఈ మంటలలో కాలి...కాలి... ఇంకా కాలాలా ఇందర్.

ఇందర్: (రామో చెయ్యి పట్టుకుని) ఎందుకీ వోయిరాగం....నాకు చెప్పు—

రామో: (తల అడ్డంగా ఊచి) వెళ్ళు ఇందర్....లైనుకి నీకు వేళయింది.

ఇందర్: చెప్తేకాని కదల్ను మావా.

రామో: ఎందుకు నీకీ పంతం చెప్పు...వెళ్ళు ఇందర్... నిన్నెప్పుడూ మరిచి పోలేను...

ఇందర్: (చిన్న బుచ్చుకుని) ఆ రామ్మూర్తిపంతులు నీమతి పాడుచేసేడు...అడు అన్నీ బోధచేస్తూ ఉంటాడు...నీ కిలా మతిపోయింది.

రామో: (ముందుకు వెడుతూ) సాహు...వర్మబాబు గారికి కాఫీ కలిపేవా—ధా...ధా.....ఏమి

టయ్యా ఇంత ఇది...స్ట్రాంగ్ డికాషను...
అర అరచేస్తాడు. పంచదార.

సాహు : రెడీ గురూ...

[పెదవులు విరిచి ఇందర్ వెళ్లిపోతాడు. ఒక పోలీస్ కాన్స్టేబులు ప్రవేశం]

రామో : రా...రా...అప్పారావ్...ఇవాళ ఇంత ఉదయం బయల్దేరి పోయేవ్...

అప్పారావు : మా హేడుకి చాదస్తం ఎక్కువయి...

రామో : (ఒక చెవితో వింటూ ఈమధ్యని) సాహూ...అప్పారావుకి కొబ్బరి చట్నీ...

అప్పారావు : పోతున్నాది...

రామో ! ఊఁ

అప్పారావు : ఓ రబ్బీ సాహు రెండిడ్లీ చాలు—

సాహు : వాలుగేసేను గురూ.

అప్పారావు : రెండు తీసేయెస్ దీన్తల్లీసిగాగోయ్యా, వారంరోజులి కాడ్నించి పట్టుకుందయ్యా...

రామో : ఏఁమిటి...

అప్పారావు : మరేఁమిటి...డిసెంట్రీ......
వారంరోజుల కాడ్నించి పట్టుకుందయ్యా...
డాక్టర్లు బాగుపడ్డానికే ఒస్తున్నాయిలే రోగాలు.

రామో: దానిమ్మ పింజలు చితక్కొట్టి కషాయం చేయించి పుచ్చుకున్నావ్?

అప్పారావు: ఎప్పుడూ ఇన్లేదే?

రామో: పుచ్చుకుని చూడు...

అప్పా: పనిచేస్తుందంటావా?

రామో: పుచ్చుకుని చూడ్రాదా?

అప్పా: కానీ — అదిమానేద్దాం...తెనుగు మాష్టారి పెరట్లో ఉంది దానిమ్మచెట్టు...

రామో: ఇప్పుడు టీ తాగకు—కొంచెం పాలుపుచ్చుకో ఇస్తాను.

అప్పా: ఒద్దయ్యా. వాంతోస్తుంది. లైట్ టీ యిద్దూ అంతికన్న...

రామో: లాఖోణో! అప్పారావ్‌కి లైట్ టీ...

లాఖోణో: రెడీ గురోజీ...

అప్పా: దీన్తల్లీసిగా...ఒంట్లో బాగుండక పోయినా ఉద్యోగం తప్పదయ్యా...హేడున్నాడే...
అబ్బబ్బ...ఇప్పుడు పద్నాలుగు మైళ్ళు కొరా పుట్టిపోవాల...ఏం బాబూలాల్...లైసుకేనా?

డ్రయివర్ : ఔనుగురూ—రైస్‌లోడు—

అప్పా: పచ్చయిబస్సు మాటోరుగా పెరుగుతున్నాయి లోడ్లు...ఉండు...టీ తాగేసి ఒచ్చేస్తున్నాను.

డ్రయివర్ : వేగం తెములుగురూ...డొగోడు తిరిగొస్తున్నాడా...

అప్పా: సాలేవయ్యా...ఎందరుదొరల్ని చూసేంకాదు. ఈ శ్శేటి...ఊరదొరలు—దొరంటే తెల్లోడే దొర. గిల్లు దొరసంగతి చెప్పా...

మరో డ్రయివర్ : ఏంగురూ మనసాబ యాక్సిడెంటు కేసేటయింది.

అప్పా: ఎళ్లవయ్యా...ఈ యాక్సిడెంట్లకెక్కడికవి..

డ్రయివర్ : అహాఁ...మామూళ్ళుగా అడిగేనుకదా..

అప్పారావు : యేటవుతాది...యొవక చక్రం కిందపడితే డ్రయివరేం చేస్తాడు.

డ్రయివర్ : యేటి గురూ...తీర్పిచ్చేస్తున్నావ్.

అప్పారావు : సరే. ఖరారేనా..రూపాయి రూపాయి.

డ్రయివర్ : కప్పు టి...కప్పు టీ...

అప్పారావు : రైట్!

డ్రయివర్ : యెప్పుడు కలుద్దాం.

అప్పారావు : రోజూ మనకీమనకీ ఉండనే ఉందికదా.

డ్రయివర్ : అ టేయిస్తావో నేదోకాని మధ్యని మాత్రం ఆపఁదం రాస్తావగావాల...

అప్పారావు : ఆ సంగతదే—ఈ సంగతిదే...బాగుందయ్యా టీ...లాఖోణో! కొంచం డికాషను.

డ్రయివర్ : జాగర్త...డిసెంట్రీ.

అప్పారావు : మనం యింత వేగం పావం లేవయ్యా... సత్తే యీ బాధలన్నీ యెవకుపడతాడు...

[రామ్మూర్తి పంతులు ప్రవేశం. 60 ఏళ్ళవ్యక్తి సన్నగా, పొడుగ్గా, గుండు...పిలక...పంచ; పాతలాల్చీ.]

రామో : నమస్తే పంతులుగారూ! దయచేయండి...

రామ్మూ : బావున్నావా? చెలినిండా పనిలావుంది...

రామో : రోజూ ఉన్నదే కదా...ఒరే సాహూ! పంతులుగారికి అరిడ్లీ, కారప్పొడి, కొబ్బరి చట్నీ...

రామ్మూ : అబ్బెబ్బె-నాకేం తొందరలేదు...నాకేం తొందరలేదు...తక్కినపని ముందు చూడండి.

రామో: మరేం బాధలేదు—మీరేం ఇదవకండి...

సాహూ : రెడీ పంతులుగారూ—

రామ్మూర్తి : హారి! అసాధ్యుడివిరా శిష్యా నువ్వు— అప్పుడే తెచ్చి పెట్టేసేవ్? సరే-కానీ... ఏంచేస్తాం...

[కూర్చుంటాడు]

రామా : నేతిదోసె వెయ్యమంటారా?

రామ్మూర్తి : అ[రె[రె-ఆగవయ్యా నా వలిమా? ఈ నైవేద్యం మొదట అవాలంటావా?

రామా : వాటి మాటకేంలెండి-వాటి సంగతి వాటిదే. దీనిసంగతి దీనిదే...

రామ్మూర్తి : అంతేనంటావ్... సరే చూడు... ఇవాళమాత్రం మంచి రోస్టు పెసరట్టు... ఏంఏంటే... బాగా ఉల్లిచెక్క వేసి...

సాహూ : అల్లప్పచ్చడి...

రామ్మూర్తి : హోష్! నువ్వున్నావా ఇంకా ఇక్కడ. హనుమంతుడిలాటి వాడివిరానువ్వు...

సాహూ : అనుమంతుడని నన్ననకండి...

రామ్మూర్తి : ఏమయిందిరా—హనుమంతుడు నమ్మిన బంటు.

సాహూ : ఆడెంత గొప్పోడయినా కోతేకదండి...

రామ్మూర్తి : ఎంతవాడివిరా నువ్వు... రామో... మీవాళ్లు పౌరుషవంతులయ్యా...

రామా : అంతా మీ చలవే... సాహు...మైనర్ గారొచ్చేరు. ఏంకావాలో చూడు—

[మైనర్—నలభై అయిదేళ్ళ వ్యక్తి వస్తాడు-భారీవైన ఒళ్ళు—కమీజు—పాంటు]

సాహు : గురూగారూ!...డజనిడ్లీ తెమ్మంటారా?

మైనర్ : ఏట్రా?—మడిషినను కున్నావా—ఏటను కున్నావ్?

సాహూ: ఛా ఛా......డజనిడ్లీ అన్నా తినకపోతే ఇక నేటి గురూగారూ?

[ఇడ్లీ తెచ్చి పెడతాడు]

మైనర్ : ఏట్రా నీ బలపొంతం. యేటీ చట్నీ...సాలీ సాలకుండా...నెయ్యి మరికొంచెం పట్రా.

సాహూ: తినండి గురూగారూ తెస్తున్నాను...

రామా: మైనర్ గారి బల్లేవీ లైను కెళ్ళినట్లేదివాళ...

మైనర్ : నేదయ్యా—సపయి బల్లికేగాని మనబల్లికి లోడ్లివ్వటంనే దియాలా రేపూ...ఆళ్ళ యిష్ట మొచ్చినట్టు నడుస్తున్నాది రాజ్జం...ఐదు బల్లికి వొలిసెలు, రెండు బళ్ళకి సింతపండు దొరికింది. తక్కిన బళ్ళు పూరా తొంగున్నాయి... యిలాగయితే దివాలాయెత్తివోల్సిందే పేకున్లు కట్టుకుని...

రామా: మీరే అలాగనేస్తే తక్కిన ఓనర్ల సంగతేం చెప్పేరు?

మైనర్ : ఏ బిజినెస్‌కన్నా రోజులు బాగులేవయ్యా!

రామా: రోజుల కేమిటి—మీరు ఎలా చెప్తే అలానే వింటాయి.

మైనర్ : నువ్వెప్పుడు యిలాగే అంటావ్ రామో— ఓటలనుకున్నా వేటి? నీకేటి తెలుస్తాయి ఈ వారీయాపారం నోతుపాతులు.

రాము: యిడ్లీ అయి పోయినట్టుంది—డబల్ పెసరట్టు వెయ్యనా?—

మైనర్ : యేటయ్యా రామో — యేటి, మడిసినను కున్నావా...ఏటను కున్నావా?

రామా : బాగా రోస్టుచేసి.........

మైనర్ : రుసి బాగాఉంటాదని మెక్కేస్తే యింక డాక్టర్ల కాడకి పరుగెత్తాల.

రామా : నాపరువు తీసీసేరు మైనర్ గారూ...

మైనర్ : ఏటయింది నీ పరువుకి?

రామా : కొత్తలా అనుకుంటారే—ఒకటి కాదు...అర డజన్ పెసరట్లు తినండి...రేపుదయం అజీర్తి చేసిందని అనండి ... అంతవరకూ ఎందుకు? మరోగంటకల్లా "రామో! రవ్వదోసె వెయ్య గలవూ" అంటూ మీరే రాకపోతే చెప్పుచ్చుక కొట్టండి...నా హోటల్ సామానుతిని హాస్పిటల్‌కి వెళ్ళినవాడు ఒక్కడు లేడు మైనర్ గారూ.

మైనర్ : కోపంసెయ్యకు రామో ... సరదాకన్నానయ్యా ... ఆ సేత్తోనే ఒక రవదోసెకూడా ఏసె...ఎలాసేత్తావయ్యా యింత రుసి...

రామా : అంతా మీచలవేకదా...

మైనర్ : ఇడ్లీ అయ్యా...నీ యిడ్లీ ... యిజీవారం మలబారోడేంచేసేడు......అస్తిమతాంతిరకం లేదా...

రామా : ఏదో ఆపాటిదయుంచండి...చాలు...

మైనర్ : దయకేట్లేవయ్యా ... పరువు కర్తీ నేకుండా ఉంటే సెల్లకటవుతయి ...... యేటంటారు పంతులుగారూ?

రామ్మూర్తి: కోటికి విలువైనమాట పలికేరు...

మైనర్: చూసేరా? (నవ్వుతాడు) అన్నట్టు యీ మధ్యని పెళ్ళిమూర్తాలు ఏఁవన్నా ఉన్నాయా పంతులుగోరు......

రామ్మూర్తి: లేకేం—అయితే పడిందన్నమాటే (నవ్వుతాడు) కాని...

మైనర్: యేటింకా కానీ గీనీ...

రామ్మూర్తి: ఒక్క మూడు నెలల వరకు మాట్లాడ్డానికి వీల్లేదు...

మైనర్: మూడ్నెల్లే...యేటయ్యా పంతులు గారో... తిరకాసులో ఎట్టేసినారు...

రామ్మూర్తి: అంత ఇది అంటే "సరే అంటే సరే"... అయితే ఏమిటే-మూడ్నెల్ల తరవాత అమోఘం-ఆగదలుస్తే...

మైనర్: (ఆలోచిస్తూ) మా తిరకాసులో ఎట్టేసినారే...

రామ్మూర్తి: ఇంతికీ ఈ శుభకార్యం ఎవరికి?...సంగతి సందర్భాలేమిటి?

మైనర్: (చిరునవ్వుతో మీసం రాస్తూ) నాకేనయ్యా...

రామ్మూర్తి: (వింతగా చూస్తాడు)

మైనర్: ఏఁటి పంతులుగారో ... యింతగా చూస్తున్నారు...ముసలాడ్నయిపోయినానా?

రామ్మూర్తి: అయ్యయ్యో ... అది కానే కాదు...ఆ పాటీపాటి బలవంతుల్ని చిత్తుచేసేస్తారు ... అయితే మీ కిదివరకు.

మైనర్: (పక పక నవ్వి) ఏటయ్యా బాపనోడా... మరీ సత్తెకాల పోడిలాగున్నావ్ ...ముగ్గురెక్కవటయ్యా...ఏం మగాళ్ళయ్యా...

రామ్మూర్తి: అంటే...సంతతికోసం కాని...

మైనర్: (మరింత జోరుగా నవ్వి) వారేవా! పంతులుగారో ... పిల్లలు లేరంటావయ్యా నాకు ... యీళ్ళ తల్లి సిగా...ఎనమండుగురయ్యా—

రామో: (ముఖం పాలిపోతుంది...తల దించుకుని వెనుక గదిలోనికి పోతాడు.)

మైనర్: ఇంకా యెంతమందో....ముడిసికో లారీ అన్నా ఉంటందో ఉండదో...

రామ్మూర్తి: మన ప్రభుత్వం...ఏదో ఏడ్పు...

మైనర్: అది అదే...మనం మనమే...అడ్డమైన గడ్డి తిన్నకన్న పెళ్ళిచేసుకోడం మంచిదంటారా కాదా? (పకపక నవ్వి) ఏడీ...రామో యేడి ...రామో...రామో!

రామ్మూర్తి: (విచారంగా చూస్తూ) లోపలికి వెళ్ళేడులా ఉంది...

మైనర్: (లేచి టేబిల్ దగ్గరకు వెళ్ళి) డబ్బు లివిగో - టేబిల్ మీదుంచేస్తున్నాను.

సాహూ: ఫరవా లేదు గురూజీ...లేపివ్వండి...ఏటయింది...

మైనర్: మనదగ్గర రరువుబాపతు లేదుగోరబ్బీ...మళ్లా కలుస్తాను పంతులుగారో...అది మరిసిపోకండి ...అది మామూలుగా 'నామ్‌కావాస్తే...' చుప్‌చాప్‌గా అంతా జరిగిపోతాది...

మామ్మూర్తి: (తల ఊపుతాడు)

మైనర్: (పోతాడు)

సాహూ: కాఫీయా టీయా పంతులుగారూ?

రామూర్తి: టీవోయి.

సాహూ: లైటా? స్ట్రాంగా?

రామ్మూర్తి: అంత లైటూ కాదు అంత స్ట్రాంగూ కాదు.

సాహూ: చీనీ తక్కువా ఎక్కువా?

రామ్మూర్తి: అదిమాత్రం ఎక్కువ వెయ్యిమీ-

సాహూ: నిన్న తక్కువెయ్యమన్నారు?

రామ్మూర్తి: ఇవాళ నిన్నలా ఉందా? నిన్న బతకాలని ఉంటే ఇవాళ చావాలని ఉండొచ్చు కొందరికి...

సాహూ: అందుకా రోజూ అడగమంటారూ...

రామ్మూర్తి: ఏవో ఇది చాదస్తమే లే...

సాహూ: గ్లాసులోనా...కప్పా సాసరులోనా?

రామ్మూర్తి: మాసేవా మరి—అడగడంవల్ల ఎంతలాభం ఉందో...నువ్వు అన్నిసార్లు తిరగక్కర్లేకుండా —ఇదికాదు అదీకాదు—గ్లాసు సాసరు... రెండూ మిళాయించి పట్రా...

సాహూ: మాకానోరు పంతులుగోరూ...

రామ్మూర్తి: నే చెప్పాట్రా...ప్రపంచంలో మంచీ చెడ్డా అంతా చూస్తే ఈ పంతులు నీకు జ్ఞాపకం ఉంటాడా?

సాహూ: తీఁవఁర్ని మరిచిపోతే యీ కండ్లు పేలిపోవా...

[రాను రాను హోటల్ కాళీ అవుతుంది]

లాఖ్యాణో: ఒరే లోకే ... బందుచేసేయేళయిందింక యిడ్లీ అవు...

ఎడమనుండి పురుషకంఠం: పొయ్యిమీదున్నది దిగిపోయేక బంద్.

[టీ తెచ్చి రామ్మూర్తి పంతులు టేబిల్ మీద ఉంచుతాడు సాహూ...పంతులు తాపీగా తాగుతూ ఉంటాడు. రాను రాను హోటల్ ఖాళీ అవుతుంది. ఆఖరిమనిషికూడా వెళ్ళిపోతాడు పనివాళ్ళు తప్ప; తలుపు మూసేస్తాడొక సెర్వర్—అప్పుడే తెలతెలవారుతూ ఉంటుంది—సెర్వర్లు బెంచీలు అవీ తుడిచి సర్దుతూ ఉంటారు—అవయాక వెనుకకి పోతారు.]

రామ్మూర్తి: (తాగడం పూర్తిచేసి) సాహూ...తీసుకపో...

సాహూ: తొందర్లేదు—తాపీగా తాగండి—

రామ్మూర్తి: అయిపోందయ్యా తాగడం...

సాహూ: యేటెంతి యేగం తాగేసినారియేళ...

రామ్మూర్తి: వేగమేమిట్రా...పది నిముషాలన్నా పట్టిందంటావా?

సాహూ: గోజా ఒక పావుగంట కానిదీ...

రామ్మూర్తి: (పొయ్యలని చూస్తూ) ఎప్పుడూ అనిపిస్తూ ఉంటుంది. ఈ మంటలని ఎందుకార్పరా అని...

సాహూ: యెప్పు డెలిగించేరో కాని దానికిక ఆర్పడం లేదు పంతులుగారూ...మధ్యానానికి సామానంతా ఇప్పుడెవుద్దా...మళ్లా రాత్రికి సామానా...రెండో ఆట సినీమావరకూ ఉండాలా రాత్రి...మళ్ళా నాలుగ్గంటల్నించి లారీలు డయివర్లు—

రామ్మూర్తి: (ఆలోచనగా) ఔనౌను....ఎప్పుడూ అదే మంట...ఎప్పుడూ అదే హోటలు...

రామ్మూర్తి మనస్సు: (లైట్ల రంగు మారుతుంది ఎగుపుకి)

ఎప్పుడూ అదే రామో...ఈ బెంచీ...ఈజాగా. వారు అరిడ్లీ....పెసరట్టు....కప్పుటీ....అవే కబురు...కాస్త అటూ ఇటూ మార్చి...టీ తాగుతూ రోడ్డుకేసి చూడడం...రోడ్డుకేసి...రోడ్డుమీద నిండే చీకట్లకేసి చీకట్లలోకి చూస్తూ టీ తాగడం...జిగేల్ జిగేల్ మని లైట్లతో పారూరు పోయే లారీలు...రోడ్డుతుడిచే చచ్చుటి వాడు...చీపురుతో చప్పుడు చేస్తూ...వాడిపోయి నలిగిపోయిన పువ్వులలో ఇళ్ళకిపోయే ఆడవాళ్ళు టీ తాగి రోడ్డుమీదికి వెళ్ళేసరికి తోరాపుట్టి పోయే పైడితల్లి పాతబస్సు...అప్పుడే బయల్దేరుతూ...ఇవే...ఇవే...ఎప్పుడూ....ఇవే...

[లైట్ల రంగు మారుతుంది]

సాహూ: యేటి పంతులుగారూ...యేదాంతం మొదలెట్టేరు...

రామ్మూర్తి: నా కాలం రానీరా శిష్యా...ఆ గోడ మూలనున్న ఆ నల్ల కిటికీ చూసేవ్... దానికడ్డ ఊచలు...మసిబట్టిన ఊచలు...

రామ్మూర్తి మనస్సు: (లైట్లరంగు మారుతుంది ఎరుపుకి) అవి ఆనాడూ ఇలానే ఉన్నాయి......ఈ నాడూ అలానే ఉన్నాయి. నాకు వాటిని చూస్తే...ఆకిటికీని చూస్తే కంపరంపుడుతుంది. ఇరవై ఏళ్ళ...నా వేపే సవాలుచేస్తూ చూస్తున్నాయనిపిస్తుంది...వాటికక్కడ అలా ఉండడానికి హక్కేమిటి...ఆ ఊచలకి? ఏం కిటికీ! దానికి చావు లేదు కామోసు...అలా వాటికేసి చూస్తూనే ఒకనాడు కన్నుమూసేస్తాను... అవిమాత్రం అలానే ఉంటాయి. మారవు... మారవు.

[లైట్లు మారుతాయి]

సాహూ: కిటికీ యేటి చేసింది పంతులుగారూ...యిరిసేద్దునా?

రామ్మూర్తి: తప్పు—దానికి ప్రాణం లేదనుకోకు...... అది బతికే ఉంది...దానంత అదే చావాలి... చచ్చిందిగా అనిపించాలి. లాభం లేదు... అందరి అంతూ చూసేస్తాయి...

సాహూ: మీకు ముండా (బుర్ర) ఖరాబ్ అయిపోయింది పంతులుగారూ...

రామ్మూర్తి: ఇవాళిట్రా నీకు తెలిసింది?

సాహూ: రొళ్ళండి పంతులుగారూ...

[రామో ప్రవేశం: ముఖం విచారంగా ఉంటుంది]

రామో: పంతులుగారికి టీ యివ్వలేదా?

రామ్మూర్తి: యివ్వడం...పుచ్చుకోడం అన్నీ అయేయి. ఇంక కేనికొడ్నించి కదలడం తరవాయి...

రామో: కూచోండి...కొంచెం...మాటాడాలి...

రామ్మూర్తి: అలానే కానీ. పదా ..పాటా రాను రాను ఒక చెట్టులా తయారవుతున్నాను... జడత్వం వచ్చేస్తోంది—

రామో: నువ్వెళ్ళు సాహూ...మీరంతా వెళ్ళండి...

సాహూ: మధ్యాహ్నానికి మసాలా గారా, ఉల్లి గారా?

రామో: ఏమిటి చేయించమంటారు.

రామ్మూర్తి: పెసగ్గారి చేయించు...

రామో: విన్నావా!

[సాహూ తలవూచి వెళ్ళిపోతాడు]

మరోకప్పు టీ తెప్పించమంటారా.

రామ్మూర్తి: వద్దయ్యా...జలుబు చేస్తుంది...

రామో: మీరు మారలేదు పంతులుగారూ... ఆ నాటికీ ఈ నాటికీ...

రామ్మూర్తి: ఇందాక అదే అనుకుంటున్నానే... ఎప్పుడూ ఆ నేనే...ఎప్పుడూ ఇదే...ఒక నాడు అనుకోకుండా అహం కొస్తా వస్తుంది...ప్రపంచానికీ మనకీ ఋణం తీరి పోతుంది...

రామో: (విచారంగా) చచ్చిపోయేక ఏమిటుంది పంతులుగారూ...జీవుడని...మరోజన్మ అని ఉంటాయా.

రామ్మూర్తి: నాకు తెలీదు...ఎవరన్నా చూసేరా?

రామో: పెద్దవారు...మీకు తెలీనిది ఉంటుందా... ఎన్నాళ్ళనుండో అడగాలనే అనుకుంటున్నాను...ఇవాళ తెల్సుకోవాలనిపించింది.

రామ్మూర్తి: ఎవరూ చచ్చినవాడు వచ్చి చెప్పలేదు కదా? సామరస్యంగా బతుకు నడపడానికివన్నీను...ఈ వేదాంతం అంతా అందుకే— బతికినన్నాళ్ళూ హాయిగా, తృప్తిగా బతకేందుకు...స్వర్గమూ, నరకమూ అన్న పదాలూ అంతే.

రామో: అయితే మనిషి చచ్చేక జీవుడు ఉండడంటారు...మనిషి మరోజన్మ ఎత్తడంటారు...

రామ్మూర్తి: జీవుడికి చావులేదు...మనిషికి మరో జన్మ ఉంది...

రామో: యిప్పుడిలా అంటారేమిటి?

రామ్మూర్తి: ఇక్కడ లెఖ్ఖలోకి తీసుకోవల్సింది ఏ ప్రత్యేకవ్యక్తినీ కాదు—నిన్నూ...నన్నూ కాదు...సృష్టిని...అందులో మనం ఎన్నో వంతు...ఎప్పుడూ జీవంతో వెలిగే ఈ సమస్త సృష్టీ జీవుడు—అదే ఆత్మ...అదే అన్నీను... మనిషి నాశనమైనా మనిషిరూపంలో కాక పోతే మరోరూపంలో జీవుడు ఉంటాడు... సృష్టికి కొసలేదంటారు...అది ఉన్నన్నాళ్ళూ జీవుడు ఉంటాడు.

రామో: మనిషికి మరోజన్మ...

రామ్మూర్తి: మనిషి జన్మిస్తూనే ఉన్నాడు. నేను పోయినా...నువ్వు పోయినా ఒకలక్షమంది పోయినా అంతకు రెండింతలు జన్మిస్తూనే ఉన్నారు...మనమైతే పేర్లు పెట్టుకున్నాం సాంకేతికంగా. కాని...పేర్లు లేనప్పుడు నువ్వు మనిషివే...చీమలున్నాయి...చీమలు పుడుతున్నాయి...చీమలు చస్తున్నాయి అంటాము ...ఒక ప్రత్యేకచీమ అని అనుకోం...అలానే మనిషీని...నీ పేరు మనిషి; రామో కాదు... నువ్వు అలా పుడుతూనే ఉంటావు— మనుష్యజాతి ఉంది అంటే నువ్వు మళ్ళా మళ్ళా పుడుతున్నట్టే లెఖ్ఖ......

రామో: (ఆలోచిస్తూ ఉంటాడు)

రామ్మూర్తి: ఏంరా రామో...ఆలోచనలో పడ్డావు.

రామో: పంతులుగారూ......మీకో సంగతి చెప్పడానికి జంకుతున్నాను......

రామ్మూర్తి: (ఆత్రంగా) ఏమిటేమిటి ... ఏమిటయింది......

రామో: (నవ్వి) ప్రమాదం కాదు......మామూలుదే— మీతో అంటూ ఉండేవాడ్ని కదా—తీర్థయాత్రలూ అవీ అని చాలాసార్లు...అదే......

రామ్మూర్తి: ఔను...మనం వాదించుకున్నాం కూడా ...అయితే వెడతావా?

రామో: (ఔనన్నట్టు తలవూపుతాడు)

రామ్మూర్తి: ఎప్పుడు...

రామో: రేపే—

రామ్మూర్తి: (మౌనం వహిస్తాడు ... ఇద్దరూ మౌనంగా ఉంటారు) ఎన్నాళ్ళు...

రామో: (విచారంగా) మరి తిరిగి రాననుకుంటాను...

రామ్మూర్తి: హోటలో......

రామో: (తల అడ్డంగా ఊపుతాడు)

రామ్మూర్తి: ఊఁ (ఇద్దరూ మౌనంగా ఉండిపోతారు)

రామో: మిమ్మల్ని తల్చుకుంటేనే విచారం పంతులు గారూ—తెల్లారుతూ ఉండగానే మీకు ఇడ్లీ పెసరట్టు, టీ పాతికేళ్లనుండీ అలవాటయి పోయింది......

రామ్మూర్తి: (విచారంగా) నా గురించి ఎందుకయ్యా విచారం...

రామో: నాచేతిమీదుగా మీకవి అందించడం నా కెంతో తృప్తి—ఏదన్నా అలవాటయినాక వదలడం కష్టంకదా పంతులుగారూ... ప్రొద్దుటే మీరు అగుపడకపోతే నా మనస్సు కెంత కష్టంగా ఉంటుందో మీకు తెల్సా—

రామ్మూర్తి: (చిరునవ్వులో) నీ టీ లేకపోయినా నాకంతే—

రామో: (మౌనం)

రామ్మూర్తి: ఈ పాతికేళ్ళయి చూడని తీవ్రమయిన మార్పేదో నీముఖంలో నాకు ఇవాళ కనిపిస్తున్నాది...ఏదో గాఢమయిన అనుభూతి. విచారమేమో...ఏమి టది రామో?

రామో: అందర్నీ వదలి వెళ్లడం...

రామ్మూర్తి: ఉహూ ఏదో తొక్కిపట్టే ఉంచేవ్... ఇన్నేళ్లయి. ఇవాళ బట్టబయలుగా నీకళ్ళలో అగుపిస్తున్నాది. ఆ ఇది ఎప్పుడూ నీ ముఖంలో చూడలేదు...

రామో: (ముఖం తిప్పుకుంటాడు)

రామ్మూర్తి: రాళ్ళలా పుట్టించక ఈ గజిబిజి మనస్సులతో కూడా పుట్టించేడే భగవంతుడు. ఏదో అర్థంకాని చెప్పలేని ఆవేదన...కృంగదీస్తూ—వీల్లెరబడి వెంటాడుతూ...

రామో: పాతికేళ్ళు పంతులుగారూ—

రామ్మూర్తి: ఆ రోజు నా కింకా జ్ఞాపకముంది. రామో...ఇదే పాక, పైన తడికలలో...

రామో: ఈ పొయ్యిల్ని అప్పుడే రాజేసేను...మొదటసారిగా...ఇన్నేళ్ళూ ఆరకుండా...

రామ్మూర్తి: మన ఇద్దరికీ పరిచయం లేదు. రోడ్డున పోతూ ఉంటే...పంతులుగారూ! "రెండు ఇడ్లీ కాఫీపుచ్చుకోరా" అంటూ కేక వేసి నా చెయ్యి పట్టుకలాక్కొచ్చేవ్...అవును గాని నేను పంతుల్నని ఎలా తెల్సిందయ్యా...

రామో: అదీ వింతేనా పంతులుగారూ...మిమ్మల్ని చూడగానే అలా పిలవాలనిపించింది—

రామ్మూర్తి: ఆ రావడం రావడం పాతికేళ్ళు...

రామో: పాతికేళ్ళు...అవే మంటలు! పంతులుగారూ ఆ మంటల్లో పడిపోయే నిన్నాళ్ళూ!

రామ్మూర్తి: (ఆలోచిస్తూ ఉంటాడు)

రామో: కాలుస్తున్నాయికాని చంపవు...ఎంత బాధ పంతులుగారూ—

రామ్మూర్తి: (రామో భుజంమీద తట్టి) రామో...

రామో: ఇంక నేను భరించలేను పంతులుగారూ... శక్తి...సహనం...పోయేయి... ఆ మంటలు మింగేస్తాయి నన్నింక...మసి బూడిద...చేసేస్తాయి—అవి నన్ను మింగేయకుండా ఆర్పేస్తాను...ఊహూ...ఆర్పలేను — తప్పించుకుంటాను...ఉఁహూఁ...తప్పించుకోలేను...

రామ్మూర్తి: రామో...ఏఁవి టయ్యా...అంతబాధ అంతతీవ్ర వేదన...ఇన్నేళ్ళయి మనసులో ఏ మంటల్ని దాచుకున్నావు ... ఇంత గుప్తమా రామో... నేను నీకు ఆప్తుణ్ని కానా...

రామో: ఈ మంటలది కనుపించని కాలుపు...మాటలలో చెప్పలేని బాధ...యాతన...

పంతులు: చెప్పగలిగింది చెప్పు...రామో...తక్కింది అర్థం చేసుకుందుకి ప్రయత్నిస్తాను...

రామో: ఈ పొగల్లు మీకందించను పంతులుగారూ—ఈ గుండెలోనే మంటనీండి—రేపటినుండి తగ్గిపోతాయి ... తిరగ్గా ... తిరగ్గా ... చల్లారతాయి...కాని మీరు తెల్సుకుంటే నాలో ఆరిన మంటలు మీలో రగులుకుంటాయి... మీరు బాధపడతారు. నాగురించి—ఒద్దు పంతులుగారూ.

రామ్మూర్తి: (మౌనంగా కిటికీకేసి చూస్తూ ఉంటాడు)

రామో: ఆరోజులు జ్ఞాపక మున్నాయా పంతులు గారూ.

రామ్మూర్తి: (తలఊపుతూ) ప్రతిసంగతీ...ప్రతిసంగతీ...సన్నగా నాజూగ్గా ఒక కుర్రాడు—దబ్బపండులా మిసమిసలాడుతూ...చురుకైన కళ్ళు...నిజం...ధర్మం...జాలి...ఆ మనిషి రక్తంలోని పాళ్ళు...

రామో : (కలవరిస్తున్నట్లుగా/కలలోలా వింటూ) బంగారపు ఊచలతో కట్టిన ఒక ఖైదు మెట్లు ఎక్కాడు... ఏమయినా అవి ఊచలే... అది ఖైదే... ఇన్ని ఏళ్ళయి శిక్షని అనుభవిస్తున్నాడు.

రామ్మూర్తి: నీకథ తప్పు—కొన్ని ఆశయాలు—కొన్ని నియమాలూ పాటిస్తూ అందరికీ మంచిని చేస్తూ జీవితం మొదలుపెట్టేను స్వతంత్రంగా—

రామో : (తల అడ్డంగా ఊపుతాడు)...

రామ్మూర్తి : మంచిని మానేశాను—చాలేను...

రామో : ఆమని ఎవరో నాకు తెలీదు పంతులు గారూ.

రామ్మూర్తి. ఆమనసు మరింత వికశించేందుకు... ఈ చేతులమీదుగా వెకలిగించేను ఒక చెలిస్నేహాన్ని ...కాని...

రామో: (ముఖం చేతులతో కప్పుకుని) మంట రగిలింది.

రామ్మూర్తి: (విచారంగా తలఊచి) విధి ప్రతికూలించింది...ఔను...ఎంతో విషాదాన్ని భరించేవ్ ధైర్యంగా...కాని...చూడు...రెండోసారి.. నేనె మరో మనసుని కలిపేను నీమనస్సుతో... నీ మనస్సు చల్లారింది...నీకు శాంతి దొరికింది.. నాకు కూడా.

రామో: లేదు పంతులుగారూ...రెండో మంట రేగింది రెట్టింపు వేడితో...దూరాన ఉండి మండే మొదటి మంటకి తోడుగా...కాల్చి... కాల్చి...మసిచేసి—బూడిదచేసి గాలిలో కలిపేందుకు—

రామ్మూర్తి : రామో...రామో.. అవేంమాటలయ్యా!

రామో: (చెయ్యి అడ్డుపెడుతూ) ఒద్దు పంతులు గారూ--ఆ సంగతులు మనొద్దు...మీకు బాధ...

[మౌనంగా ఇద్దరూ కూచుంటారు]

రామ్మూర్తి: రామో...నీ మనసు బాగలేదు.. ... విశ్రాంతి తీసుకో...వెళతాను...

[లేచి నిల్చొంటాడు—రామో తలఎత్తి చూసి ఉలికిపడతాడు-రామ్మూర్తి పంతులుకూడా... ఇంట్లోకి దారితీసే ద్వారం వేపు చూసి—

ద్వారంవద్ద నిల్చుంది ఒకస్త్రీ--మధ్య వయస్కురాలు-పచ్చటి శరీరచ్ఛాయ అందమైన పెద్దకళ్లు, విశాలమైన నుదురూ, ముద్దువచ్చే పెదవులతో— నీలిరంగుచీర......తెల్లటి రవిక వేసుకుంది... విరబోసినజుత్తు...ఆమె అలానే నిల్చుంది రామోని మంత్రకత్తెలా చూస్తూ...ఆ చూపులలో, చెప్పనలవికాని ద్వేషం...వాటిలో కోపరేఖలు లేకపోయినా భయంకరంగా ఉన్నాయి.....భూ లోకానికి అవతరించిన శక్తిలా ఉందాస్త్రీ...]

రామో: (ఎండిపోయిన గొంతుతో) కాలిపోతాను... కాలిపోతాను...స్వేచ్ఛ...ముక్తి.. నాకు లేవు.. లేవు పంతులుగారూ !...

[ఆమె అలా నేచూస్తూ నిల్చొంటుంది. రామో బెంచీమీద కూలబడి కళ్లు కప్పుకుంటాడు. రామ్మూర్తిపంతులు మాటరాక నిలబడిపోతాడు.. ఆమె అలా కొంతసేపు చూసి దేవతలా మాయమౌతుంది]

పంతులుగారూ లాభం లేదు.

రామ్మూర్తి: (బెంచీమీద కూలబడి తలవంచి నేలను చూస్తూ). బతికే జానెడు బతుకులో కూడా ఈ సెగలూ పొగలూ ఎందుకయ్యా దేవుడా! ఒకే ఒక్కసారి చాలదా! [ తెర ]

## రంగం: 2

* * అంతా మొదటిరంగంలోలానే ఉంటుంది.

సమయం - పగలు - రెండుగంటలు - ఆరోజే.

రామో ఒక్కడూ ఒక కుర్చీలో కూర్చున్నాడు...తలదించి ఆలోచిస్తూ ...ఆమె వెనుకనుండి వస్తుంది...

రామోవేపు కొద్దిసేపు భావశూన్యంగా చూస్తూ నిల్చొంటుంది ... కొద్దిసేపు. అసహ్యంతోనూ కోపంతోనూ ఆమె కళ్లు ప్రజ్వలిస్తాయి...ఆమె పళ్లు బిగబడుతుంది ... ముఖం తిరిగినట్టయి ... తూలిటేబిల్ కిఆని నుదుటిమీద చెయ్యి వేసుకుని మంటలవేపు తిరిగి వాటికేసి చూస్తూ నిల్చొంటుంది...తరువాతఆమె

పిడికిళ్లు బిగుస్తాయి...చేతులు సగంపైకి లేచి దిగుతాయి...ఇటు తిరుగుతుంది. ఆమె ముఖం భావరహితంగా ఉంటుంది...టేబిల్ కానుకుని రామో ఒంటిమీద చెయ్యివేస్తుంది - రామో ఉలికిపడి లేచి ఆమెనుచూసి కొయ్యబారిపోయినట్లవుతాడు...ఆమె అతని కళ్ళలోకి భావరహితంగానే చూస్తూ నిల్చుంటుంది — ఆ చూపులకి తట్టుకోలేక రామో ముఖంతిప్పుకుని కూచుంటాడు.

ఆమె: (సున్నితంగా) ఒళ్ళు వేడిగా ఉంది...

రామో: (మాటాడక తల దించుకుంటాడు)

ఆమె: మంటలదగ్గర ఎక్కువ ఉండకండి...

రామో: (మౌనం)

ఆమె: చల్లటి గాలి...మల్లెపూల వాసన... స్వేచ్ఛ... విశాలంగా...చల్లగా......హాయిగా...పాపాయిలా నిద్రపోయేట్టు చేసే స్వేచ్ఛ...... బావుందా...

రామో: (మౌనం)

ఆమె: అవి కావాలికదూ?

రామో: (కాదన్నట్టు తల ఊపుతాడు)

ఆమె: ఔను...ఏం?

రామో: ఉహూ...

ఆమె: అదేం పంతం...కావాలనండి...అంటున్నాయి మీ కళ్ళు...

రామో: ఔను...కావాలి...

ఆమె: దొరుకుతే...

రామో: దొరుకుతుంది...

ఆమె: ఔను...ఈ మంటల వేడినించి ముక్తి దొరుకుతుంది కదూ...

రామో: ఔను...దొరుకుతుంది.

ఆమె: చల్లగా...హాయిగా...పక్షిలా ఎగిరి పోతారు కదూ...

రామో: (నిశ్చయాని కొచ్చినట్టు) ఔను ... ఎగిరి పోతాను ... చల్లగా ... హాయిగా...పక్షిలా ఎగిరిపోతాను...

ఆమె: ఒక్కసారిగా ఆ చల్లదనానికీ స్వేచ్ఛకీ తట్టుకోలేరు ... ఉక్కిరిబిక్కిరయిపోతారు ...ఊపిరాడదు.

రామో: అప్పుడు...ఆ చల్లదనంలో...అక్కడే హాయిగా (ఆమె కళ్లలోకి చురుకుగా చూసి) ప్రాణం వదుల్తాను...

ఆమె: (పకపక 'హిస్టీరికల్'గా నవ్వి) ఎంత హాయి అది! ఎంత ఆశ మీకు!

రామో: ఆ ఆశతోనే బతుకుతున్నాను...నా ఆశని... నన్నూ ఎవరూ వేరుచెయ్యలేరు.

ఆమె: ఎవరో అదేపని పెట్టుకున్నట్టు...

రామో: (ఊరుకుంటాడు).

ఆమె : మీ ఆశనీ...మిమ్మల్నీ ఎవరూ వేరుచెయ్యలేరు...చల్లగా హాయిగా పక్షిలా ఎగిరిపోతారు ఎవరాపగలరు మిమ్మల్ని?

రామో: ఎవరాపగలరు...ఎవ్వరూ ఆపలేరు...ఇరవై ఏళ్లయి మండుతున్న ఈ సెగలు. ఈ వేడి... నుంచి....ఏనాడన్నా ... ఏనాడన్నా...విడుదల...ముక్తి...ఉండొద్దా...

ఆమె : (ముఖం ఎర్రబడుతుంది—కళ్ళు ఛుక్కుమని మెరుస్తాయి) మంటలనుంచి ముక్తి!...ఎంత స్వార్థం...ఎంతస్వార్థం...

రామో : స్వార్థమా?...స్వార్థమా?... నేనూ మనిషి నేనా...మనిషిలా బతక్కపోయేందుకు నేనేం తప్పుచేసేను...నాకెందుకీశిక్ష?

ఆమె : (ఆలోచిస్తూ) మనుషులే...ఔను ... మనుషులే మీరు...హక్కుంది...

రామో : ఔను...హక్కుంది ... శారదా ... నాకు హక్కుంది...

శారద : (పైకప్పుకేసి చూస్తూ తనలోతను) ఎంత స్వార్థం! ఎంత స్వార్థం!

రామో : (ఆవేశంతో చివాల్న లేచి ఆమెవేపు వేలు చూపుతూ వణుకుతున్న పెదవులతో నిల్చుండి పోతాడు మాటాడలేక)

శారద: (ధిక్కరిస్తున్నట్టు చూస్తుంది)

రామో: శా...ర...దా...

శారదా: ఊఁ...? (కనురెప్పలు ప్రశ్నార్థకంగా పెట్టి వినోదంగా చూస్తుంది)

రామో: మంటవి...మంటవి...కాలుస్తున్నావ్..మెల్లి మెల్లిగా ... చావుబతుకులమధ్య ... స్వేచ్ఛా బానిసత్వాల మధ్య ఉంచి...

శారద: (ఆశ్చర్యపోతు—అసహ్యంగా చూస్తుంది)

రామో: స్వార్థమా?...నాకా! (బెంచీమీద కూలబడి ముఖం కప్పుకుంటాడు...)

శారద: (హిస్టీరికల్ గా నవ్వుతుంది)

రామో: నే నేం చేసేను అంత తప్పు...పొరపాట్లు జరిగేయి...అవి అంత దోషమా...అంతనిర్దయా.. ఎందుకు కాలుస్తున్నాయి నన్నీ మంటలు...దయ జాలి...లేకుండా...

శారద: దయ...జాలీ...(నవ్వుతుంది)

రామో: ఔను...మంటల కెందుకుంటుంది...దయ... జాలి...

శారద: (బెంచీని పట్టుకుని చేతితో కళ్ళు కప్పుకుని) అయ్యో...అయ్యో....

రామో: ఔను...కాల్చు......బూడిదగా ఎందుకు చెయ్యవ్...బూడిదగా...

శారద: (పిచ్చిదాన్లా నవ్వుతూ దగ్గరకువచ్చి రామో తల రెండుచేతులతోనూ పట్టుకుని ఆ కళ్ళలోకి చూస్తూ) చేస్తాను...చేస్తాను...నేను బూడిదయినప్పుడు...మంటని ... మంటని... కాలుస్తాను......నాజోలికి రాకండి...... కాల్చుకుంటాను...నన్ను నేను ... కాలిపోతాను ... మసి...బూడిద అవుతాను ... (తలవదిలి) అవగలనా?...అవగలనా ... ఇన్నేళ్ళయి రగులుకున్న మంట నాలో...ఆరుతుందా...చెప్పు... నువ్వు చెప్పు...నాలో మంట రగిల్చేవ్...చిచ్చుపెట్టేవ్...నిన్ను కాల్చకుండా వదుల్తుందా నువ్వు రగిల్చిన మంట? ఎగిరిపోతావ్...... చల్లగా...హాయిగా పక్షిలా ఎగిరిపోతావ్... స్వార్థం కాదు ... ఔను ... స్వార్థం కాదు... మనిషివి...

[రామ్మూర్తి పంతులు వస్తాడు......నిల్చుండిపోతాడు వింతగా చూస్తూ]

శారద: (అతన్ని అసహ్యంగా చూసి) అడుగో ఆ బ్రాహ్మడు ......ఆ బ్రాహ్మడే పేర్చేడు సమిధల్ని...

[సుడిగాలిలా లోపలికి పోతుంది]

రామో: (ఏస్థితినీ నమ్మలేనట్టు కూచుంటాడు).

రామ్మూర్తి: (రామో ప్రక్కనే కూచుంటాడు మౌనంగా).

రామో: పంతులుగారూ.

రామ్మూర్తి: రామో...నీకేం చెప్పగలను. ఎలా సానుభూతి చూపగలను ... ఎంతబాధ ... ఎంత వేదన—ఎన్నాళ్ళు!...ఎన్నాళ్ళు!...ఎందుకింత అన్యాయం ప్రపంచంలో...

రామో: మీరు బాధపడకండి...

రామ్మూర్తి: ఇటువంటి పరిస్థితిలో నీవంటివాడ్ని ఉంచి అతడుపడే బాధని చూదామని ఉంటుంది కామోసు దేవుడికి......కానప్పుడు దీనికేం అర్థం....?

రామో: మీకీ సంగతులు తెలియకుండా...మీకీబాధ పంచకుండా ఉందామనుకున్నాను......కాని ఈ ఆఖరుగోజున మీరు తెల్సుకున్నారు.

రామ్మూర్తి: (మౌనం)

రామో: మనిషికి మరోజన్మ ఉందంటారు...

రామ్మూర్తి: (రామోభుజంమీద తడతాడు).

రామో: ఈ బతుకే మరోసారి నాకిస్తే...చేసిన పొరపాట్లు దిద్దుకుంటాను...

రామ్మూర్తి: దానికి మరోజన్మ ఎత్తాలా రామో.

రామో: ఈ తప్పు ఈ జన్మలో సరిదిద్దసంకాదు... నేరం... నేరం...

రామ్మూర్తి: నువ్వేం నేరంచేసేవయ్యా రామో... ఎవరయినా నమ్మగలరా... ఎవరికయినా హాని చెయ్యగల మనస్సేనా నీది...

రామో: మీరు మరో అభిప్రాయంలో ఉన్నారు... అన్యాయం నాకు జరిగిందనుకుంటున్నారు... కాదు... నేరం చేసింది నేను...

రామ్మూర్తి: ఒక సదుద్దేశంతో నువ్వు చేసిన పని ఇలా అయితే నువ్వేలా నేరస్తుడివి?...

రామో: తెల్సుకోవల్సింది... తెల్సును...కానిగుడ్డిగా ... స్వార్థంలో... కేవలం స్వార్థం...కోరికలకు బానిసనై... మనస్సు నిగ్రహించుకోలేక ... బలహీనతకి లోబడి...

రామ్మూర్తి: రామో... ఇటుచూడు... నావేపు చూడు......వివాహం పురుషుడి స్వార్థం అంటావా?...సుఖదుఃఖాలలో ఇద్దరికీ పాలుండదంటావా. పోనీ ఆ అమ్మాయి చదువుకోనిది... తెలివిలేనిదీ కాదు...పురాణగ్రంథాలన్నీ చది

వింది...ఏ కష్టాలలోనన్నా ఆడది ఎలా ప్రవర్తించాలో ఆమెకి తెలీదా?...

రామో : (మౌనం)

రామ్మూర్తి : చెప్పు రామో.

రామో: ఇది వేరు పంతులుగారూ...మొదట జరిగింది పొరపాటు...తెలియని పొరపాటు ... దానికి నేను బాధ్యుణ్ణి కాను...భగవంతుడు నన్ను క్షమిస్తాడు...అందుకు శిక్ష అనుభవించేను... ఘోరమైన శిక్ష అనుభవించేను...స్త్రీలో. స్త్రీత్వమే కాకుండా ఒక శక్తి...దీక్ష పూనగలిగే శక్తి ఉందని తెల్సింది...అయినా తెల్సి తెల్సి చేసేను రెండవసారి పొరపాటు...పొరపాటు కాదు... నేరం...ఏ స్త్రీ క్షమిస్తుంది పంతులుగారూ...

రామ్మూర్తి: రామో... నేరం...నీదే అన్న నిర్ధారణ ఏమిటి...?

రామో: తెల్సి తెల్సి ... ఓదార్పు మాటలంటారేం పంతులుగారూ...బతికిఉన్న రెండు జీవులూ సాక్ష్యం...నన్ను ఇంకా శిక్షిస్తూ...

రామ్మూర్తి: (తల దించుకుని చెప్పవద్దన్నట్టు చెయ్యి ఊపుతాడు.)

రామో: (ప్రతినిముషం శిక్షిస్తూ...అది తెలిసిఉండి... తెలిసి తెలిసి...కేవలం స్వార్థంకోసం...

రామ్మూర్తి: శిక్ష అనుభవించేవ్ కదా రామో దానికీ... అది చాలదా...ఇంక ఈ బంధాలు బాధల్లో నుంచి విడుదల అవడం...అందుకు ప్రయత్నించడం న్యాయం కాదా...

రామో : ఇది శిక్ష కానే కాదు...ఆమెలో రగిలే మంట ముందు... నేనే...ఈ చేతులతో నే... తెల్సి తెల్సి... నేనే రగిల్చే నామెలో...ఆమె జీవితం నాశనం చేసేను ... అయినా ఎంత ఓర్పుతో సహిస్తోంది...ఆమె ఎందుకు సహించాలి...అందులో బతుకల్లా ఆమె ఎందుకు కాలాలి...మొదట నాకు పడిన శిక్షవంటిదే ఈమె కూడా ఎందుకు విధించకూడదు?

రామ్మూర్తి : ద్రోహం చేసేవని అనుకుంటూ ఏవో అభూతకల్పనలు మనసులోనే చేసుకుని బాధపడుతున్నావిన్నేళ్లు...ఒక మాట చెప్పు... ఏమీ తెలీకుండా ఆమె నీగడప మెట్టిందా...

రామో : ప్రపంచాని కేమితెల్సో ఆమెకి అదే తెల్సు...అందరూ నామీద సానుభూతి చూపితే ఆమెకూడా నామీద ప్రేమ, సానుభూతి చూపింది... మొదటి నాలుగయిదేళ్ళూ నాలుగు క్షణాలలా గడచిపోయేయి...ఎంత ఆనందంగా గడచిపోయేయి ... అప్పుడు...దీని వెనుకనున్న కారణం ఏది తెలుస్తే కోపమంతా నామీద మోపేదో ప్రపంచం — ఆ కారణం అప్పుడు ఆమె కేమి తెల్సు పంతులుగారూ.

రామ్మూర్తి : నువ్వు అన్ని కారణాలూ నీమీదే వేసుకోడం న్యాయం కాదు — హిందూ స్త్రీ ధర్మం కష్టసుఖా లన్నిటిలోనూ భర్తకి అండగా ఉండడం అంటావా, కాదంటావా?

రామో : అందుకే నేను అనుభవిస్తున్నా నీ నరకం... అందుకే ఇన్నేళ్ళు కాలుతున్నాను మంటల్లో ...ఆమె అంతఓర్పుతో సహిస్తోందికనక నే...

రామ్మూర్తి : ఈ వింతఆలోచన లన్నీ ఏమిటి నీకు...

రామో : మొదటిలా జరిగిఉంటే ఆ ఘోరమైన శిక్షకి కొన్నాళ్లు బాధపడి తక్కిన బ్రతుకంతా భగవంతుడి పాదాలముందు ప్రశాంతంగా గడిపి ఉందును...కాని ఈమె...ఓర్పు...ఓర్పు... అండగా ఉండి ప్రతినిముషం నా ద్రోహాన్ని నాకళ్లకు కట్టేస్తోంది...నా నేరాన్ని ప్రతినిముషం నాకు ఋజువు చేస్తోంది...జీవితాంతం వరకూ ఇంతే...తను అండగాఉండి తను కాలి నన్ను కాలుస్తూ ఉంటుంది...ఇంతికీ కారణమై స్వేచ్ఛకోసం ప్రయత్నమా...ఎంత స్వార్థం... ఎలా...ఎలా...ఎలా దొరుకుతుంది ఈమంటల నుండి ముక్తి...

రామ్మూర్తి : మనిషికి ఇంత సున్నితమైన మనస్సు కూడా ఎందుకిచ్చేవయ్యా భగవాన్...

రామో : మీరు బాధపడవద్దు పంతులుగారూ వీడి గురించి...మరిచిపోండి...

రామ్మూర్తి: తీర్థాలుసేవిస్తే...వివిధస్థలాలూ మనుష్యులనీ చూస్తే నీ మనస్సు కుదుటబడుతుందని నాకు నమ్మకం ఉంది. శూన్యంలో మనసు లగ్నం చెయ్యి ... శాంతి దొరుకుతుంది ... మనసుకి స్వేచ్ఛని కలుగజేస్తుంది...

రామో: (లాభం లేదన్నట్టు తలవూపుతాడు).

రామ్మూర్తి: ఇది తప్పితే ఇంకేమార్గం ఉంది...

రామో: (ఆలోచిస్తూ వుంటాడు)

రామ్మూర్తి: ధైర్యం...రామో...ధైర్యం...

రామో: ధైర్యంఉంది...మీరు చెప్పిన మార్గం ఒక్కటే ఉంది...నా నిశ్చయంకూడా అదే...కాని...

[శారద సడిలేకుండా ప్రవేశిస్తుంది...ఇద్దరి ముందూ నిల్చుంటుంది. ఆమె ఇందాకటి గుస్తుల తోనే విరబోసుకున్న జుత్తుతోనే ఉంది]

రామ్మూర్తి: గాభరగా లేస్తాడు. లేచి ఆమె కళ్ళలోకి వెతుకుతూ చూస్తాడు ... ఇద్దరివేపూ చూసి, నిట్టూర్పి వెళతాడు)

రామో: పంతులు గారూ...రాత్రికొకసారిరండి...... సినీమాలు అయేక...మీతో మాటాడాలి...

రామ్మూర్తి: (తలఊపి వెళతాడు)

శారద: (కూర్చుని టేబిల్ మీద మోచేతులుఆన్చి)ఇరవై ఏళ్ళనాటి ఒకరోజు జ్ఞాపకం ఉందీ?

రామో: (ఆశ్చర్యపోయి చూస్తాడు...ఆమె వేపు)

శారద: జ్ఞాపకం వుందా?

రామో: ఏ రోజు...

శారద: ఆ రోజు...

రామో: ఏ...ఆ?

శారద: మన జంటబతుకులోని మొదటిరోజు...

రామో: మసకగా వుంది.

శారద: నువ్వు అన్నివిధాలా సంతృప్తి పొందడమే నా కొక్కావాలి.

రామో: జ్ఞాపకం వుంది.

శారద: ఆనందంగా వుండడమే కావాలి.

రామో: ఔను.

శారద: ఎప్పుడూ కళకళా మెరుస్తూ...పకపకా... నవ్వుతూ...

రామో: (తలదించుకుని) ఔను.

శారద: జ్ఞాపకం వుందా ?

రామో: ఉంది.

శారద: మసగ్గానా?

రామో: బాగానే...

శారద: మీ కొక్కటల్పినట్లే అయిందికదూ?

రామో: (మౌనం)

శారద: సంతృప్తిగా కళకళా మెరుస్తూ...పకపకా నవ్వుతూ

రామో: (మౌనం)

శారద: అయింది కదూ? అయిపోయింది కదూ...రేపు మీకు స్వేచ్ఛ...శాంతి...చల్లదనం...తృప్తిగా ఒక నిట్టూర్పు వదుల్తారు...మగతగా కళ్ళు మూసుకుంటూ రొకక్షణం...పక్షి అయి ఎగిరి పోతారు...

రామో: (నుదుటిమీద చెయ్యి వేసుకుని కళ్ళు మూసుకుని) ఎగిరిపోగలనా...ఎగిరిపోగలనా...

శారద: రెక్కలు లేవా? పంజరంలో ఉన్నారా

రామో: ఔను...నిజమే...నిజమే—

శారద: మరొకపక్షి...రెక్కలున్నా ఎగరలేనిపక్షి ఆ పంజరంలో తృప్తిగా కళకళా మెరుస్తూ పకపక నవ్వుతూ....హాయిగా ఉంటుందికదూ...

రామో: (మౌనంగా తల దించుకుంటాడు).

శారద: చదువుకోనిదాన్ని తెలీక అడుగుతున్నాను... పక్షులలో అలా జరుగుతుందీ......(మౌనం) జంటలో...(మౌనం) తెలీదూ?...పంతులు గార్ని అడగరూ? అడిగి చెప్పరూ ?

[పకపకా నవ్వుతుంది]

రామో: (లేస్తాడు......వెళ్ళి ఆమె చేతులు పట్టుకుంటాడు...)

శారద: (ఆశ్చర్యపోయి......గాభరాగా లేచి నిల్చుంటుంది).

రామో: క్షమించు...నన్ను క్షమించు శారదా...

శారద: (మెల్లిగా చేతులు వదిలించుకుని) కూచోండి.

రామో: శారదా - నేను నీకు ద్రోహం చేసేను... అందుకు ఇన్నేళ్ళూ నిన్ను చూసిన ప్రతి నిముషం బాధపడుతున్నాను ... ఇంక నేను ఓర్చలేను...మానసికంగా ఎంత తీవ్రంగా వ్యధ ననుభవిస్తున్నానో నీకు తెల్సు...నువ్వు క్షమిస్తే నువ్వు నీ అనుమతిస్తే......ఇక్కడినుంచి దూరంగా పోతాను. ఏ తీర్థాలలోనో...ఏ ఆశ్రమంలోనో......ఏ మహాత్ముడి దర్శనం వల్లనో శాంతి దొరుకుతుందని ఆశ...

శారద: ఔను ... ఈ పిశాచగ్రహంనించి మీకు విముక్తి దొరుకుతుంది...

రామో: శారదా...శారదా ... తప్పుగా అర్థం చేసుకోకు...నీనించి తప్పించుకుపోయేందుకు చూడడంలేదు నేను... నేను చేసిన దోషం... నేరం. నా బలహీనత నీలో నాకు ప్రతినిముషం...

కనుపించి నన్ను విచారించి శిక్షిస్తూ ఉంటాయి... మరి భరించలేను శారదా...క్షమించవూ ?

శారద: ఏంటేంటి క్షమించమన్నారు...ఏంటేంటి క్షమించాలి...క్షమించేందుకు నాకు అర్హత ఉందనే అడిగేరా...

రామో: నా మనస్తృప్తిగా...

శారద: క్షమించేను అంటే మీ మనస్సుకి తృప్తి దొరుకుతుందా...నిజంగా చెప్పండి. తృప్తి దొరుకుతుందంటే ఆమాటనడానికి నాకు అభ్యంతరం లేదు...

[మౌనం]

క్షమించేను అంటే జరిగిపోయిన ఏ పొరపాటన్నా చేసిన ఏదోషమన్నా పోతుందా...

రామో: పోదు శారదా...పోదు...కాని...

శారద: ఇన్నేళ్ళయి సరోజని చూసేరూ ?

రామో: (ముఖం చిన్నబుచ్చుకుని) ఆసంగతి తెచ్చి ఎందుకు బాధపెడతావ్ శారదా...

శారద: ఆమె చేసిన పని తప్పంటారా?

రామో: తప్పొప్పులు నిర్ణయించే అధికారం నాకు లేదు...

శారద: ఆమె నెలా చూస్తారు...చూడక్కర్లేదు... ఆమెని క్షమించగలిగేరా? సరోజా నిన్ను క్షమిస్తున్నాను అని ఆమెతో కాకపోయినా మనసులోనన్నా అనుకున్నారా.

రామో: దేవుడిముందు ఆమెని భార్యగా స్వీకరించేను...అందుకు ఆమెను అన్నివిధాలా తృప్తిపరచడం నావిధి...ఆమె అన్నివిధాలా సంతోషంగా ఉండేందుకు ప్రయత్నించేను.

శారద: మిమ్మల్నలా చెయ్యడం ఆమెకు న్యాయం కాదు—నిజమే—కాని ఆమెలో రగిలిన ఆమంటకి ఆమె నిలవలేకపోయింది ... ఈ క్షణికమైనకోరికలకన్నా అతీతమైన...కోరికకి ఆమె లొంగిపోయింది ... ఆశక్తి ఆమెలో ఎక్కువయి లొంగదీసుకుందామెని...(కసిగా చూస్తుంది)

రామో: శారదా...దయచూపెట్టు...ఆ సంగతులు తిరగవెయ్యకు...

శారద: ఆమెని క్షమించగలిగేరా? ఆమె మీకు ఎంతో కష్టాన్ని కలిగించింది ఆపనిచేసి... న్యాయాన్యాయాలు నిర్ణయించే అధికారం లేకపోయినా ఆమె అన్యాయంగా ప్రవర్తించిందనుకుందాం ... కాని నేను...నాబతుకులో చిచ్చురగిల్చేరు ... ఇది పొరపాటుకాదు... తెలిసి తెలిసి...క్షమించాలా? ...ఔను... క్షమించాలి...

రామో: శారదా...శారదా...

శారద: నాకు తెల్సు...నేను చూసే నామెని...

రామో: నువ్వా...చూసేవా?

శారద: ఔను...చూసేను...చూడకూడదా? ముగ్గురినీ చూసేను...ఎంత ముచ్చటవేస్తున్న సంసారం...

రామో: (జుత్తు పీకుకొని) భగవాన్...భగవాన్... నా కెందుకీ చిత్రవధ...శారదా......నీ బతుకొక ఎడారి చేసేను...కేవలం మానసిక బలహీనతకి...శరీరానికి లొంగి...తెలిసి...తెలిసి...నీ పాదాలమీద పడతాను...అలా చూడకు...ఆ మంటలతో కాల్చకు...నే నేం చెయ్యగలను ...బతుకంతా అనుభవిస్తాను బాధ...నరకం... ఇంక ఓరుకో...

శారద: (చివాల్న లేచి) చిత్రవధా? చిత్రవధ... నేనూ అనుభవిస్తున్నాను....ఇన్నేళ్ళయి...., మాడి మసౌతోంది...నువ్వు రగిల్చిన చిచ్చులో.. నువ్వెందుకుపడాలి యాతన...పడేది నేను... కాలేది నేను...మండేది నేను....

[పిచ్చిదానిలా పకపకా నవ్వి....ఇంటి పైకప్పుకేసి చూస్తూ.]

మండేది నేను...కాలేది నేను...మండేది నేను...కాలేది నేను...ఔనా...ఔనా... శారదా?... [తెర]

[సశేషము]

# మొదటి మూలతత్త్వం: పోసిట్రోనియం

శ్రీ వసంతరావు వేంకటరావు

మానవుడు యోచనాపరుడైనప్పటినుండి ప్రకృతిని పరిసరాలను పరిశీలింప పూనుకొన్నాడు. ప్రకృతిలో గోచరించు వైవిధ్యాన్ని యధాతథంగా అంగీకరించలేక ఆ వైవిధ్యంలో ఏకత్వాన్ని, సంకులత్వంలో సారళ్యాన్ని కనుగొనవచ్చునన్న విశ్వాసంతో క్రమించ మొదలుపెట్టేరు. బహురూపాలలోనున్న వస్తుసముదాయమంతా ఏవో కొన్ని ప్రాథమిక తత్త్వాలతో ఏర్పడుతున్నదన్న నమ్మకం కలిగింది. దేశదేశాల మనీషాపరులు సహజావబోధంవల్ల ఎవరి మట్టుకు వారే అంగీకరించిన పైభావంవల్ల ఈ మూల తత్త్వాల సంఖ్య 4 నుండి ఏడువరకు వివిధదేశాలలో ప్రబలింది. భారతీయ తత్త్వవేత్తలు పంచభూతాలను ప్రతిపాదించేరు అవి పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము. ఈ పంచభూతాలతోనే విశ్వం నిర్మింపబడిందని వారి అభిప్రాయం.

వైజ్ఞానికభావం పెంపొందినప్పటినుండి మూల తత్త్వాలను కనిపెట్టడానికై భౌతికశాస్త్రజ్ఞులు ప్రయోగాలు ప్రారంభించేరు. మూలతత్త్వాల సంఖ్యను నిర్ణయించడానికై రసాయనిక విజ్ఞానులు చేసిన ప్రయోగాలు ఫలించగా, మూలతత్త్వాలసంఖ్య 92 అను నిర్ణయానికి వచ్చేరు గత నూరేళ్లలోపుగా. మెండెలీఫు అను విజ్ఞాని సాహసంగా ఒక మూలపదార్థాల ఆవర్త క్రమసూచిని తయారుచేసి, అప్పటికి తెలిసిన తత్త్వాలకందులో క్రమస్థానాల నేర్పరచి, మునుముందు కనుగొనవలసినవాటికి ఖాళీ గదులుంచి, వాటి స్వరూప స్వభావాలెట్లుండగలవో కొంతవరకు సూచించేడు. ఆ జోస్యం అద్భుతంగా ఫలించింది. ఈనాడు 92 గదులు పూర్తిగా నిండేయి. పైగా పది కొత్తతత్త్వాలు కూడ పరిశోధనాగారాలలో సృష్టించబడ్డాయి.

ఒక మూలతత్త్వంలోనున్న పరమాణువులన్నీ ఒకేవిధంగా ఉంటాయన్నది మూలతత్త్వభావానికి గీటురాయి. ఆ విధంగా 92 రకాల పరమాణువు ఉన్నాయి. ప్రతి పరమాణువు ప్రత్యేకమైన గుణాలు కలిగి ముక్కలుకాజాలనంత చిన్న కణమని పరమాణువు నూహించేరు. ఆ భావం చాలకాలంవరకు అమలులోనున్నప్పటికీ సూక్ష్మమైన ప్రయోగాలవల్ల పరమాణువు భిన్నం కాగలదని, దానికి అవయవాలు కలవని తెలియవచ్చింది. ముఖ్యంగా కొన్ని పరమాణువులనుండి విద్యుత్కణాలు, శక్తి తరంగాలు యాదృచ్ఛికంగా వెలువడుచుండుట గమనించిన విజ్ఞానులు పరమాణువునకు నిర్మాణమున్నదని, అది అవయవి అని అంగీకరింపవలసి వచ్చింది. ఏమంటే పరమాణువునుండి రెండురకాల విద్యుత్కణాలు బహిర్గమించడం స్పష్టంగా కనవచ్చింది. అవి ధనావేశము, ఋణావేశముగల కణాలు. ఏ పరమాణువు నుండి వచ్చిన ఋణకణాలైనా ఒకే ఆవేశంకలిగి ఒకే విధంగా నున్నట్లు స్పష్టమైంది. అంతకంటే తక్కువ ఋణావేశంగల కణం ఏ ప్రయోగంలోను కనిపించలేదు. అందుచేత, ప్రాథమికమైన ఋణావేశంగల విద్యుత్కణం ప్రతి పరమాణువులో ఒకభాగమని గుర్తించక తప్పిందికాదు. దానిని ఎలక్ట్రాను అన్నారు.

ప్రతి పరమాణువు విద్యుదావేశంలేని తటస్థమైన కణం. అందుచేత పరమాణువులో సమాన విద్యుదావేశంగల ధనకణం ఉండకతప్పదని ఊహించి దాన్ని గుర్తించేరు. అది ప్రోటాను. విద్యుదావేశంలో అది ఎలక్ట్రానునకు సరిగా ప్రతియైనప్పటికీ బరువులో మాత్రం ఎలక్ట్రానునకు రమారమి 2000 రెట్లుంది. ఆ రెండుకణాల చేరికవలన విద్యుదావేశం మొత్తంపై నశించగా ఒక తటస్థకణం ఏర్పడగలదు. అదే పరమాణువు; విద్యుత్కణాల కూడికవలన ఏర్పడిన ద్రవ్యకణము. అదేవిధంగా ప్రతి పరమాణువుకూడ ప్రోటానులు ఎలక్ట్రానులు కూడుటవలన ఏర్పడినట్లు భావించేరు. పరమాణువులోనున్న ప్రోటానులసంఖ్య దాని భారాన్ని నిర్ణయిస్తుంది. ప్రోటానులన్నీ కేంద్రంలో నుంటాయి. వాటిచుట్టూ ఎలక్ట్రానులు నిత్య ప్రదక్షిణాలు చేస్తూంటాయి.

పరమాణుకేంద్రాన్ని పరీక్షిస్తున్న సందర్భంలో మరొక ప్రాథమికకణం కనిపించింది. అది న్యూట్రాను. ప్రోటాను భారమంత బరువున్న తటస్థ కణం. కేంద్రకంలో న్యూట్రానులున్నాయని తెలియవచ్చింది. కాని, ప్రకృతియొక్క సౌష్ఠవంలో విశ్వాసం కలిగిన విజ్ఞాని ఎలక్ట్రానుకు ప్రతియైనకణం ప్రోటాను అని అంగీకరించలేకపోయేను. వాటి భారంలోనున్న వ్యత్యాసమే దానికి కారణం. అందుచేత సూక్ష్మపరిశోధనలు చేయగా విజ్ఞాని ఊహించిన కణం గుర్తింపబడింది. అది పాసిట్రాను. ఎలక్ట్రానంత బరువు, ఎలక్ట్రానుకు గల ఋణావేశమంత ధనావేశముగల కణమది. అదేవిధంగా ప్రోటానుయొక్క ప్రతియైన నెగట్రానుకూడ బయల్పడింది.

విద్యుదావేశపు ప్రాథమిక కణాలైన ఎలక్ట్రాను పాసిట్రానులు పరస్పరం ఢీకొని, లయమొంది, గామా కిరణాలుగా రూపొందడమూ, గామా కిరణాలు ద్రవ్యంపై పడినప్పుడు ఎలక్ట్రాను పాసిట్రానులు ఆవిర్భవించడమూ కూడ ప్రయోగాలు సూచించేయి. ద్రవ్యము శక్తిగాను, శక్తి ద్రవ్యముగాను రూపాంతర మొందుతుందని పై పరిశీలనలవల్ల స్పష్టమే. కాని, ఎలక్ట్రాను పాసిట్రానుల జంట లయమయే లోగా ఇక్కడి వాటకొన్ని అద్భుతాలని ఈ మధ్యనే గుర్తించేరు. ఆ రెండు కలిసి అత్యల్పకాలం ఒక పరమాణువుగా ఏర్పడి, ఒకదానిచుట్టు ఒకటి తిరిగి, నాట్యమాడి, ఢీకొని, లయమై, గామా కిరణాలుగా వెలువడుతాయి. ఆ పరమాణువే పాసిట్రోనియం పరమాణువు. పరమాణువులలో మొదటిది; మొదటిది అని మనం భావిస్తున్న హైడ్రోజన్ పరమాణువుకంటె తేలికైనది. పరమాణు భారాన్ని పూర్వకాలంలో చెప్పినప్పుడు హైడ్రోజన్ పరమాణుభారం ఒకటి. దానిలో వెయ్యోవంతు బరువున్న పాసిట్రోనియంయొక్క పరమాణుభార సున్న అని వ్రాయాలి. కాని, అది యథార్థంగాదు. ఆ పరమాణువు లయమై రూపాంతర మొందినప్పుడు బలమైన గామా కిరణాలు రెండుకాని, మూడుకాని జనిస్తాయి. పాసిట్రోనియం అత్యల్పజీవి.

సామాన్య పరమాణువులలో స్థిరమై బరువైన కేంద్రకం (nucleus) మధ్యనుంటెగా, దానిచుట్టు ఎలక్ట్రానులు అనేక కక్ష్యలలో తిరుగుతుంటాయి. కాని, పాసిట్రోనియం పరమాణువులో కేంద్రకమంటూ లేదు. అందున్న రెండు కణాల బరువులో వ్యత్యాసం లేదు. ఒకే భారం వ్యతిరేకమైన ఆవేశంగల కణాలవి. అందుచేత, ఒకటి స్థిరంగానుండి రెండవది దానిచుట్టు తిరిగే అవకాశం లేదు. కాగా, చేతులు పట్టుకొని ఇద్దరు వ్యక్తులు ఒప్పులకుప్ప తిరిగినట్లుగా, ఒక బిందువుచుట్టు అవి రెండు తిరుగుతాయి. వాటిని ఆకర్షించి తిరగనిచ్చేది విద్యుత్ బలం. ఆ విధంగా అది తిరుగుతూ పాసిట్రోనియం వేషం ధరించి మనగలకాలం ఒక సెకండులో కోటియవభాగం మాత్రమే! కాని, ఆ స్వల్పకాలంలోనే కొన్ని లక్షలసార్లు నాట్యం చేయగల సామర్థ్యం వాటికుంది.

పాసిట్రోనియం పరమాణువులలో రెండు రకాలున్నాయి. వాటి లయసమయంలో మాత్రమే వాటి వ్యత్యాసాన్ని గమనించగలము. మొదటి రకం పరమాణువు లయమైనప్పుడు రెండు గామా కిరణాలు జనిస్తాయి; రెండవరకం పరమాణు లయంలో మూడు గామా కిరణాలు జనిస్తాయి. మొదటి రకాన్ని "పేరా పాసిట్రోనియం" అని, రెండవ రకాన్ని "ఆర్థో పాసిట్రోనియం" అని అంటారు.

గామాకిరణాలని గుర్తించే ఉపకరణాలున్నాయి. వాటిలో "గామారే కౌంటరు" ఒకటి. అట్టి రెండు కౌంటర్లని సరళరేఖలో ఏర్పరచి, వాటి మధ్యనొక గొట్టాన్ని పెట్టేరు. ఆ గొట్టంలో పాసిట్రానులు జనిస్తాయి. జనించిన పాసిట్రాను ఎలక్ట్రానుతో చేరి పరమాణువుగా రూపొంది, నాట్యమాడి, లయమైనప్పుడు జనించిన గామాకిరణాలు కౌంటర్లలో ప్రవేశించినప్పుడు ధ్వని చేసేటట్లు, కాంతిరేఖ గోచరించేటట్లు ఆ కౌంటర్లను అమర్చేరు. కాబట్టి పాసిట్రానుజననానికి, కౌంటరు చైతన్యవంతమవడానికి మధ్యనున్న కాలమే పాసిట్రోనియం పరమాణువుయొక్క జీవితకాలమని నిర్ణయించవచ్చు. ఈ విధంగా పేరా పాసిట్రోనియం పరమాణులయాన్ని స్పష్టంగా గుర్తించేరు. సౌష్ఠవంగా ఏర్పరచిన మూడు కౌంటర్లను వినియోగించి ఆర్థో పాసిట్రోనియం పరమాణులయ సమయాన్ని గుర్తించేరు. ఆ విధంగా వాటి జీవితకాలాలు సరాసరిని కనుగొన్నారు. సాపేక్షంగా పేరా పాసిట్రోనియం కంటె ఆర్థో పాసిట్రోనియం ఎక్కువకాలం జీవిస్తుందని తెలియవచ్చింది. ఆర్థో పాసిట్రోనియం జీవితకాలం $1.4 \times 10^{-7}$ సెకండు.

అంటే, సుమారుగా ఒక సెకండులో ఒక కోటి యవభాగం. పేరా పోసిట్రోనియం యొక్క జీవిత కాలం $1.25 \times 10^{-10}$ సెకండు. అంటే, మొదటిదాని జీవితకాలంలో సుమారు వెయ్యవభాగమని గుర్తించాలి.




పోసిట్రోనియం పరమాణువుల జీవితకాలం ఊహాతీతమైనంత స్వల్పమైనప్పటికిఆస్వల్పజీవితంలో నే కొన్ని లక్షలసార్లు పరిభ్రమిస్తాయి వాటిలోనున్న ఎలక్ట్రాను పోసిట్రానులు. పరిభ్రమిస్తూ తమలో తాము బొంగరం లాగ తిరుగుతుంటాయి. విద్యుదావేశంగల కణం పరిభ్రమించినప్పు డది అయస్కాంతంవలె ప్రవర్తిస్తుంది. అందుచేత, రెండు అయస్కాంతాలు ఒక బిందువు చుట్టు పరిభ్రమించినప్పుడు కలుగుఫలితమే పోసిట్రోనియం పరమాణువులో కలుగుతుంది. ఎలక్ట్రాను పోసిట్రానులు విరుద్ధావేశం గలవి. అవి ఆత్మభ్రమణం చేసినప్పుడు ఆభ్రమణ విధానాన్నిబట్టి వాటికి అయస్కాంత లక్షణాలుఅలవడతాయి. రెండూ సవ్యంగా ఆత్మభ్రమణం చేస్తే భిన్న ధ్రువాలు ఒకే వైపువున్న అయస్కాంతాలట్లు ప్రవర్తిస్తాయి. లేదా, ఒకటి సవ్యంగాను రెండవది అపసవ్యంగాను ఆత్మభ్రమణంచేసిన పక్షమందు రెండిటి సజాతిధ్రువాలు ఒకే వైపువున్న అయస్కాంతాలట్లు ప్రవర్తిస్తాయి. ఈ వ్యత్యాసమే వాటిని ఆర్థో పేరాపోసిట్రోనియములుగా విభాగించింది. చిత్రంలో చూపినట్లు ఆర్థో పోసిట్రోనియం పరమాణువులోనున్న కణాలు వాటి అక్షులు సమాంతరంగానున్నప్పు డత్యధికంగా ఆకర్షించు కొనగా పేరాపోసిట్రోనియం పరమాణువులోనున్న కణాలు వాటి అక్షులు ఒకే సరళరేఖలో నున్నప్పు డత్యధికంగా ఆకర్షించు కొంటాయి. ఎలక్ట్రాను పోసిట్రానుల పరిభ్రమణంలో పేరాపోసిట్రోనియం పరమాణువు త్వరగా భగ్నమయే అవకాశముంది. అందులో పరస్పరాకర్షణబలం అధికమవడమే ముఖ్యకారణం.

శక్తికూడా కణరూపంలో వ్యక్తం కాగలదు. అట్టి శక్తికణాలను ఫోటాను లన్నారు. మనం పరిశీలించు పరిస్థితినిబట్టి గామా కిరణంగానో లేకఫోటానుగానో శక్తి వెల్లడి కావచ్చు. పోసిట్రోనియం పరమాణువు లయమైనప్పుడు అథమం రెండు ఫోటానులైనా జనించాలని ప్రకృతి నిర్ణయం. తుపాకి పేల్చినప్పుడు గుండు ముందుకి దూసుకొనిపోయినప్పుడు తుపాకిని వెనుకకు నెట్టుతుంది. ఆవేగ నిత్యత్వ (Conservation of momentum)సూత్రప్రకారం గుండుయొక్క ఆవేశానికి సమమైన ఆవేశాన్ని తుపాకికి కలిగిస్తుంది. అదే విధంగా, ద్రవ్యం శక్తిగా రూపాంతరం పొందినప్పు డొక్క ఫోటానే జనించడానికి వీలులేదు. అథమం రెండైనాజనిస్తే అవి ఇరువైపులా దూసుకొనిపోతాయి. ఒకప్పుడు మూడుఫోటానులు జనించవచ్చు. స్వల్పకాల జీవియైన పేరాపోసిట్రోనియం పరమాణువు లయమైనప్పుడు రెండుఫోటానులును; అంతకంటె దీర్ఘకాల జీవియైన ఆర్థోపోసిట్రోనియం పరమాణువు లయమైనప్పుడు మూడుఫోటానులును జనిస్తాయని ప్రయోగ పూర్వకంగా విజ్ఞానులునిరూపించేరు.

పోసిట్రోనియంను స్వల్పమాత్రంగా సృష్టించ కలిగినప్పటికి, దాని జీవితకాల మత్యంత స్వల్పమైనప్పటికి దాని వర్ణపటం (Spectrum) ని తీయకలిగేరు. ప్రతి మూల తత్వము దానికి సహజమైన వర్ణపటాన్ని కలిగిస్తుంది. మూలతత్వం ఉత్తేజితమైనప్పుడు వర్ణపటం లభిస్తుంది. మూలతత్త్వాల వర్ణపటాలలో కొన్ని భాసుర

రేఖలుంటాయి. సోడియం రెండు పసుపు పచ్చని గీతలు కలిగివుంది. పాదరసపు వర్ణపటంలో నీలి, ఆకుపచ్చ, పసుపు పచ్చగీత లుంటాయి. వాటివాటి స్థానాలు స్థిరమైనవి. గీతల స్థానాలనుబట్టి వాటిని కలిగించిన మూల తత్త్వాన్ని గుర్తిస్తారు రేఖారహస్యా లెరిగిన విజ్ఞానులు. అదేవిధంగా పాజిట్రోనియం యొక్క రేఖాపటాన్ని పరిశీలించి వారి జోస్యం యథార్థమయిందని విజ్ఞానులు తృప్తిపడ్డారు. సుమారుగా స్థిరంగానున్న ప్రోటానుచుట్టు ఒక్క ఎలక్ట్రాను తిరుగుతూంది హైడ్రోజన్ పరమాణువులో. అట్లు కాక, ఒకే బిందువుచుట్టు ఎలక్ట్రాను పాజిట్రానులు రెండూ తిరుగుతున్నాయి పాజిట్రోనియంపరమాణువులో. కక్ష్యలో తిరుగుతూన్న ఎలక్ట్రాను ఒక కక్ష్య నుండి మరొక కక్ష్యకు గెంతినప్పుడు వర్ణపటంలో భాసురరేఖ లేర్పడతాయి. ప్రతి రేఖ ఒక ప్రత్యేక అలపొడవుని నిరూపిస్తుంది కాంతి అలపొడవు గల కాంతి కిరణాలను హైడ్రోజన్ ప్రసరిస్తుంది. హైడ్రోజన్ పరమాణువుకంటె పాజిట్రోనియం పరమాణువు రెండింతలుండాలి; ఏమంటే పాజిట్రోనియంలో రెండు కణాలు తిరుగుతున్నాయి. అందుచేత పాజిట్రోనియం ప్రసరించు కాంతియొక్క అలపొడవు కూడా హైడ్రోజన్ కాంతి అలపొడవుకి రెండురెట్లుండాలనిసిద్ధాంత రీత్యానిర్ణయించేరు. అదినిజమని ప్రయోగం రుజువుచేసింది. ఈవిధంగా అత్యల్ప జీవియైన పాజిట్రోనియంను సృష్టించి, గుర్తించి, లక్షణాలు తెలిసికొని, మూలతత్త్వాలలో ప్రథమ స్థానం పాజిట్రోనియంది అని నిరూపించేరు. పరమాణు భారం లేని తత్త్వమది. లయంకోసమే అది జనిస్తుంది. పాజిట్రాను జనించగానే అదొక ఎలక్ట్రానుతో నాట్యాని కుపక్రమించి, కొన్ని లక్షలసార్లు తిరిగి తిరిగి రెండు ఫోటానులుగా కాని, మూడు ఫోటానులుగా కాని రూపాంతరం పొంది, శక్తిని ప్రసాదిస్తుంది.

ఇంకా తెలిసికొనవలసిన రహస్యాలున్నాయి. ఎలక్ట్రానుకి ప్రతియైన పాజిట్రాను, ప్రోటానుకి ప్రతియైన ఏంటిప్రోటాను లేక నెగట్రాను మన కెరిగిన ప్రపంచంలో అట్టే కనిపించవు. ఒక వేళ వాటిని మనం యంత్రాలలో సృష్టించినప్పటికి అవి వెంటనే లయమై శక్తి క్రింద మారిపోతాయి. దీనికి కారణం తెలియదు. మన మెరుగని ఆకాశకుహరాలలో క్రొత్త రకం ద్రవ్యముండవచ్చునని విజ్ఞుల అభిప్రాయం. ఆ ద్రవ్య పరమాణువులందు కేంద్రకంలో నెగట్రానులు న్యూట్రానులు ఉండగా కేంద్రకం చుట్టూ పాజిట్రానులు తిరగవచ్చు. ఆ ద్రవ్యం మనలోకాలలో ద్రవ్యం వలెనే ఉంటుందంటారు. దానిని గుర్తించగలమా?

# ఒక సంఘటన

శ్రీ కాశూరి హనుమంతరావు

ప్లాట్‌ఫారమ్‌మీద పెళ్ళివారిదృశ్యం డాక్టర్ శర్మని అకోవిసంగా ఆకర్షించింది. ఏభై సంవత్సరాల వయస్సు దాటిపోయి ఇప్పుడిప్పుడే ముడతలు పడుతున్న అతడి ముఖంమీద సానుభూతి ఛాయగా వ్యాపించింది. వాళ్ళందరూ కూడా తన మాతృభాషలోనే మాటాడుతున్నారు. ఐదు సంవత్సరాలు విదేశంలో ఉండిపోయి తిరిగి రావడం, తన మాతృభాష మాట్లాడే ప్రజలని కలుసుకోవడం, అన్నిటికన్నా పెళ్ళికుమార్తెను అత్తవారింటికి వీడ్కొలుపుతున్న ఆ దృశ్యం అతడి మనస్సును ఉద్వేగంతో నింపేయి.

రైలు బయలుదేరబోతోంది. గార్డు విజిల్ ఊదాడు. ఆ అబ్బాయి, క్రొత్తగా పెళ్ళయిన అతడి భార్య, అతడి ముసలి తలిదండ్రులు డాక్టర్ శర్మ ఉన్న కంపార్ట్‌మెంట్‌లోకి వచ్చేరు. తల్లిదండ్రులిద్దరూ లోపలికి వచ్చేసి కిటికీలోంచి బంధువులందరి దగ్గరా సెలవు తీసుకొంటున్నారు. ఆ అబ్బాయి, అమ్మాయి గేట్ దగ్గర నిలబడ్డారు.

"వెళ్ళొస్తానమ్మా. వస్తాను నాన్నా." ఆ అమ్మాయి ప్లాట్‌ఫారమ్‌మీద నిలబడ్డ తన తలిదండ్రులతో దీనంగా అంది. సహజంగా పెరుగుతున్న చోటు నుండి ఊడదీసి ఇంకోచోట పాతిన మొక్కలాగ ఆమె ముఖం వాడిపోయి బెంగగా ఉంది.

"వెళ్ళగానే ఉత్తరం రాయమ్మా." ఆమె తండ్రి అన్నాడు. వెంటనే ఆ అబ్బాయిని చూసి మళ్ళీ అదే అడిగాడు.

"అలాగే నాన్నా."

"తప్పకుండా రాస్తానండీ." ఇద్దరూ అన్నారు.

కూతుర్ని అత్తవారింటికి పంపించి వేస్తున్న ఎడబాటు మనస్సుని క్రుంగదీస్తున్నా ఆ అమ్మాయి తండ్రి ఎంతో ప్రయత్నంమీద పైకి లేని ధైర్యాన్ని ప్రకటిస్తున్నాడు. ఆ అమ్మాయి తల్లి కళ్ళు రెండూ కరిగి కన్నీరై ప్రవహిస్తున్నవి. వీళ్ళందరి మధ్యా ఆ అబ్బాయి పరిస్థితి విషమంగా ఉంది.

రైలు కూతకూసి బరువుగా కదిలి బయలుదేరింది. ప్లాట్‌ఫారమ్ క్రమంగా వెనక్కి నిర్గమిస్తున్నది. ఆ అమ్మాయి తన తల్లిదండ్రులనుండి కోసి వేరుచెయ్యబడుతున్నది. నిర్నిమేషమైన దృష్టులతో రైల్లో పోతున్న తమ కూతుర్ని చూస్తూ ఆ తల్లిదండ్రులిద్దరూ రెండు శిలావిగ్రహాలవలె ప్లాట్‌ఫారమ్‌మీద నిలబడిపోయారు. ఆ ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్ గేట్ దగ్గర నిలబడ్డ తమ కూతురుతప్ప తక్కిన రైలేమీ వాళ్ళకి కనిపించడం లేదులాఉంది.

రైలు మలుపు తిరగడంతో ఈ దృశ్యం అంతా తటాలున మారిపోయింది. ఆ అబ్బాయి, అమ్మాయి లోపలికి వచ్చి సామానులు సర్దుకొని పక్క చుట్టలు విప్పుకోసాగేరు. డాక్టర్ శర్మ ఇదంతా కొంతసేపు కుతూహలంగా పరిశీలించాడు. ఆ కంపార్ట్‌మెంట్‌లోని ఆరో వ్యక్తికి సుమారు నలభై సంవత్సరాలుంటాయి. అతడిలో ప్రత్యేకలక్షణా లేవీ లేవు. సిగరెట్టు కాలుస్తూ న్యూస్ పేపర్ చదువుకున్నాడు.

రైలు క్రమక్రమంగా వేగం హెచ్చుతున్నది. టక్ టకా టక్ టకా అనే నిర్విరామమైన రైలు ధ్వనులు ఒకే శ్రుతిలో డాక్టర్ శర్మ కర్ణపుటాలకి వినబడతాయి. దగ్గరగా ఉన్న చెట్లు, పొదలు, టెలిఫోన్ స్తంభాలు చర్ చర్‌మని వెనక్కి పోతాయి. కాస్త దూరంలో ఉన్న చెట్లు, ఎలెక్ట్రిక్ స్తంభాలు రైలుతోబాటే ముందుకి వస్తాయి. కనుచూపుమేరలో ఉన్న పచ్చటి ముదిలవంటి చెట్లశిఖరాలు, చెట్లఆకారాలు, దృక్పథపు చివరలో నీలి ముసుగులు వేసుకొన్న కొండలు— ఇవన్నీ ఒక పెద్దవలయంలో తమలో తామే సుళ్ళు తిరుగుతాయి.

సాయంకాలం సూర్యుడివేడి తగ్గినా ఇంకా ఎండ పోలేదు. ఒకవైపునుండి ఎండ కాస్తూఉంటే

ఇంకోవైపునుండి వర్షం పడుతోంది. ఏటవాలుగా ప్రసరిస్తున్న సూర్యకాంతిలో వాన చినుకులు తళతళ మని మెరుస్తున్నాయి. వర్షార్ద్రప్రకృతిని సూర్య కాంతులు మృదువుగా స్పృశించి ఆకాశంలో తూర్పు దిక్కున రమ్యమైన ఇంద్రధనుస్సును చిత్రిస్తున్నవి. భూమి తడిగా ఉంది. చెట్లు వర్షం కారుతున్నాయి. ఎంతో రమణీయంగా ఉంది ప్రకృతి. ప్రకృతి తలనిండా స్నానంచేసి సౌందర్యారాధన చేస్తున్నట్లుఉంది. భగవానుని సౌందర్య స్వరూపాన్ని ధ్యానం చేస్తున్నట్లుగా ఉంది.

ఎండ, వాన, ఇంద్రధనుస్సు—ఇవన్నీ ప్రకృతిలో ఎలాగ ఏర్పడుతాయో సైన్సు మనకు విశదీసి చూపుతుంది. కాని మానవ ఆత్మ వీటిలో సైన్సుకి అందని అనుభూతిని, ఉత్కంఠను పొందుతుంది. ఈ సృష్టికి సైన్సు సరియైన నిర్వచనం అవునా? కాదా? అనేది చాలా చిక్కు సమస్య.

ఈ సమస్య కొంతవరకూ డాక్టర్ శర్మ వ్యక్తిత్వానికి సంబంధించినది. కాని ప్రస్తుతం అతడు ఆ సమస్యని తర్కించడం లేదు. అతడికి కంపార్ట్‌మెంట్‌లో తనతో ఉచితమైన సంభాషణచేసే తోటి ప్రయాణికులు దొరకలేదు. ఆ అబ్బాయి తల్లిదండ్రులు బద్ధకంగా శరీరాలు వాల్చారు. నిర్విరామమైన రైలు ధ్వనుల శృతి వారిమీద మత్తుమందులాగ పనిచేస్తున్నది. ఆ అబ్బాయి తన సూట్‌కేస్ తెరచి, అందులోనుంచి ఒక పుస్తకంతీసి చదవసాగాడు.

ఆ అమ్మాయి ఏదో సినిమా మేగజీన్ పేజీలు త్రిప్పుతున్నది. డాక్టర్ శర్మని ఆమె అలంకరణ, క్రొత్తగా పెళ్ళయిన స్త్రీని అత్తవారింటికి సాగనంపుతున్న అలంకరణ అమితంగా ఆకర్షించింది. పారాణి పూసిన ఆమె పాదాలమీద సరిక్రొత్తచీర కుచ్చెళ్ళు జీరాడుతున్నాయి. నుదుటిమీద కళ్యాణతిలకం, కళ్లకి కాటుక—పెళ్లికళతో ఆమె ముఖం నిండుగా వెలిగింది. ఆమెజడలోని తెల్లటి, ఎఱ్ఱటి, పచ్చటి రంగులపువ్వులు ఆనందంతో విచ్చుకొన్నాయి.

పువ్వులలో సౌందర్యాన్ని డాక్టర్ శర్మ ఒక ప్రత్యేకమైన పద్ధతిలో మెచ్చుకొని ఆనందిస్తాడు. పువ్వులలోని పరిమళం, రంగు, మృదుత్వం ఇవికేవలం భౌతికమైనవి అనీ, మైక్రో స్కోప్ క్రింద పరీక్షిస్తే పువ్వులలో జీవశక్తి, అసలు సౌందర్యం కనిపిస్తుందనీ అతడు వాదిస్తాడు. తన సహోపాధ్యాయుడు వ్రాసిన ఒక పుస్తకానికి పరిచయవాక్యాలు వ్రాస్తూ చెట్లలో సౌందర్యంగురించి తన అభిప్రాయాన్ని ఇట్లా వ్యక్త పరచాడు.

"ఒక చిన్న కొయ్య ముక్క, ముసలివాళ్ళు ఊతగా ఉపయోగించే కఱ్ఱలో ఒక సన్నటి ముక్కని కోసి మైక్రో స్కోప్ క్రింద పరిశీలించిచూస్తే అందులో జైలమ్ కణాల సముదాయం ఎంతో అందంగా కనిపిస్తుంది. ఎండి నిర్జీవమై పోయిన ఒక కొయ్య ముక్కలో మైక్రోస్కోప్ క్రింద ఇంతఅందం కనిపించినప్పుడు, నిండా జీవిస్తున్న పువ్వులు మొదలైన వాటిలో ఎంత అందం కనిపిస్తుందో చెప్ప నక్కర లేదు. ప్లాంట్ అనాటమీ చెట్లలో అంతరంగా దాగి ఉన్న సౌందర్యాన్ని బయటికి చూపుతుంది" అని వ్రాశాడు.

సైన్సు, డాక్టర్ శర్మ హృదయంలో ఉద్వేగ కలిగించడం ఈ వాక్యాలలో తెలుస్తుంది. సైన్సుని ఒక వృత్తిగా, కాలక్షేపంగా మాత్రమే కాకుండా, జీవిత సమస్యలని పరిష్కరించుకొనే సాధనంగా డాక్టర్ శర్మ స్వీకరించాడు. ఈ ఉద్దేశంతోనే జీవశాస్త్ర విజ్ఞానాన్ని సామాన్యప్రజలకి అందించడానికి అతడు ఎన్నో వ్యాసాలు వ్రాశాడు. "ది ఆరిజిన్ ఆఫ్ లైఫ్", "మ్యుటేషన్స్ అండ్ ఇవొల్యూషన్", "ది ప్రోపర్ టీస్ ఆఫ్ ప్రోటో ప్లాజమ్", "మేన్స్ ప్లేస్ ఇన్ నేచర్", "ది ఫ్యూచర్ ఆఫ్ మేన్ అండ్ ఆఫ్ లైఫ్", "హెరిడిటి అండ్ సోషల్ ప్రోబ్లమ్స్"—ఇవి అతడువ్రాసిన కొన్ని వ్యాసాలు. ఇవన్నీ ఒక సంపుటిగా "లైఫ్ అండ్ నేచర్" అనేపేరున ప్రకటించబడ్డాయి. ఈ పుస్తకం డాక్టర్ శర్మకి జనసామాన్యంలో ఎంతో కీర్తిని కలిగించింది. ప్రస్తుతం అతడు పోస్ట్ గ్రాడ్యుయేట్ విద్యార్థులకి ఉపయుక్తంగా ఉండేటట్టు జెనెటిక్స్‌మీద ఒక పుస్తకం వ్రాసేప్రయత్నంలో ఉన్నాడు. ఆ పుస్తకానికి కావలసినగ్రంథమంతా ఎంతో దీక్షతో సమకూర్చుకొంటున్నాడు. డాక్టర్ శర్మకి కార్యదీక్షా, విజ్ఞానతృష్ణా అపారం. రోజూ ఉదయాన్నే లెబొరేటరీకి పోవడం, సాయంకాలంవరకూ శాస్త్రపరిశోధనలో గడపడం, రాత్రి పడుకోబోయేముందు సుమారు నూరుపేజీల ఏదైనా శాస్త్రగ్రంథాన్ని చదవడం-గత ఇరవై అయిదేళ్లుగా అతడి దినచర్య సరిగా, ఇదే ప్రణాళికలో జరుగుతూ

వచ్చింది. ఈ ఇరవై అయిదేళ్ళలోనూ అతడు చేసిన శాస్త్ర పరిశోధన ప్రపంచంలో అందరి శాస్త్రజ్ఞుల మన్ననలనూ అందుకొన్నది. జెనెటిక్స్‌లో ప్రపంచం మొత్తంమీద అగ్రగణ్యులైన శాస్త్రజ్ఞులు కొద్దిమంది లోనూ డాక్టర్ శర్మ ఒకడు. వివైవిస్తు దాటి పోయినా అతడికి గల విజ్ఞానతృష్ణ తగ్గలేదు సరికదా హెచ్చసాగింది. ఈ విషయంలో డాక్టరుశర్మ ఎంతో గర్వపడతాడు. అతడి జీవితమంతా ఒక విజ్ఞానయాత్ర వలె సాగుతోంది. విజ్ఞానతృష్ణ, జీవితంలో కార్యదీక్ష లేని మనుష్యులను, ముఖ్యంగా యువకులను డాక్టరు శర్మ క్షమించలేడు. అందుచేత నే ఆ అబ్బాయి ఒక నవలని ఎంతో కుతూహలంతో చదవసాగినప్పుడు అతడి అభిప్రాయంలో ఆ అబ్బాయి మనస్తత్వం పైన ఒక నిరాదరణ, చిన్నచూపు కలిగేయి. ఆ నవలకి బదులుగ ఒక సైన్స్ న్యూస్ సంపుటంగాని, విజ్ఞానదాయకమైన మరొక పుస్తకంగాని అతడు చదివినట్లయితే డాక్టర్ శర్మ అతడిని మెచ్చుకొని వుండును. ఈ తేలికభావం తోనే నవల చదువుతున్న అతడి ముఖకవళికలని డాక్టర్ శర్మ పరిశీలించసాగాడు. కథలోని ఏదో విషాద సంఘటనని బట్టి కాబోలు అతడి ముఖంలో సానుభూతి స్పష్టంగా కనిపిస్తున్నది. ఆ అబ్బాయి నవ లలో గబగబా కొన్ని పంక్తులు చదివి, పుస్తకం ప్రక్కని పెట్టి, తన భార్యవంక తిరిగి—

"నటాషా! ఈ కథలో నటాషా అనేఅమ్మాయి క్షణికమయిన ఆకర్షణ, మోహాంధమైన జీవితంలో శాశ్వత మయిన ప్రేమను పోగొట్టుకుంటుంది. ప్రపంచంలో ఇది సాధారణంగా జరిగే పొరపాటు" అన్నాడు. ఆ అమ్మాయి తన పుస్తకంలోనుంచి తలపైకెత్తి, అంతా శ్రద్ధగా విని, జవాబు చెప్పడానికి ఏమీ లేనందువల్ల తిరిగి తన పుస్తకం చదవడంలో నిమగ్నురాలయి పోయింది.

ఈ ఇతివృత్తం డాక్టర్ శర్మకి సరదా కలిగించ లేదు. ప్రేమకి అతడి మనస్థితిని తాకేశక్తి లేదు. అతడికీ అతడి భార్యకీగల సంబంధంలో ప్రేమయొక్క ఉద్వే గము లేదు. అది మిక్కిలి సాధారణమైనది, బాహిర మయిన లౌకిక మర్యాదలకు సంబంధించినది. భార్యను గురించి అంతకన్నా ఎక్కువశ్రద్ధ తీసుకొందుకి అతడికి నిత్యజీవితంలో వ్యవధి లేకపోయింది. అందుచేత నే అతడి మనస్థితికి ఆ ఇతివృత్తం పేలవంగా తోచింది. ఆ అబ్బాయిని పరిశీలించడం విరమించేడు. కాలం గడవడానికి మంచిపుస్తకం ఏదీ దగ్గర లేకపోవడము డాక్టర్ శర్మకు చికాకు కలిగించింది. ఉత్తమమైన ఉపయోగకరమైన శాస్త్రగ్రంథాలు ఎన్నో అమెరి కాలో కొని అతడు తెస్తున్నాడు. కాని అవన్నీ నెమ్మదిగా ఓడమీద వేరే వస్తున్నాయి. అతని దగ్గర ప్రస్తుతం ఏది పుస్తకం లేదు. కాలం ఎలా గడుస్తుందో తెలియదు.

బయట క్రమంగా చీకటి ముసిరి దట్టంగా వ్యాపించింది. రైలేదో స్టేషనులో ఆగింది. తక్కిన ప్రయాణీకు లందరూ రాత్రి భోజనాలు చెయ్యడాని కుపక్రమింప సాగారు. శర్మకి ఆకలిగా లేదు. కొన్ని పళ్ళు కొనుక్కొని తినసాగాడు.

"మీరు రాత్రి భోజనం చేయరా?"—ఆ అబ్బాయి డాక్టర్ శర్మని ఉద్దేశించి ఇంగ్లీషులో అడిగేడు.

"ఆకలిగా లేదు" అని శర్మ ఇంగ్లీషులో చెప్పేడు.

"ఎక్కడికి వెళ్తున్నారు?" ఆ అబ్బాయి మళ్ళీ ప్రశ్నించాడు.

"వాల్టైర్" అన్నాడు శర్మ.

"మీరు తెనుగువాళ్లా?" ఆ అబ్బాయి ఉత్సుక తతో తెనుగులో అడిగాడు.

"అవును." అన్నాడు శర్మ. తక్కినవాళ్ళంతా అతడిని అభిమానంతో చూశారు.

"మేమూ విశాఖపట్నమే వస్తున్నాం" అన్నాడు ఆ అబ్బాయి. తర్వాత కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా గడి చింది.

"మీది విశాఖపట్నమా?" ఆ అబ్బాయి మళ్లీ ప్రశ్నించాడు.

"అవును." అన్నాడు శర్మ. తర్వాత ఆ అబ్బాయి డాక్టర్ శర్మ ఉద్యోగం వాటినిగురించి ప్రశ్నిస్తూ సంభాషణచేశాడు. డాక్టర్ శర్మ విశ్వవిద్యాలయంలో వృక్షశాస్త్రంలో ప్రధానోపాధ్యాయుడు. విజిటింగ్ ప్రొఫెసర్ గా అమెరికావెళ్ళి, ఐదు సంవత్సరాలు అక్కడఉండి తిరిగి వస్తున్నాడు. ప్రస్తుతం అతడు ఆ ప్రయాణంలో నే ఉన్నాడు.

"మీది విశాఖపట్నమా?" ఈసారి ప్రశ్నించే వంతు తనది అని తోచి శర్మ ప్రశ్నించేడు.

"అవును. నేనక్కడే మెడిసిన్ చదువుతున్నాను." ఆ అబ్బాయి అన్నాడు. డాక్టర్ శర్మకి తన పెద్దకొడుకు ఈ మధ్యనే ఎమ్. డి. పేసయినట్లు వ్రాసిన ఉత్తరం జ్ఞాపకం వచ్చింది. అతడి రెండో కొడుకుఅమెరికాలో భౌతికశాస్త్రంలో పి. హెచ్.డి కి చదువుకున్నాడు. శర్మ అతడి కూతురునీ, ఆఖరు కొడుకునీ భార్యతో స్వదేశంలో విడిచిపెట్టి అమెరికా వెళ్ళేడు కూతురు తను నిష్ణాతుడైన వృక్షశాస్త్రంలో బి. యస్. సీ. చదువుతోంది. ఆమెను ఆ శాస్త్రంలో చాలా పెద్దదాన్ని చెయ్యాలని అతడి గాఢ ఆశయం. ఆఖరికొడుకు పిన్నవాడు. కాన్వెంట్‌లో చదువుతున్నాడు. క్లాసులో ప్రతి సబ్జెక్టులోనూ ఫస్టుమార్కు తనదేనని విదేశంలో ఉండే తండ్రికి ఉత్తరాలు వ్రాస్తూ ఉండేవాడు. తన విజ్ఞాన పిపాసా, తెలివితేటలూ తన బిడ్డలందరకూ సంక్రమించినందుకు డాక్టర్ శర్మకి చాలా సంతృప్తిగా ఉంది. అసలు అతడి బిడ్డలందరి విద్యాభ్యాసం, లోకజ్ఞానం, సంస్కృతి అన్నీ తన అభిప్రాయంలో ఉత్తమ అభిరుచులు అనుకొనేవాటి ప్రకారమే ఏర్పరుపబడ్డాయి.

డాక్టర్ శర్మకీ, ఆ అబ్బాయికీ అభిరుచులలో సారూప్యం లేదు. అంతేకాదు, శర్మ ఉద్దేశంలో చాలా అంతరం ఉంది. అందుచేత నేతర్వాత వాళ్ళిద్దరి మధ్య సంభాషణ సరదాగా సాగలేదు. ఏదో కాలం గడిపివెయ్యడానికిమాత్రం వినియోగపడింది. అమెరికా దేశం, అక్కడ లేబొరేటరీలలోని సౌకర్యాలూ వీటిని గురించి చాలా సేపు మాట్లాడుకొన్నారు. ఆ అబ్బాయి తల్లిదండ్రులు నిద్రపోడానికి ఉపక్రమిస్తున్నప్పుడు శర్మ టైమ్ చూశాడు. రాత్రి పదిగంటలు కావస్తోంది. తనుకూడా పడుకొందుకి బట్టలు మార్చుకొన్నాడు.

"నిద్రవస్తోందా?" ఆ అబ్బాయి తన భార్యని గోముగా అడిగాడు.

"ఏమో!" అంది ఆమె విలాసంగా ఒళ్లు విరుచుకొంటూ. లైట్లన్నీ ఆర్పేసి అందరూ నిద్రకి ఉపక్రమించారు. కంపార్ట్‌మెంట్‌లో నిశ్శబ్దం రైలు ధ్వనుల శృతిని అధికం చేస్తున్నది. రైలు చాలా వేగంగా పోతూ పట్టాలమీద తేలిపోతున్నట్లుగా పోతున్నది. డాక్టర్ శర్మ కళ్ళు మూసుకొన్నాడుగాని ఆలోచనలు పరిపరివిధాలుగా పోతున్నాయి. తన విద్యార్థి జీవితం, సాధించిన గొప్ప కార్యాలూ వీటి గురించి ఒకసారి ఆలోచిస్తాడు. ఇంకోసారి అతడి మనస్సు ఇంటి దిక్కుగా భార్యా బిడ్డలవైపు ప్రసరిస్తుంది. మరోసారి అమెరికాదేశపు లేబొరేటరీలలోని సౌకర్యాలూ, హిందూదేశపు లేబొరేటరీల దీనపరిస్థితులు వీటి గురించి బాధతో ఆలోచిస్తాడు. అతడికి ఎప్పుడు నిద్ర వచ్చిందో అతడికే తెలియదు.

ఎప్పుడు తెల్లవారిందో తెలియదు. ఎప్పుడు రాత్రి వర్షం కురిసి కురిసి వెలిసిందో తెలియదు. డాక్టర్ శర్మ నిద్ర లేచేసరికి బాగా ప్రొద్దెక్కింది. అంతా ఇదివరకే లేచి ఉన్నారు. ఆ వలభై ఏళ్లాయన వచ్చే స్టేషన్‌లో దిగిపోవడానికి తయారవుతున్నాడు.

రైలు లేదో జంక్షన్‌లో ఆగింది. అంతా ఫలహారాలు చేశారు. రైలు తిరిగి కదిలే వేళ అయింది. ఆ అబ్బాయి చాలా ముందుగా టిఫిన్ ముగించి బుక్ స్టాల్‌లో పుస్తకాలేమైనా ఉంటాయేమో అని వెళ్లాడు. ఇంకా తిరిగి రాలేదని అతడి తల్లి దిగులుపడుతోంది.

అవతల ప్లాట్‌ఫారమ్‌లో బుక్ స్టాల్‌లో పుస్తకాలు చూస్తున్న ఆ అబ్బాయి పరధ్యానంగా రైలు బయలుదేరబోవడం చాలాసేపటి వరకూ గమనించలేదు. తీరా రైలుకూత కూసి కదులుతూ ఉండగా చప్పున పుస్తకాలు పడేసి తొందరగా పరుగెత్తాడు. ప్లాట్ ఫారమ్‌లో చాలా ముందుగా ఉన్న తన కంపార్ట్‌మెంట్ వైపు దూసుకుపోయాడు. అతడు పరుగెత్తుతూ తమ కంపార్ట్‌మెంట్‌ను సమీపించడం డాక్టర్ శర్మ ముందుగా చూశాడు. ఒక్క క్షణం అతడు తమ పెట్టెని అందుకోలేడని సందేహించి వెనకాల ఏదైనా పెట్టెలోకి ఎక్కేస్తే బాగుండునని అనుకొన్నాడు. మరుక్షణంలోనే ఆ అబ్బాయి తమ పెట్టెను చేరుకొన్నాడు. గేట్‌ని పట్టుకొని, కొన్ని గజాలు రైలుతో బాటే ముందుకి పరుగెత్తి లోపలికి దూకాడు.

కాని! ఏదీ అతడు? ఏమైపోయాడు? అంతా కెవ్వున కేక వేసి గేట్ దగ్గరకి పరుగెత్తారు. ఎవ్వరికీ ఏమి చెయ్యడానికీ తోచకుండా బుద్ధి శూన్యంగా ఉంది. రైలు హఠాత్తుగా ఆగిపోయి అంతా త్రుళ్లిపడ్డారు.

......................

# ఒక సంఘటన

రైలుని కొన్ని ఫర్లాంగులు వెనక్కి నడిపించి ఆ అబ్బాయి మృతకళేబరాన్ని బయటకి తీశారు. కొద్దిక్షణాలలో స్టేషనంతా హాహాకారాలతో, సానుభూతితో, ఆశ్చర్యంతో నిండిపోయింది. ఏదో మూడో పగబట్టి ఇలా చేశాడని అంతా అనుకుంటున్నారు. ఆ అబ్బాయి తల్లిదండ్రులు గుండెల్ని అరచేతులతో బాదుకొంటూ ఏడుస్తున్నారు. ఆ అమ్మాయి విలాపానికి అంతులేదు. ఈ దృశ్యాన్ని చూస్తున్న డాక్టర్ శర్మ రెండు కళ్ళూ రెండు అగ్నిగోళాలవలె జ్వలించిపోయాయి. అతడిని ఈ సంఘటన బాగా కదిపివేసింది. ఇలాటి రైలు ప్రమాదాలని అతడు ఇదివరకు ఎప్పుడూ చూడలేదు. రైళ్ళక్రిందపడి మనుష్యులు చచ్చిపోవడం వార్తాపత్రికలలో చదివాడు. కాని అవి కొన్ని చిన్నవార్తలకన్నా ఎక్కువ ఏమీ కావు. ఆ అబ్బాయి భార్యని ప్రేమిస్తూ, తల్లిదండ్రులతో మాట్లాడుతూ ఇప్పటిప్పటివరకూ తన కళ్ళముందు నిండా జీవిస్తూనే ఉన్నాడు. ఒక్క క్షణంలో రైలు ప్రమాదానికి లోనై చచ్చిపడి ఉన్నాడు.

డాక్టర్ శర్మ వెళ్ళి ఆ అబ్బాయి శిథిలశరీరాన్ని చూశాడు. అబ్బ! ఘోరంగా ఉంది. కొన్ని క్షణాలసేపు జీవితం, మరణం ఇవి కొన్ని శాస్త్రీయమైన పద్ధతులుగా అతడికి కనిపించడం హఠాత్తుగా ఆగిపోయింది. ఆ దేహాన్ని చూడలేకపోయాడు. తల బాధతో గిర్రున తిరిగిపోయింది. కాళ్లు భూమిమీద నిలవలేక నీరసంగా తేలిపోసాగాయి. రెండు నిముషాలలో అతడు స్మృతితప్పి భూమిమీదకి ఒరిగి పడిపోయాడు.

మొహంమీద చల్లటి నీళ్ళు ఎవరో చల్లగా అతడికి స్మృతి వచ్చింది. శర్మ ఇంక అక్కడ ఉండలేకపోయాడు. అంతటి మానవప్రేమనీ, మరణాన్నీ, దుఃఖాన్నీ ముఖాముఖిగా తారసిల్లి నిలబడగలిగే మనోదార్ఢ్యం అతడిలో లేకపోయింది. పిచ్చివాడిలాగ వెళ్ళిపోయి తన కంపార్ట్‌మెంట్‌లో కూర్చొన్నాడు. కొంతసేపటివరకూ అతడిలో ఆలోచనాశక్తి నశించిపోయింది.

చాలా సేపటికి రైలు మళ్ళీ బయలుదేరింది. ఇదివరకు ఆ అబ్బాయీ, అమ్మాయీ కూర్చొన్న బెర్తులు ఎదురుగా ఖాళీగా కనిపించేసరికి అతడిలో దుఃఖం ఒక్కసారిగా పెల్లుబికింది.

"అయ్యో! పాపం!" అనిపించిందతనికి. అతడి మనస్థితికి పూర్తిగా విరుద్ధమైన ఈ సంఘటన అతడి హృదయపు లోలోతులలో సూటిగా తగిలింది. విజ్ఞాన యాత్రవలె సాగిన అతడి జీవితానుభవం అంతా ఈ సంఘటనముందు చాలా అల్పం అయిపోయింది.

"ఆ అబ్బాయి బ్రతికి ఉంటే ఎంత బాగుండును! అతడి ముసలి తల్లిదండ్రులుగాని, నేనుగాని చచ్చిపోయి ఆ అబ్బాయి బ్రతికి ఉంటే ఎంత బాగుండును!" అని డాక్టర్ శర్మ అనుకొన్నాడు. ఇది కేవలం ఆ స్థితిలో ఆ యువదంపతులపైన కలిగిన క్షణికమైన సానుభూతి మాత్రమే కాదు. తన కళ్ళముందు ఒకరోజంతా అంత బాగా కనిపించిన ఆ జీవన సౌందర్యం, ఆ యువదంపతుల ఆనందమయమైన సంసారం అలాగ విశ్లేషమై పోవడం అతడు సహించలేకపోతున్నాడు. ఆ ప్రమాద సంఘటనలో తను ఉద్దేశించిన మార్పుని డాక్టర్ శర్మ మనస్ఫూర్తిగానే ఆశింపసాగాడు.

# దూతమత్తేభము

కళాదాస

అధికారంబున నేమరిల్లి - ప్రభుశాపగ్రస్తుడై - యక్షు డొ
క్కడు కాంతావిరహార్తితో జనకపుత్రీస్నానపుణ్యోదకం
బుల ఛాయాతరువీథులన్, నవయుచుండెన్ రామగిర్యాశ్రమం
బులలో, బ్రజ్ఞలుగ్రుంక, భోగ్యమగు వర్షాంతంబు నీక్షించుచున్.

అటు కొన్నాళ్లు ప్రియావియోగకృశతన్ ముంజేతి కాంజాళువా
కడియం బత్తక జాఱిపో గడపి, ఆషాఢాద్యవారంబునన్
తిలకించెన్ గిరిసానుకూటముం - కోరల్ గ్రుచ్చి కోరాడు కే
ళీ గజంబుం బలె - ప్రాలి తారసిలు మేఘంబున్ స్మరావిద్ధుడై.

లలనాలాలన మావహింప ఘనముం దెట్లో చిరం బాగి, అ
శ్రులు లోలోన నడంచి యక్షు డిటు చింతించెన్ "సహప్రేయసీ
సుఖులే తొల్కరి రాక నుల్కెదరు కంఠాలింగనానందిత
ప్రణయుల్ దూరగులై వియోగపరిపీడన్ చిక్క నింకేమనన్."

దరియన్ శ్రావణమాసపక్షములు జాయాజీవితాలంబనా
వనుడై, అమెకు మేఘుచే స్వకుశలోదంతంబు నందింపగా -
అత, డర్ఘ్యంబును కొండమల్లెపువ్వులన్ గల్పించి, సంప్రీతుడై
పలికెన్ స్వాగత మంత ప్రీతివచన స్నేహప్రసన్నంబుగన్.

జలవాతంబులు - వహ్నిధూమములు రూపుంగొన్న మేఘుం డదె
క్కడ ప్రాణేంద్రియభద్రపాటవసుసాధ్యంబైన సందేశ మె
క్కడ! సం చెంచడు యక్షు డుత్సుకత పేర్మిన్; చేతనాచేతనాం
తరసంమూఢులు గారె కాముకు లపస్మారస్వభావావశుల్.

భువనఖ్యాతము నీదుపుట్టుక పయోదా! పుష్కలావర్తకా
న్వయ - మింద్ర ప్రథమ ప్రవర్తకుడ - విచ్ఛారూపి - విశ్లాటచే

* మహాకవి కాళిదాసు మేఘసందేశ కావ్యమునకు అనువాదం. యతిప్రాసలు వదలివేయబడినవి.

# దూ త మ త్తే భ ము

విధి దోషింపఁగ దూరబంధువుఁడనై యాచింతు నిన్; భాగ్యమా
సుగుణాభ్యర్థన భంగమే నధమమన్యంబౌను లాభించియున్.

శరణం బీవ ప్రతప్తచిత్తులకు జీమూతా! ధనస్వామి కో
పమునన్ బిట్టెడబాటుపాలయితి, నా సందేశ మందింపవో!
శివచూడాశశిచంద్రికల్ తడుపు బాహ్యోద్యానహర్మ్యంబులన్
లలితంబౌ అలకన్ వసించు సఖ; నీ వాత్రోవ పోవందగున్.

పవనాధ్వన్యుఁడవైన నిన్ను పథికస్త్రీ లాసతో నూఱడి
ల్లి విలోకింతురు - ముంగురుల్ పయికిపోవ్ ద్రోసి—తథ్యం బెవం
డో పరాధీనుఁడుదక్కఁ నావలె, నుపేక్షించున్ వియోగ వ్యథా
మథితస్వాంతను కాంత నెందు? భవ దాప్యాయప్రియాసన్నతన్.

పవమానుం డనుకూలుఁడై సహకరించున్ మందమందంబుగా,
పలుకున్ తీయనినోట చాతకము వామంబందు గర్వంబుతో
నయనానందకరున్ నినున్ గొలుచు గర్భాధాన కేళిక్రియా
పరిపాటిన్ బిసకంఠికల్ చదల బంతుల్ బంతులై యింపుగన్.

దినముల్ లెక్కలుపెట్టుకొంచును మదేకధ్యానయై ప్రాణముల్
విడ దస్మత్ప్రియ; భ్రాతృజాయవలె సందర్శింపనౌ నీకు, త
థ్యము; కాంతాహృదయంబు పువ్వువలె రాలున్ విప్రయోగార్తి, నై
నను నిల్పున్ ప్రణయాలవాలమగు ఆశావృంత మాద్యంతమున్.

ఫలసస్యోత్సవ సూచకంబుగ శిలీంధ్రంబుల్ మహిన్ లేపు నీ
స్తనితస్వాదు సుఖారవంబు విని, యాత్రామానసోత్కంఠమై
చను రాయంచలు వెంటరాగలవు కైలాసంబుదాకన్—బిసాం
కురపాథేయము లారగించుచు—సహాయస్నేహచర్యారతిన్.

సఖుఁడా సేమము లాడి పొమ్ము శిఖరీంద్రున్ కౌగిటం గ్రుచ్చి, పూ
జ్యుఁడు—శ్రీరామపదాంకమేఖలు—డుదాత్తుం డాత—డేఁడాదికొ
క్కఁడ ప్రాప్తించు భవత్సమాగమసుఖాప్తిన్ వేడికన్నీళ్లు నిం
చును, పర్యాయవియోగభారశిథిలస్నేహాంతరావిష్కృతిన్.

అలపుల్ సొక్కులునింప నెత్తముల సేదల్ తీఱ కాలూది, దు
ర్బలమై చిక్కినచిక్కఁ ద్రావి గిరికుల్యాధాతుమత్తోయముల్, . . .

చను నీయాత్ర కభీప్సితంబయిన త్రోవన్ చెప్పెదన్ చూడు, మా
వల నాలింపుము కర్ణపేయమగు మందాక్రాంతసందేశమున్.

గిరిశృంగంబును పెల్లగించుకొనిపోనీ వాయు వంచున్ మొగం
బులు పైకెత్తి భ్రమించి చూచెదరు ముగ్ధల్ నిన్ను సిద్ధాంగనల్,
నిచులక్లిన్నపదంబు కొల్పి చదలన్ దిఙ్నాగహస్తార్భటీ
త్రుటి కొత్తిల్లి - ఉదీచికై జరుగు ముత్సాహంబుతో నీరదా!

బహురత్నప్రభ లల్లిబిల్లిగొనెనాచక్షుష్యమై క్రాలు ఇం
ద్రధనుఃఖండము మొల్చుచున్న దదె వల్మీకాగ్రమందుండి, త
ద్రుచుల్ నల్లని నీదుమూపు రమణించున్ — గోపవేషంబుతో
శిఖిపింఛచ్ఛవి నుజ్జ్వలించు అసితశ్రీవిష్ణులీలాంశలన్.

కృషిసంపత్తులు నీ యధీన మగుటన్ వర్షింపు మా మిట్టభూ
ములు సౌరభ్యము పుక్కిలింప, అనభిజ్ఞ భ్రూవిలాసంబులన్
నిను సేవింతురు పల్లెచేడియలు స్నేహప్రీతి; వెన్కాడి — యిం
చుక సేపాగి, గమింపు మావల నుదీచీలక్ష్మీపీఠాగతిన్.

జడివానన్ మును సామకూటవనదందహ్యాగ్ని చల్లార్చివే
సిన నిన్నాదలదాల్చు సానువిభు డధ్వశ్రాంతి విశ్రాంతిగా;
కృపణుండైనను మోము త్రిప్పడు కృతజ్ఞాసంస్మృతిన్ మిత్రు డా
శ్రయ మర్థింపగ-ఏమి చెప్ప నిక శిష్టస్నేహితాచార్యముల్.

మెఱియన్ పక్వఫలాళితో అడవిమామిళ్లోరలన్, నింగి వా
ల్జడవన్నెల్ కయిసేయు నీవు గిరిశృంగం బెక్క శోభిల్లగా,
నడుమన్ నల్పును శేషమంతయును తెల్పున్ మించు భూభామినీ
స్తనమో నా దరిశింత్రు ఖేచరులజంటల్ చిత్రకూటస్థితిన్.

వనకాంతల్ శయనించిపోవుపొద లాసాదించు ఆ మావికా
నను వర్షింపుము సుంత నిల్చి - బరువీగన్ మీది మార్గంబు న
త్వరమే దాటుము - వింధ్యపాదమున పాషాణాంతరాక్షిప్త రా
గను రేవన్ కనవచ్చు మేన వెలిపట్టెల్ పొల్చు పద్మింబలెన్.

విషభారంబును వెళ్ళబోసి ఘనుడా! రేవాఃపయోధార లా
నుము - నేరేళ్ళకుదుళ్ళ మాగు గజమాద్యద్గంధతిక్తంబు - ల

# దూతమత్తేభము

య్యాపి, నీకంత రసత్వ మిచ్చు, కదలింపఁ లేదు వాతంబు; అ
ట్టులెగా, రిక్తుడు సర్వలాఘవుడు - స్థేయస్వామి పూర్ణుండగుఁ.

హారితశ్యామములైన నీపవిపినార్ధోన్ముక్తకింజల్కముల్
తినుచుఁ, చిత్తడిచేల నేలరటి మొక్కాకుం గొనల్ మేయుచున్,
అడవిన్ కమ్మని భూమిగంధముల నాఘ్రాణించు సారంగముల్
చినుకుంజల్లులు రాల్చుచున్ జనిన నీమార్గంబు సూచించెడిన్.

చినుకుల్ మింటనె త్రావు చాతకముఖప్రావీణ్య మగ్గించుచున్,
గుఱుతుల్ సూపుచు బంతితీర్చిన బలాకాపాళి లెక్కించుచున్,
స్తనితం బల్లిన పర్వసంభ్రమముతో నుత్కంఠలై వల్లభల్
కవుగిండ్లీయఁగ సన్నుతింత్రు నిను సిద్ధుల్ లబ్ధవాల్లభ్యలై.

సఖుడా ! కోరుదు మత్ప్రియార్థమయి నీ శీఘ్రప్రయాణంబు; ని
ల్వాకు మత్యంతము కొండకొండ - కకుభంబుల్ గందముల్ గుప్ప-నీ
కెదురేతెంచి సుఖాశ్రునేత్రలయి శుక్లాపాంగముల్ స్వాగతీ
కృతకేకీరుతినామతించు - నయినఁ సాగందగుఁ సత్వరఁ.

తమగూళ్ళఁ సవరించు కాకుంరొదఁ అంపిల్ల రథ్యాంతరుల్,
కొనలఁ విచ్చిన కన్నెకేదగుల తెల్పెక్కఁ గృహారామముల్,
భవదాప్తిఁ నలుపెక్క పక్వఫలముల్ వ్రేలాడు నేరేళ్లు, హం
సము లింతంత త్యజింపనున్న యెడలై యొప్పఁ దశార్ణాంతముల్.

విదిశాపట్నము రాజధాని దశదిక్ప్రఖ్యాతమం దేగ పొం
దెద వవ్యాకులకాముకవ్రతహితప్రాప్యంబు, కించి చ్చలో
ర్మిమతీ వేత్రవతీ సుధారస మటఁ - భ్రూభంగముగ్ధాస్యముం
బలె - క్రోలంగనగుఁ తటిస్తనితసాధుస్వానముల్ సల్పుచుఁ.

[సశేషము]

# మృత్యువుతో ముఖాముఖి

శ్రీ కుందుర్తి

**పాత్రలు:** శాస్త్రజ్ఞుడు, మృత్యువు, సంజీవి, రోగి, ఒకవ్యక్తి, విలేఖరులు.

[శ్రవ్య నాటిక]

* * ఒక ప్రఖ్యాత శాస్త్రజ్ఞుని పరిశోధన మందిరం. మరికొన్ని నిముషాలలో మరణించవలసిన రోగి టేబిల్ మీాద పడుకుని ఉన్నాడు. ప్రాణం పోకడ ఎలా జరుగుతుందో గమనించాలని శాస్త్రజ్ఞుని ఆశయం. వీలైతే దాన్ని పట్టుకోవాలని ప్రయత్నం. మానవ జాతికి శాశ్వతంగా ప్రాణదానం చేయాలని ఆయన సంకల్పం. బయట తలుపు తట్టిన శబ్దం.

బయట: ఏమండీ! ... ఎవరండీ ఇంట్లో ... కొంచెం తలుపు తీస్తారా?

లోపల: ఎవరది?

బయట: నే నేనండీ. ఎవరైతే నేమి తలుపుతీయండి... త్వరగా తీయండి.

లోపల: ఎవరో చెప్పండి. పనిమీాదఉన్నాం. ఇప్పుడు తీసే వీలేదు. ఎవరు మీారు?

బయట: నేను దేవుణ్ణి.

లోపల: అబద్ధం. దేవుడైతే తలుపులు వాటంతటవే తెరుచుకునే వేగా!

బయట: దేవదూతినులెండి. తలుపు తీయండి.

లోపల: అది అబద్ధమే. ఇప్పుడు తీయటానికి వీల్లేదు. కాస్సేపు తాళిరా పో.

బయట: ఆచార్ల గారమ్మాయినండీ. రోగితో చెప్పండి ...మోహన్‌రావుగారూ ... మోహన్ రావుగారూ. నేనండీ...సంజీవిని...తలుపు తీయించండి.

లోపల: ఆఁ!...సం...జీ...వి ... తీ...యం...డి! స్వా...మీా...

[తలుపు తీసిన శబ్దం. వెంటనే తలుపు మూసుకుంటుంది,]

శాస్త్ర: మీారు ఏం మాట్లాడకండా అలా కూచోండి. నన్ను డిస్టర్బ్ చేయకండి. ఒక్క పదినిమిషాల పాటు ఓపిక పట్టండి.

మృత్యువు: అలాగే...ఎలా వుందండీ మోహన్ రావుగారికి?

శాస్త్ర: తర్వాత అన్నీ చెప్తాను. ఆగండి.

మృత్యువు: అలాగే...ఏం జబ్బంటారు?

శాస్త్ర: దయచేసి మాట్లాడకండి. ఒక్క రెండు నిముషాలు.

మృత్యువు: అలాగే...ఇంతకూ ఏమైనా నయమవుతుందా? నా ఆదుర్దాకొద్దీ అడగాల్సి వస్తున్నది. క్షమించండి.

శాస్త్ర: అబ్బ! ఆయన చనిపోయాడండీ. నన్ను విసికించకండి.

మృత్యువు: ఇప్పుడు 'సంజీవి' అని హీనస్వరంతో మాట్లాడి నే!

శాస్త్ర: అదే చివరిమాట. తర్వాత చెప్తాను. కొంచెం నన్ను మాట్లాడించకండి.

మృత్యువు: అయితే ప్రాణం పోయిందన్నమాట!

శాస్త్ర: ఎక్కడికీపోలేదు. మీారు దయచేసి రెండు నిమిషాలు మాట్లాడకుండావుంటే, మీా మోహన్ రావుచేత మళ్లీ మాట్లాడిస్తాను.

మృత్యువు: విచిత్రంగా వుందే. చనిపోయినవాళ్లు మాట్లాడతారండీ. మీ పిచ్చిగానీ.

శాస్త్రి: అబ్బ! మీ రెవరోగానీ నా ప్రాణం తీస్తున్నారు.

మృత్యువు: కాదు మోహనరావు ప్రాణం తీస్తున్నాను.

శాస్త్రి: మోహనరావు ప్రాణం నా చేతిలో సురక్షితంగా ఉంది.

మృత్యువు: ప్రాణం పోయిందన్నారుగా?

శాస్త్రి: మీ రెవరోగానీ, మోహనరావుకు చాలా అపకారం చేస్తున్నారు. నా ప్రయత్నం సాగకుండా చేస్తున్నారు. శాస్త్రానికి ద్రోహం చేసున్నారు.

మృత్యువు: నా కేమీ అర్థమవటం లేదు. నేను సంజీవినండీ.

శాస్త్రి: మంచిపేరే! దానికోసమే, నా అన్వేషణ.

మృత్యువు: ఎదురుగానే వచ్చానుగదా.

శాస్త్రి: దేవుణ్ణి అంటివే?

మృత్యువు: ఆఁ. అలా అంటేగాని తలుపుతీయరని అన్నానులెండి. దేవుడు వచ్చి, నేను దేవుణ్ణి తలుపుతీయమంటాడటండీ, మీ పిచ్చిగానీ.

శాస్త్రి: దేవదూత నంటివే?

మృత్యువు: మనుషులందరూ దేవదూతలే. ఆ అర్థంలో అని వుంటాను.

శాస్త్రి: సరేగానీ రెండు నిముషాలు దయచేసి వూరుకోండి. మిమ్మల్ని చూస్తే మాట్లాడాలని అనిపిస్తూ వుంది. నా పని పాడవుతుంది సరేనా.

మృత్యువు: అలాగే. ఈ ఒక్కముక్క చెప్పి వూరుకుంటాను. నాకు మోహనరావు అంటే చాలా ప్రేమ అండీ. మేమిద్దరం కలిసి చాలా రోజులు ......

శాస్త్రి: ఓహో. అలాగా, అందుకేపాపం చివర ఘడియల్లోకూడా మీ పేరు వినంగానే తలుపు తీయమని సంజ్ఞచేశాడు... కాని మీరు ఆయనకు అపకారం చేస్తున్నారు.

మృత్యువు: నేనా? ఏం మాటలండీ, మీరు మరీనూ.

శాస్త్రి: అంతేమరి. నన్ను మాట్లాడిస్తున్నకొద్దీ, నా ప్రయత్నం పాడవుతుంది.

మృత్యువు: ఇంతకూ మీ ప్రయత్నం?

శాస్త్రి: మోహనరావును మళ్ళీ బతికించాలని. ప్రాణం ఎలా వుంటుందో చూడాలని. వీలైతే దాన్ని పట్టుకుందామని. మళ్ళీ యీ కళేబరంలోనే దానిని ప్రతిష్ఠిద్దామని...

మృత్యువు: అంటే. మానవకోటికి మృత్యువులేకుండా, అందరినీ చిరంజీవులుగా చేద్దామని.

శాస్త్రి: అవునండీ. అదే. 30 సంవత్సరాలనుంచీ పరిశోధన చేస్తున్నాను. ఇవ్వాళమట్టుకు ఒకసూత్రం దొరికింది. అది నా మనస్సులో తళుక్కున మెరిసింది. మీరు తలుపు తట్టటానికి ఒక్క క్షణం క్రితంఆలోచనతట్టింది. ఆక్షణం మీరుముందుగా వచ్చి తలుపు తటితే ఆ ఆలోచన తట్టకపోయేదేమో. నాముప్పై సంవత్సరాల తపస్సు ఫలించింది.

మృత్యువు: ఒక్క క్షణం ఆలస్యమైందని అప్పుడే అనుకున్నాను. అయితే నేను రావటంమంచిదే అయిందన్నమాట.

శాస్త్రి: రావటం కాదు. ఆలశ్యంగా రావటం...... మీరు నన్ను మాట్లాడిస్తునే వున్నారు.

మృత్యువు: క్షమించండి. మోహనరావంటే నాకు ఎంతో ప్రేమ. అందుకనే ఇంతదూరం పరుగెత్తుకుని వచ్చింది. పూర్వం కాలేజీలో చదువుకునే రోజుల్లోనే ఆయనకూ నాకూ పరిచయం ఏర్పడింది. అప్పుడాయనకు డబుల్ టైఫాయిడ్ వచ్చిన రోజుల్లో, మనిషి అంతా చిక్కి శల్యావశిష్టమైన సమయంలో హఠాత్తుగా మా యిద్దరికీ సంబంధం ఏర్పడింది. కాని ఆయనకు నేనంటే తర్వాత తర్వాత ఇష్టం లేకుండా పోయింది. నన్ను మళ్ళీ కన్నెత్తి అయినా చూడలేదు. కాని ఆపూర్వపు స్నేహాన్ని వదులుకోలేక చివరిసారైనా చూచి వెళ్దామని పరుగెత్తుకుంటూవచ్చాను. మీరన్నట్లు ఒక్కక్షణం.ఆలశ్యం జరగనే జరిగింది. లేకుంటే మాట్లాడేవాడేమో!

శాస్త్రి: ఆయనచేత మాట్లాడిస్తానంటిని గదా! ఒక్క అయిదు నిముషాలు ఓపికపట్టండి.

మృత్యువు: ఇంక ఒక్క క్షణంకూడా ఓపిక పట్టలేను. ఇప్పటికైనా ఆయనతో శాశ్వతంగా ఐక్యమైపోదామని ఎంతో ఆశతోవచ్చాను. నాకా

భాగ్యం లేకపోయింది. ఆయనతో మాట్లాడాలనీ, ఒడిలో కూచోబెట్టుకొని నాచల్లని చేతులతో ఉంగరాలు తిరిగిన ఆజుట్టును దువ్వుదామనీ అనుకున్నాను. ఆశలన్నీ అడియాసలైనవి. ఇంక నేను ఓపిక పట్టలేను.

శాస్త్రి: మీరు ఇలా మాట్లాడవలసిన సమయం కాదు.

మృత్యువు: ఇదే మంచి సమయం. మీకు తెలీదు.

[మృత్యువు వికటాట్టహాసం]

* * *

[బయట]

సంజీవి: (ఆదుర్దాగా)...ఏమండీ...కొంచెం తలుపు తీయించండి...లోగిని చూడాలండీ...ఆయనకు ఎలా వున్నదండీ....

ఒక వ్యక్తి: లోపల ప్రయోగం జరుగుతున్నది. ఇప్పుడు తీయటానికి వీల్లేదు. నిశ్శబ్దంగా ఉండండి.

సంజీవి: ఎలా వున్నదండీ?

ఒక వ్యక్తి: చనిపోయాడు.

సంజీవి: చనిపోయాడా?...ఆఁ...తీయండి తలుపు...

[తలుపు గుద్దిన శబ్దం]

ఒక వ్యక్తి: అరె! మీకేమన్నా మతిపోయిందా? అల్లాగోల చేస్తారు! ఇవతలికి రండి ముందు.

పత్రికా విలేఖరి: [రొప్పుకుంటూ వచ్చి] హలో! సార్. ఎంతవరకొచ్చింది? సక్సీడ్ అయినట్లేనా?

ఒక వ్యక్తి: మీ రెందుకు వచ్చారు. సాయంత్రం నాలుగు గంటలకు పత్రికా ప్రతినిధుల సమావేశం. మీ కార్డు రాలేదా? దయచేసి అప్పుడు రండి. పొండి

విలేఖరి: అసలు ప్రయోగం ఎన్ని గంటలకు ప్రారంభమైంది?

ఒక వ్యక్తి: ఇప్పుడేమీ చెప్పను. వెళ్ళండి దయచేసి.

సంజీవి: ఏమండీ తలుపు తీయించండి కొంచెం.

ఒక వ్యక్తి: ఎవరు మీరు? అంత ప్రాధేయపడతారు. చెప్పుతుంటే అర్థంచేసుకోలేరు?

సంజీవి: నేను సంజీవినండి.

ఒక వ్యక్తి: అంటే?

సంజీవి: మోహనరావుగారి మనిషినండీ.

ఒక వ్యక్తి: అదా కథా! సరే, ఏం ఫర్వాలేదు. కొంచెం ఉండమ్మా. మళ్ళీ మోహనరావు బ్రతుకుతాడు. మా ప్రొఫెసర్ గారు, మళ్ళీ బ్రతికిస్తారుగా. చూడు నామాట. కొంచెం ఓర్పుకో అమ్మా...

సంజీవి: తలుపుతీయరా?

ఒక వ్యక్తి: ఇప్పుడు తీయడానికి వీల్లేదు.

సంజీవి: మోహన్...మోహన్...అయ్యో మోహన్.

[లోపల]

శాస్త్రి: ఇందాకటినుంచీ మాట్లాడిస్తూనే వున్నారు. నామనస్సు పనిచేయటం లేదు.

మృత్యువు: మీరు మాట్లాడకుండా ఉండండి. మీపని మీరు చేసుకోండి. నాబాధ నేను వెళ్లబోసుకో వద్దంటారా?

శాస్త్రి: మిమ్మల్ని చూస్తే మాట్లాడ బుద్ధేస్తున్నది.

మృత్యువు: ఆ మాటే అన్నారూ మీరు కూడా. మోహనరావు సరిగ్గా ఇలానే అంటూవుండే వాడు.

శాస్త్రి: ఇప్పటికి మీరువచ్చి 5 సెకండ్లు అయింది. నా కాలమంతా వృధాచేస్తున్నారు. మీరు దయచేసి ఊరుకుంటే...

మృత్యువు: మీ కాలం వృధా ఎందుకవుతుందండీ, మీ పిచ్చిగానీ, కాలం తీరినవారికి కాలం పోస్తున్నారు మీరు...

శాస్త్రి: మీరు పోయనిస్తేగా.

మృత్యువు: మీ ప్రయత్నం మీరు చేస్తున్నారు. తప్పేముంది?

శాస్త్రి: మీరు అడ్డువస్తున్నారు. అంతేకదూ!

మృత్యువు: కొంతవరకు అది నిజమేననుకోండి. కాని అది నా విధి. ఏంజేస్తాం మరి.

శాస్త్రి: అది మీ విధా......?......ఆశ్చర్యంగా వుందే!

మృత్యువు: అవునండీ.

శాస్త్రి: అయితే మీరు దయచేసి ఇక్కడినుండి వెళ్ళిపోతారా?

మృత్యువు: వెళ్లను. ఇంతకంటే ఎక్కడికి పోయేది?

శాస్త్రి: మీ మాటలు వింతగా వున్నాయి.

మృత్యువు: సహజమైన చావును ఆపజూడటం వింతగానే ఉంటుంది.

శాస్త్రి: మోహనరావు బ్రతకటం మీకు ఇష్టంలేదా?

మృత్యువు: సృష్ట్యాదినుండి వస్తున్న కట్టుబాట్లు సడలిపోవటం నాకిష్టంలేదు.

## మృత్యువుతో ముఖాముఖి

శాస్త్రి : వివరంగా చెప్పండి. నా ప్రయత్నం ఆపటం మీ విధి అంటున్నారే పైగా.

మృత్యువు : మృత్యువే నా రూపంలో వచ్చిందేమో అని మీకు అనుమానం కలగటంకూడా సహజమే. అలా మాత్రం ఎందుకు జరుగకూడదు ?

శాస్త్రి : అదా కథా ? చాలా ఆశ్చర్యంగా ఉంది.

మృత్యువు : ఆశ్చర్యం కాదు. అదృష్టమనండి. బ్రతికి వుండి మృత్యువును చూడగలగటం మీ అదృష్టం.

శాస్త్రి : మృత్యువు ఆసన్నమైనా భయపడేవాణ్ణి కాదు. ప్రాణం వున్నంతసేపూ ప్రయత్నం జరుగవలసిందే. మోహనరావు గారికోసమేనా మీరు వచ్చింది.

మృత్యువు : కాదు. మీకోసమే.

శాస్త్రి : నాకోసమా ! అంటే నా ఆయుర్దాయం అయిపోయిందా ?

మృత్యువు : మిమ్మల్ని తీసుకు వెళ్లడానికి కాదు. మీతో ఒకమాట చెప్పిపోదామని వచ్చాను.

శాస్త్రి : చెప్పండి. మరి త్వరగా.

మృత్యువు : నాకు మీకంటే తొందరగా ఉంది. నేను ఇంకా అనేకచోటకు వెళ్లాలి.

శాస్త్రి : తెలీక అడుగుతాను. మరి మీరువచ్చి దాదాపు ఒక నిముషం కావచ్చిందిగదా. ఈ నిముష కాలంలో ప్రపంచంలో ఎక్కడా ఎవరూ చావలేదంటారా ?

మృత్యువు : ప్రాణంపోక అలాగే గిలగిల తన్నుకుంటుంటారు. నేను వెళ్ళేదాకా అంతే. ఈ చివరి కాలంలో ఒకనిముషం అటూయిటూ సర్దుకోటానికి నాకు అధికారం ఉంది.

శాస్త్రి : అయితే యీ మోహనరావు చనిపోయాడా లేదా ఇంతకూ ?

మృత్యువు : ఎటూ చెప్పటానికి వీల్లేకుండా వుంది. నన్ను మంచి ఇరకాటంలో పెట్టారు మీరు. ఆ కళేబరంలో ప్రాణంలేదు కాబట్టి చనిపోయినట్లే. కాని ఆ ప్రాణం నా చేతుల్లోకి రానంతవరకు బ్రతికివున్నట్లే. మధ్యలో ప్రాణాన్ని మీరు చేతులో పెట్టుకుని కూచున్నారు.

శాస్త్రి : మళ్ళీ యీ దేహంలోనే ప్రతిష్ఠిస్తాను. ఇంక మీతో మాట్లాడి కాలహరణం చెయ్యడానికి వీల్లేదు. నాకు వున్నదే మూడునిముషాల వ్యవధి. మీరు మృత్యువువైనాసరే, సాక్షాత్తు సృష్టికర్త అయినాసరే నాకేం భయంలేదు. నన్ను మాత్రం ఇంక మాట్లాడించకండి. ఈ ఒక్క ప్రయత్నం చెయ్యనియ్యండి. దయచేసి చెయ్యనివ్వండి...

*           *           *

[బ య ట]

సంజీవి : [ఉద్రేకంలో] చెయ్యనివ్వండి. ఎవరా అడ్డు మాట్లాడేది ?...ఎవరండీ ఆలోపల మాట్లాడుతున్నది ?

ఒకవ్యక్తి : ఎవరూలేరే! లోపల ఎవరూ వుంటానికి వీల్లేదు. ఎవర్నీ ఉండనివ్వలేదు.

సంజీవి : అదేమిటి, అలా మాటలు వినపడుతుంటే!

ఒకవ్యక్తి : నాకేమీ వినిపించటంలేదే !

సంజీవి : నా గొంతుగా గా వినిపిస్తున్నదండీ.

ఒకవ్యక్తి : మీకేదో భ్రాంతి కలిగినట్లుంది. కొంచెం ఓపిక పట్టండి. మరేం ఫర్వాలేదు. మా ప్రొఫెసర్ గారు ఇదే మొదటిప్రయత్నంచేస్తున్నారు. ఇది విజయవంతమవుతుందని మా అందరికీ నమ్మకంఉంది. కొంచెం ఓపిక పట్టండి. మీ మోహన్ మళ్ళీ బ్రతుకుతాడు. మానవజాతికి చావులేకుండా పోతుంది.

సంజీవి : అది సాధ్యమేనంటారా?

ఒకవ్యక్తి. సాధ్యమని ఋజువు చేయడానికే యీ ప్రయత్నమంతా.

సంజీవి : అదుగో వినండి, సంభాషణ జరుగుతూనే ఉంది. ఎవరో మీ ప్రొఫెసర్ గారి ప్రయత్నానికి అడ్డు తగులుతున్నారు. వినండి.

ఒకవ్యక్తి : నాకేమీ వినిపించడంలేదు. మీరు కొంచెం స్థిమితంగా ఇలా కూచోండి. మీ మనస్సు చెడిపోయినట్లుంది.

సంజీవి : అదుగో వినండి...నా గొంతేనండి...

*           *           *

[లో ప ల]

శాస్త్రి : అబ్బ! మీ వాదనతో నాబుర్ర వేడెక్కిపోతున్నది. ఇంక ఆపండి.

మృత్యువు : ఈ ఒక్క మోహనరావును బ్రతికిస్తే అయిపోయినట్లేనా మీ పని?

శాస్త్రి: ఇదొక ప్రయోగం, ఇది సఫలమైతే, దీనిని అందరిమీదకు ప్రయోగించే వీలుందేమో తర్వాత ఆలోచిస్తాను.

మృత్యువు: ఈ ప్రయోగం సఫలమవుతుందనే అనుకుందాం.

శాస్త్రి: నేను ధన్యుణ్ణి. నాతపస్సు ఫలించికదన్నమాటే.

మృత్యువు: కాని మీరు పునః ప్రతిష్ఠించిన ప్రాణం ఎంతకాలంవరకు పోకుండా ఉంటుంది?

శాస్త్రి: అది నాకూ తెలీదు. పునఃప్రతిష్ఠ జరిగిన పద్ధతి మీద, అది ఆధారపడి ఉంటుందనుకొంటాను.

మృత్యువు: మహా వుంటే ఒక గంట.

శాస్త్రి: పోనీ, అదే చాలు ప్రస్తుతానికి.

మృత్యువు: ఊలోగా ఏమైనా వీలునామా రాయిస్తారా!

శాస్త్రి: అదేం లేదు! ఏదో ఒక ప్రయోజనంకోసం యీ పని చేస్తున్నాననుకొన్నారా?

మృత్యువు: మరి లేకుంటే దేనికి చెప్పండి? జగతిలో పుట్టిన ప్రతి జీవికి సహజమైన చావును ఆపటానికి యీ హంగామా అంతా ఎందుకు చెప్పండి? ఇంకా ఒక గంటసేపు యీ జీవిని మీరు బ్రతికించగలిగితే ఇంకా ఎన్నో చెడుపనులు చేస్తాడు. మోహనరావు బ్రతికివుంటేగా ఏ మేమి చేశాడో మీకేమైనా తెలుసా? త్వరగా చనిపోతే బావుండునని అతనికే అనిపించేటంత ఘోరకార్యాలు చేశాడు. ఆచార్లగారమ్మాయికి పెండ్లికాకుండా చేశాడు.

శాస్త్రి: మానవునికి అనేక దుర్బలత్వాలు వుండవచ్చు. వాటితో నాకు నిమిత్తంలేదు. ఎన్ని తప్పులు చేసినా పతితుడైనవాడిని ఆదరించటమే మా లక్ష్యం.

మృత్యువు: అక్కడే తప్పు చేస్తున్నారు మీరు. చెడు పనులు చేసినవాణ్ణి శిక్షించకుండా ఆదరిస్తే, అతడు యింకా చేస్తూనే ఉంటాడు. మా లోకంలో అలా కాదు.

శాస్త్రి: మాఆదరణవల్ల అతడు మార్తాడని మావిశ్వాసం. మీ అంత కఠినంగా మేము ప్రవర్తించలేము.

మృత్యువు: అయితే దేవలోకం కంటే భూలోకమే గొప్పదంటారా?

శాస్త్రి: తప్పకుండా. మీ రింకా పాత పద్ధతుల్లోనే కొట్టుకుంటున్నారు.

మృత్యువు: అవి పురాతనపు పద్ధతులు. శాశ్వతమైనవి.

శాస్త్రి: ఏఒక్క పద్ధతీ శాశ్వతంగా లేదు. చెడుపద్ధతులు, మంచిపద్ధతులు యీ రెండే వున్నాయి. ఇంకోరకంగా విభాగం లేదు.

మృత్యువు: శాశ్వత, అశాశ్వత విభాగం లేదా?

శాస్త్రి: మాకు లేదు. తప్పుచేస్తే దేవుణ్ణిఅయినా క్షమిస్తాం. సృష్టిలో ఇన్ని అవకతవకలున్నా, ఆయనమీద మేము ఇంకా విశ్వాసం ఉంచుకున్నామంటే అది మా గొప్పతనం.

మృత్యువు: ఆయన నిర్దేశించిన దానిని విచ్ఛిన్నం చేయటానికి ప్రయోగాలుచేస్తూ ఇంకా ఆయనంటే విశ్వాసం ఉన్నదంటున్నారే.

శాస్త్రి: విశ్వాసం అంటే మూఢవిశ్వాసం కాదు. సృష్టిలో ఏమైనా లోపాలుంటే వాటిని సవరించుకోటానికి ప్రయత్నిస్తాం.

మృత్యువు: జీవులకు చావు కల్పించటం లోపమా?

శాస్త్రి. మానవులందరూ చిరంజీవులెందుకు కాకూడదు?

మృత్యువు: మీ ప్రయోగం ఫలించి, అయినారనుకుందాం. పుట్టినవారు చావటం లేకుంటే, మీలోకం వీరందరినీ భరిస్తుందా?

శాస్త్రి: మీలోకం ఎలా భరిస్తున్నది?

మృత్యువు: మావాండ్లకు ఆకలిదప్పులు లేవు.

శాస్త్రి: మరి మాకెందుకు పెట్టారు?

మృత్యువు: అది సృష్టికర్త లీల.

శాస్త్రి: ఇటువంటి సమాధానాలను మేము అంగీకరించము. మీరు, కావాలని, బుద్ధిపూర్వకంగా మాకు కొన్ని అవలక్షణాలు కల్పించారు. మీకంటే తక్కువవాండ్లగా మమ్మల్ని ఎల్లకాలం ఉంచాలని మీ కోర్కె. ఈ అవలక్షణాలను శాశ్వతం చెయటానికే చావు అనే మార్గాన్ని కల్పించారు. అందుకే మేము ఎదురుతిరిగాము. మా ప్రయత్నం మేము చేస్తుంటే మళ్ళీవచ్చి అడ్డుపుల్లలు వేస్తున్నారు. ఒకవేళ నా ప్రయోగం విజయంపొందితే మానవులకు చావు లేకుండా పోతుందేమో, వాళ్ళంతా దివ్యులై పోతారేమోనని నీ భయం, అంతేనా? మరొక ప్రక్క, ఇంకా కొందరు శాస్త్రజ్ఞుల దగ్గరకు వెళ్ళి, మరణాయుధాలు తయారు

చెయ్యమని నువ్వే ప్రోత్సహిస్తున్నావని కూడా తెలిసింది. నీ అస్తిత్వాన్ని అట్టే పెట్టుకోడానికి కాకుంటే, యీ ఆటంబాంబులు వగైరా ఎందుకు చేయిస్తున్నావు? మోహనరావు ఒక గంటసేపు మళ్ళీ బతికితే నీ విలువ నామారాయిస్తావా అని దిప్పిపోడిస్తివే. నీకు మాత్రం స్వార్థం లేదా? ముందు నీ మారణాయుధాలను తయారు చేయించే ప్రయత్నం ఆపు. ఆ తర్వాత నావంటి వాళ్ళతో సహకరించు. నీకు ఏమైనా హృదయం అనేది వుంటే, నా ప్రయత్నం ఆపకు. నన్ను మాట్లాడించి యీ పనికి విఘ్నం తలపెట్టకు.

మృత్యువు : గొప్ప ఉపన్యాసమే చేశావు. ఇంత తెలివి తక్కువవాడివని అనుకోలేదు.

శాస్త్రి : ఇంక నీతో మాట్లాడను. [ఏదో కదిలించిన శబ్దం]

మృత్యువు : ఏమిటది చెవులకు తగిలించుకుంటున్నావు?

శాస్త్రి : ఎవరెంత ధ్వని చేసినా ఇంక నాకు వినపడకుండా.

మృత్యువు : అయితే ఇప్పుడు నా మాటలు వినిపించటం లేదా?

శాస్త్రి : వినిపిస్తూనే వున్నవే!

మృత్యువు : [నవ్వి] పిచ్చివాడా! నీ యంత్రాలశక్తి మానవులవరకే పరిమితం. నా మాటలనువినకుండా వుండలేవు. ప్రపంచంలో ఏ మూలకైనా నా మాట వినిపిస్తుంది.

శాస్త్రి : ఈ యంత్రం లేకుంటే మాత్రమేమి? [—తీసివేసిన శబ్దం—] నా సంకల్ప బలం వుండనే ఉంది. ఇంక నీతో మాట్లాడను.

మృత్యువు : ఎవరికీ కన్పించనిదాన్ని, ఒక ప్రయోజనం కొరకు నీకు కన్పించాను.

శాస్త్రి : కొంపచ్చు...ఛీ! మళ్లీ మాట్లాడుతున్నానే! ఏమిటే ఆకర్షణ?

మృత్యువు : ఇది సృష్టికి ఎదురీత...

శాస్త్రి : [మౌనం]

మృత్యువు : మాట్లాడరా?......దయచేసి ఆ ప్రాణం ఇట్లా యిచ్చేస్తారా? ఎలాగూ సాధించలేని దానికోసం ఎందుకు వృథా ప్రయాస?...... ఇదుగో ఇటు చూడండి...ఒక్క మాట...సృష్టి సూత్రాలను ఉల్లంఘించటం విజ్ఞుల లక్షణం కాదు...మాట్లాడరా?...

[రెండు నిమిషాలు నిశ్శబ్దం]

శాస్త్రి : హమ్మయ్య. బతికింది. ప్రాణప్రతిష్ఠ జరిగింది.

రోగి : [మూలుగు]......అబ్బ! సం—జీ...వి... ఉందా?

మృత్యువు : అబ్బ. ఎలా అయితేనేం సాధించాడు... వస్తానండి...శెలవు......[తలుపు తెరచి మళ్లీ మూసిన శబ్దం]

శాస్త్రి : సంజీవి వెళ్లి పోయింది.

రోగి : వెళ్లిపోదే!......ఇంక యీ ప్రాణాలు ఉండి ఏంలాభం?

బయట : ఏమండీ! [తలుపు తెరచి ప్రవేశం]...... బతికాడా?

శాస్త్రి : ఆఁ బతికాడు. నువ్వెవరు?

సంజీవి : నేను సంజీవినిగానీ, ఇప్పుడు ఇంట్లోనుంచి బైటకి వెళ్లింది ఎవరండి.

శాస్త్రి : నీలాగే వుంది కదూ.

సంజీవి : అవునండీ. ఎవరంటే, మీ పెద్దక్కయ్యనుకే. నన్ను ఎరుగవులే అనుకుంటూ వెళ్ళిపోయింది. ఆనవాళ, ఆతీరు, అదో గమ్మత్తుగా ఉందండీ.

శాస్త్రి : అది దొంగసంజీవిలే. వెళ్ళింది. పీడా వదిలి పోయింది.

రోగి : సంజీవీ...ఇలారా...అవును సంజీవే. అదుగో పెండ్లికూతుర్లా తిలకంబొట్టు. ఆ బొట్టు లేనిదే సంజీవి నాదగ్గరికిరాదు.

శాస్త్రి : ఇందాకటి సంజీవికి ఆబొట్టు లేదు.

సంజీవి : అదే నాకూ ఆశ్చర్యం వేసింది.

శాస్త్రి : సరేగనీ అమ్మాయీ సమయానికి వచ్చావు. కాస్సేపు ఇక్కడ కూచుని ఆయనకు పరిచర్య చేస్తూవుండు. అవతలి గదిలో ఇంకోపని చూసుకోవాలి. సుమారు ఒక గంటసేపట్లో వస్తాను.

సంజీవి : అలాగేనండి.

శాస్త్రి : రోగిదగ్గరకుమాత్రం వెళ్ళకుండా దూరంగా కూచో. దాహంకావలిస్తే ఇవ్వు. అంతే. అనవసరంగా ఆయన్ను మాట్లాడించకు. ఆయన మాట్లాడకూడదు. కదలకూడదు. ఈ విధంగా

కనీసం మూడురోజులైనా ఉండాలి. నేను మళ్ళీ వచ్చి, ఎవరైనా ఇక్కడ ఉండే ఏర్పాటు చేస్తాను. యీలోగా ఎవరైనా పిలిచినా కూడా నువ్వు వెళ్ళకూడదు.

సంజీవి : మూడురోజులూ ఇక్కడే ఉంటాను.

శాస్త్రి : ఇంటికి వెళ్ళక్కర్లేదా?

సంజీవి : వాండగో అంతా తెగతెంపులు చేసుకునే వచ్చాను. ఇక్కడికి నన్ను వెళ్ళవద్దన్నారు మా నాన్నగారు. వెళ్ళితే మళ్ళీ ఇంటికి రావద్దన్నారు. సరేలే అని చెప్పి వచ్చేశాను.

శాస్త్రి : సరే. మంచిది. మళ్ళీ వచ్చి మాట్లాడుతాను. ఇక్కడే ఉండు.

[కాసేపు నిశ్శబ్దం]

రోగి : [—హీనస్వరం—] ఆయన వెళ్ళాడా?

సంజీవి : ఆఁ.

రోగి : మీ నాన్న వద్దన్నాడా?

సంజీవి : ఊ.........

రోగి : మరెందుకు వచ్చావ్?

సంజీవి : మాట్లాడకుండా పడుకోండి. తరువాత చెపాను.

రోగి : సంజీవి! ఆ తిలకంబొట్టు చెరిపేసుకో!

సంజీవి : అదేమిటి అలా అంటారు. ఎందుకు?

రోగి : పలకరిస్తుంటే పలకవేం మరి?

సంజీవి : ఆయన మాట్లాడవద్దని చెప్పాడు.

రోగి : ఆయన చెప్పిందే నీకు వేదం! నే నేమో వటి వెధవను?

సంజీవి : అబ్బ! ఏమిటండీ ఈ ధోరణి...ఆయన మీ రోగం కోసం ఎంత శ్రమపడ్డాడో తెలుసా? పోయిన ప్రాణాన్ని మళ్ళీ రక్షించాడు.

రోగి : ఇదుగో ఒక్కమాట చెప్తాను వింటావూ... కాలం మూడితే ఎవడూ బ్రతికించలేడు. ఆయుర్దాయం వుంటే ఎవడూ చంపనూ లేడు. నిన్ను చూస్తుంటే నాలో మళ్ళీ కొత్త సత్తువ పుట్టుకొస్తున్నట్టుంది. ఇందాకటినుంచీ ఏదో మత్తులో ఉన్నాను. ఏం జరిగిందో నాకు తెలీదు. నీవు ఇలా గదిలో అడుగు పెట్టావు. నాకు మళ్ళీ పోయిన ప్రాణం వచ్చినట్లయింది...అయితే నా ప్రాణం పోయిందంటావా?

సంజీవి: ఆఁ మళ్ళీ ఆయన ఈ దేహంలో ప్రవేశపెట్టాడు. మళ్ళీ బ్రతికించాడు.

రోగి : యమదూతలైనా కనిపించలేదే!

సంజీవి : పోనిద్దురూ ఆ గొడవ! మెదలకుండా పడుకోండి. తర్వాత మాట్లాడుదాం.

[ఒక నిముషం నిశ్శబ్దం]

రోగి : సంజీవీ! టైమెంతయింది?

సంజీవి : తొమ్మిదిన్నర.

రోగి : నువ్వొచ్చి ఎంతసేపయింది?

సంజీవి : గంట కావచ్చింది.

రోగి : అబ్బా! [బాధ]

సంజీవి : ఏమిటి మోహన్?

రోగి : గుండెలో నొప్పిగా ఉంది... అబ్బ... దాహం!...

సంజీవి : దాహం ఇవ్వనా?

రోగి : [పెద్దగా] అబ్బ!...... ఆఁ!......

సంజీవి : ఏమిట మోహన్... మోహన్... ఇదుగో. మోహన్... [ఏడుపుగా] అయ్యో! మోహన్. అయ్యో... [అడుగుల చప్పుడు]

శాస్త్రి : అమ్మాయి! ఏమిటి?

సంజీవి : మోహన్ మాట్లాడటం లేదు.

శాస్త్రి : చనిపోయాడు... అప్పుడే అనుకున్నాను. సరిగా అతకలేదని. ప్రయోగం విజయవంతం కాకపోతుందా అనుకున్నాను. అయిందనే అనుకున్నాను.

సంజీవి : మళ్ళీ నా మోహన్ నాకు దక్కాడనుకున్నాను.

శాస్త్రి : మృత్యువును జయించా ననుకున్నాను.

సంజీవి : మీరు మా పాలిటి సంజీవి అయినారనుకున్నాం.

శాస్త్రి : ఇంతకూ నీదురదృష్టం.

సంజీవి : మీ ప్రయోగం పూర్తిగా ఫలిస్తే ఎంత బాగుండేది? [ఎవరో పెద్ద నవ్వు]

శాస్త్రి : అదుగో మృత్యువు నవ్వుతున్నది.

సంజీవి : ఒకరకంగా ఇది నా అదృష్టం. నా వాళ్ళందరితో పూర్తిగా నాసంబంధం తెగతెంపులు చేసుకున్నాక ఆయనతో యీ కాస్సేపైనా మాట్లాడగలిగాను. పూర్వం ఆయనతో కలిసినప్పు

డల్లా, మావాళ్ళు కళ్ళల్లో మెదుల్తూనే ఉంటే వాళ్ళు. నిర్భయంగా, స్వేచ్ఛగా, పదినిముషాలు ఆయనతో మాట్లాడాను. నాకు అదే చాలు.

శాస్త్రి: ఒకగంటసేపు పోయిన ప్రాణాన్ని నిలిపాను. అంతవరకే మృత్యువును జయించాను అదిచాలు.

సంజీవి: అయితే చావు తప్పదా?

శాస్త్రి: ఇంకా కొన్ని ప్రయోగాలు చేస్తేనేగాని కచ్చితంగా చెప్పలేను.

[-మృత్యువు మళ్లీ నవ్వు]

శాస్త్రి: నవ్వు, నవ్వు. నీఅంతు తేలుస్తానులే. తప్పించుకుపోయావని సంతోషపడుతున్నావేమో. మానవజాతికి నీబాధ శాశ్వతంగా తప్పిస్తాను.

సంజీవి: ఎవరితో మీరు మాట్లాడేది?

శాస్త్రి: మృత్యువుతో, అదంతా ఒకకథలే. నా ప్రయోగం ఫలించలేదని దానికి నవ్వుగా ఉంది.

సంజీవి: ఇంక మోహన్ బ్రతకడా?

శాస్త్రి: ఇంకెక్కడి మోహన్.

సంజీవి: అయ్యో... మోహన్... మోహన్... నన్ను కూడా నీతో తీసుకు వెళ్ళకపోయావా మోహన్ అయ్యో... ఆకాస్సేపు మాట్లాడకుండా కూచుంటి నే... అయ్యో... మోహన్ ..

శాస్త్రి: ఊరుకో అమ్మా. ఊరుకో......[మృత్యువు నవ్వు]

[ఆలిండియా రేడియో (హైదరాబాద్) సౌజన్యంతో]

---

# కాశీఖండరచన: చరిత్రాంశములు

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీనాథుఁడు కాశీఖండమును రచింపఁబూను నాఁటి కాలని ప్రాయము కొంత కైవ్రాలినది. కవిత పలుకఁబాఱినది. ఆ తరుణమునఁ దా నీరచనకుఁ గడంగు కారణములను తదుద్బోధక సామగ్రి నిట్లు తెలిపి యున్నాఁడు:

ఆంధ్ర క్షమామండ లాఖండలుండైన
వేమభూపతి కృపావీక్షణంబు
ఘోడెరాయాంక సద్గురు రాజభీమేశ్వ
ర స్వామి పదసమారాధనంబు
కమలాద్రి నిలయ మార్కండేయ శివమౌళి
చంద్రాంశు నవసుధాసారధార
వేదాద్రి నరసింహ విపులవక్షస్థలీ
కల్హారమాలికా గంధలహరి
గారణంబులు నుద్బోధకములు గాఁగ
సంభవించిన సాహిత్యసౌష్ఠవమున
వీరభద్రేశ్వరుఁ బ్రబంధ విభునిఁ జేసి
కాశికాఖండముఁ దెనుంగు గా నొనర్తు.

—కాశీ. 1.

స్కాంద పురాణాంతర్గతమైన కాశీఖండమను పురాణఖండమును దెలుఁగుఁజేసి, తెలుఁగుదేశమునఁ బుణ్యకీర్తుల నార్జింపఁదలపెట్టిన శ్రీనాథునకు 1. అల్లయ వేమారెడ్డి కరుణాకటాక్షము, 2. వారికి గురువయిన ఘోడెరాయ భీమేశ్వరుని పాదపద్మ సమారాధనము, 3. తత్కాలదైవతమయిన మార్కండేయశివుని శిరసుమీఁది చంద్రకిరణ సుధాధార, 4. తదుపాస్యుఁడగు వేదాద్రి నృసింహస్వామి వక్షమునందలి పద్మమాలికా పరిమళలహరియుఁ గారణములు నుద్బోధకములు కాఁగా సంభవించిన సాహిత్య సౌష్ఠవముతో నీ కృతిరచనకుఁ గడఁగినాఁ డాకవి సార్వభౌముడు.

పైఁ జెప్పిన నాలుగింటిలోఁ దొలుతటి రెండు కారణములు, తరువాతి రెండు నుద్బోధకములు కాఁదగును. శ్రీనాథుఁడు రాజమహేంద్రవరమును బాలించెడి రెడ్డిరాజుల యాస్థానిలో స్థానము సంపాదింపఁదలఁచిన నాఁటికి అల్లయ వేమారెడ్డి ఆంధ్రక్షమామండలాఖండలుఁడు. కాటయ వేమారెడ్డి పాలనకాలమున అల్లాడరెడ్డి సాయమునఁ గొంతవఱకుఁ బ్రాగుత్తరముగఁ బెంపబడిన రాజమహేంద్రవర రాజ్యసీమలను సుస్థిరము చేయుటకు వానిని బెంపొందించుటకునై మఱి కొన్ని భూఖండములను 'సముద్భటనటద్ఘోటీభట ప్రౌఢిచే' నాక్రమించి వేమభూపాలుఁ డాఖండలు డైనాఁడు. ఈ విశేషమును దెలుపఁదలఁచియే శ్రీనాథుఁ 'డాఖండలుఁ'డని సార్థక విశేషణ మతికించి యున్నాఁడు. వేమారెడ్డి జయించిన దేశఖండము నిట్లు పేర్కొనినాఁడు కూడ.

కొనియెన్ గంచుకముల్
సముద్భటనటద్ఘోటీభటప్రౌఢిఁ గై
కొనియెన్ వేడుక జీడికోట
యహిత క్షోణీశు లల్లాడఁ జే
కొనియెన్ మాకవరంబు వీఁక
మదవద్వైరారి సంహారియై
ఘనుఁడల్లాడ మహేశు వేమన
నిరాఘాటైక ధాటీగతిన్.

కాశీ. 1.

కాటయ వేమునినాఁడు రాజమహేంద్రవరమున కుత్తరముగ రామగిరి దుర్గము మొదలుగఁ దూర్పుగ వీరఘట్టమువఱకు నడుమనుండిన రాజ్యసీమను కటకము వఱకును బెంచి, ఆ భూభాగమున కంతకును వీరభద్రారెడ్డినే పాలకునిగాఁ జేసి తా నింద్రవిభవముతో విరాజిల్లినవాఁడు వేమారెడ్డి ఈ విషయమును శ్రీనాథుఁ డే యిట్లు వ్యక్తము చేసి యున్నాఁడు.

నిజభుజా విక్రమంబున నిఖిలదిశలు
గెలిచి తను రాజ్యపీఠ మెక్కించినట్టి
యన్న వేమేశ్వరుని యంక మాశ్రయించి
నిండు కొలువుండెఁ గన్నుల పండువుగను.

—కాశీ. ౧

ఇట్టి కొలువుకూటమునందే కాశీఖండమును మా వీరభద్రయ్యపేర నంకితము సేయుమని యానతిచ్చి నాఁడు వేమారెడ్డి. పరాక్రమధనుఁడు కార్యశూరుఁడు నగు వేమభూపాలుని కరుణాకటాక్షము లభింపకుండిన శ్రీనాథుని కాశీఖండరచన కొనసాగి యుండెడిది కాదేమో ? అనితల్లి మూలమున సంక్రమించిన రాజమహేంద్రవర రాజ్యము పాలించుటకు వేమభూవిభుని యనుజన్ముఁ డగుటయే వీరభద్రారెడ్డికిఁ గారణమైనపుడు, అతని కాశీఖండకృతి భర్తృత్వమునకును వేమభూపాలుఁడే కారణమగుటలో వింత యేముండును ?

మఱియు వేమారెడ్డి యెంతటి పరాక్రమవంతుఁడో యంతటి ధార్మికుఁడు ; నంతకు మిక్కిలి పరమేశ్వర భక్తుఁడును. ఆ విషయమును శ్రీనాథుఁడే యిట్లు లుగ్గడించి యున్నాఁడు.

పుండరీకాసనమునఁ గూర్చుండి శంభు
నర్చనము సేయునపుడు మహాప్రమథుఁడు
చాల నొప్పారు రెండవ శంభునట్లు
వీరనారాయణుఁడు రెడ్డివేమ విభుఁడు.

—కాశీ. ౧.

వేమభూపాలుఁ డిట్టి పరమేశ్వరభక్తుఁడు కావున నే, కవితారీతి నీశ్వరార్పన కళాశీలుఁడైన శ్రీనాథున కాతఁ డాశ్రయ మొసఁగినాఁడు. శ్రీనాథుఁడు నేతన్మూలకముగ నా వేమునియెడఁ దనకుఁగల కృతజ్ఞతను తెల్లముచేసినాఁడు.

రెండవ కారణము 'ఘోడెరాయాంక భీమేశ్వర స్వామి పదసమారాధనము. ఘోడెరాయ బిరుదాంకితులైన శైవగురువులు శ్రీశైలవాసులు. వారు కొండవీటి రెడ్డిరాజుల కారాధ్యులు. ఈ ఘోడెరాయ బిరుదాంకిత శివాచార్యులు కేవలము శైవమత దీక్షా ప్రధానాచార్యులగుట మాత్రమే గాక నాఁటి రెడ్డి ప్రభువులకు రాజ్యస్థాపనాచార్యులుగఁ గూడ నెగడి యున్నారు. ఈ విషయమును కొండవీటి రెడ్డిరాజుల శాసనములు తార్కాణించుచున్నవి.[1]

శ్రీశైలవాసులైన యీ శైవాచార్యుల పరంపర లోనివాఁడు త్రిపురాంతీంద్ర గురూత్తముని కుమారుఁడగు ఘోడెరాయ భీమేశ్వరస్వామి అల్లాడరెడ్డికి, నాతని సుతులకు గురువై శ్రీశైలక్షేత్రము వదలి పట్టిస క్షేత్రమునఁ దపమాచరించుచుండెడివాఁడు. కృష్ణానదీ తీరమున శ్రీశైల మట్టి పుణ్యక్షేత్రమో, గోదావరీతీర క్షేత్రములలో పట్టిసమట్టిది. కావుననే ఘోడెరాయ భీమేశ్వరస్వామి యచటి వీరభద్రేశ్వరాలయమునఁ దపము గావించుచుండెడి వాఁడని నిశ్శంక కొమ్మనామాత్యుఁడు తన శివలీలావిలాసమునం దిట్లు స్తుతించి యున్నాఁడు.

నిపుణత్వంబునఁ బ్రస్తుతింపవలయున్ శ్రీ
వీరభద్రాచలా
గ్రపు దివ్యాతితభర్మ హర్మ్యతలజాగ్ర
ద్వీరభద్రాఖిలే
శపదాంభోరుహ భక్తి సుస్థిరరమా సంపూర్ణ
భీమేశ్వరున్
త్రిపురాంతీంద్ర గురూత్తమాత్మభవునిన్ దేవేంద్ర
కోలాహలున్.

—శివలీ. పీఠిక,

ఈ పట్టిసము శ్రీశైలాది పంచకాశీ పట్టణములలో నొక్కటియని యానాఁటి ప్రసిద్ధి. ఈ క్షేత్రము రాజమహేంద్రవరమున కుత్తరముగ నాలుగ్రోసుల మేరలో నుండినది. అచట నుండి తపముచేయు భీమేశ్వరస్వామి పదసమారాధనము చేయవలసిన వాఁడయ్యెను. కవిసార్వభౌముఁడు. దీనినిబట్టి యానాఁడు వేమ వీరభద్రారెడ్ల ప్రాపు సంపాదింపఁ దలఁచినవారికా భీమేశ్వరు నాశ్రయింపవలసి వచ్చుచుండెననుట తెల్లమగుచున్నది. అట్టి విషయమున శ్రీనాథుఁడు కడు నేర్పరిగదా !

ఘోడెరాయ భీమేశ్వరుఁడును వట్టి శైవాచార్యుఁడుగాక 'రాయగురు పరమేశ్వర, సాధుజన విధేయ, ఘోడెరాయ, సకల కళాధామాది బిరుద భాస్వరుఁడు. అల్లాడ రెడ్డియు, తత్పుత్రులును భీమయ గురువరేణ్య పుణ్యకారుణ్య వీక్షాలబ్ధ సుస్థిరైశ్వర్య ధుర్యులు. అట్టి గురువు నాశ్రయింపకుండ శ్రీనాథునకు రాజమహేంద్రవరమున రాజాశ్రయము లభించుటెట్లు ? ఈ భీమేశ్వర గురువును మెప్పించుటకే కాఁబోలు శ్రీనాథుఁడు కాశీఖండము తృతీయాశ్వాసములో, సంస్కృత మూలమునందు పట్టిస క్షేత్ర ప్రసక్తి యేపాటియు లేకుండినను, అవకాశము నెట్టులో కల్పించుకొని, అగస్త్యుని యాంధ్రదేశయాత్రను పట్టిస శ్రీ వీరభద్రేశ్వరుని దర్శనముతో నారంభింపఁజేసి,

1. See Epi. Ind., Vol VIII Madras Museum Plates of Annavema.

భీమమండల మంతయుఁ ద్రిప్పి, తిరిగి పట్టణమునకుఁ గొనితెచ్చి, యావటి వైభవము నైదు పద్యములలోఁ జిత్రముగఁ జిత్రించి, యామాని నటనుండి కొల్లాపురమునకుఁ బంపినాఁడు.

శ్రీనాథుఁడీ భీమేశ్వరుని 'సద్గురు'డని కొనియాడుటచే నీతనియందొక విశిష్టత యుండినట్లు తేలవచ్చును. కావుననే యీ గురువరేణ్యుని పద సమారాధనంబు తన కాశీఖండ రచనమునకుఁ గారణ సామగ్రినిగాఁ దెలిపియున్నాఁడు. ఈ గురువరేణ్యుఁడును శివభక్తుఁడే. కావున శ్రీనాథుని రచనమునకుఁ దగిన ప్రోత్సాహము నొసఁగి, వేముని యాస్థానమునందుఁ గవిసార్వభౌమునకు స్థానమునిప్పించి యుండవచ్చును.

ఇఁక నుద్బోధక సామగ్రికిఁ జెందినవి రెండు. అందు మొదటిది కమలాద్రి నిలయుఁడైన మార్కండేయ శివుని శిరసుమీఁది చంద్రుని కిరణ సుధాధార. ఈ మార్కండేయ శివమౌళి రాజమహేంద్రవర రాజ్యపాలకుల కిలవేల్పు. ఆ విషయమును శ్రీనాథుఁ డిట్లు వివరించియున్నాఁడు.

శ్రీ మార్కండేయేశ
స్వామికృపా లబ్ధధరణి సామ్రాజ్యరమా...
—కాశీ. ౧.

ఈశ్వరుఁ డింటివేల్పు జగదేక గురుండగు
ఘోడెరాయ భీ
మేశ్వరుఁ డాత్మవంశ గురుఁడు......
—కాశీ ౧,

ఈ తీరుగఁ బద్మగిరి వాసుఁడైన మార్కండేయ శివుఁడు వేమవీరభద్రారెడ్లకింటివేల్పగుటయే గాక, ఆ శివుని కృపవలననే యా ప్రభువు లాయురైశ్వర్యములు చేకొనుచుండెనని వారనిషూఁ దెలిపియున్నాఁడు.

మార్కండేయ మహేశ్వరుం డఖిల సా
మ్రాజ్యంబు పాలింపఁ జం
ద్రార్కుల్గల యంతకాలము తది
యాంఘ్రిద్వయీ భక్తి సం
పర్కం బెంచిత భాగ్యసంపదల వా
క్ష్మామండలీవల్లభుల్
కోర్కుల్మించఁగ సేవకత్వమునఁ
గైకొంద్రాయురైశ్వర్యముల్.
—కాశీ. ౧.

మార్కండేయ శివునిపై వేమ వీరభద్రారెడ్లకంతటి శ్రద్ధాభక్తు లేర్పడి యుండినటులీ పద్యమే చాటుచున్నది. మార్కండేయ శివమౌళి వారికే కాదు. శ్రీనాథునకును భక్తిభావారాధ్యుఁడే. కావున నా శశిశేఖరుని స్మరించుచు, తన్మౌళి చంద్రసుధా పారధార తన సాహిత్య సౌష్ఠవ సంభావన కుద్బోధక సామగ్రినిగాఁ జేర్కొనినాఁడు శ్రీనాథుఁడు చంద్రశేఖర పాదారవింద భక్తుఁడు. కావునఁ దన కవితాధారకు శివమౌళి శశి సుధాధార తోడ్పడినచోఁ గవితలో సుధామాధురి జాలువాఱును. అట్టి సుధా సంపర్కమునఁ గవితకు, తత్కవితా రసాస్వాదులకు నెంత మధురత్వము లభించును. ఆ విషయమును స్ఫురింపఁజేయుటకిట్టి యుద్బోధక సామగ్రిని జతఁగూర్చినాఁడు. ఈ సందర్భమున శ్రీనాథునకుఁ దన నుపాస్యుఁడైన పరమేశ్వరుని స్మరించుట, వేమ వీరభద్రారెడ్ల యింటివేల్పు ప్రభావము నుగ్గడించుటయును ద్వివిధ ప్రయోజనములు సిద్ధించినవి.

ఇఁక రెండవ యుద్బోధక సామగ్రి 'వేదాద్రి నరసింహ విపుల వక్షస్స్థలీ కల్హారమాలికా గంధలహరి.' శ్రీనాథుఁడీ పద్యమున స్మరించిన 'వేదాద్రి' యనునదేది? ఇది వివాదగ్రస్తమైన విషయము. దీనినిగూర్చి విమర్శకులు పలువిధములగు వికల్పములు చేసియున్నారు. వారిలో కీ. శే. చిలుకూరి వీరభద్రరావుగారు తాము రచించిన 'శ్రీనాథ కవి' యను గ్రంథమునందు, "ఆంధ్ర క్ష్మా మండలాఖండలుండు......" ఇత్యాది పద్యమునందలి వేదాద్రిని గూర్చి ప్రసంగించుచు నీ క్రిందివిధముగ నొడివియున్నారు. "పై పద్యములోఁ జేర్కొనఁబడిన వేమారెడ్డి కృతిపతిని సింహాసనమెక్కించిన యన్న; భీమేశ్వరస్వామి కృతిపతి కులగురువు; కమలాద్రి నిలయుఁడైన మార్కండేయ శివుఁడును వేదాద్రి నరసింహుఁడును ననుదినము కృతిపతిచేఁ గొలువఁబడెడి దేవులు. కమలాద్రియు వేదాద్రియు పుష్పగిరియు శేషాద్రి మొదలగునవి రాజమహేంద్రవరములో గోదావరీ తీరస్థలములై యున్న మిట్టలకు నామములు. శ్రీనాథుఁడు ప్రశంసించిన వేదాద్రి కుప్పుస్వామయ్యగారు పేర్కొన్న హైదరాబాదు సీమలోని వేదాద్రియుఁ గాదు." అని నిష్కర్ష చేసియున్నారు[2]. దీనినిబట్టి వేదాద్రి యనునది హైదరాబాదు సీమలోని రాచకొండ సమీపమునందలి

2. చూ. శ్రీనాథ కవి. పుట. ౫౬. ౫౭.

వేదాద్రి కాదనియు, రాజమహేంద్రవరము నందలి యొక తాలిగుటకే యీ పేరుండియుండవలెనని వీరభద్ర రావుగా రూహించియున్నారు.

ఇట్లనే కృష్ణానదీ తీరమున జగ్గయ్యపేటకు సమీపమునందున్న 'వేదాద్రి' అనుటయుం బొసంగకున్నది. ఒకప్పుడు శ్రీనాథుఁడు కొండవీటియందుండిన కారణమున నా వేదాద్రి నృసింహుని స్మరించెనని యనుకొనుటకును వలనుపడకున్నది. కాశీఖండ కృత్యాదికి సంబంధించిన చారిత్రికాంశములన్నియు, వేమ వీరభద్రారెడ్లకు, వారి తండ్రి మామలయిన అల్లాడ రెడ్డి కాటయ వేమారెడ్లకు, వారి యర్థాంగినులకు సంబంధించునదియే గాని కొండవీటిని స్పృశించునట్టి దేపాటియును లేదు.

ఇదియును గాక "ఆంధ్రక్షమామండల ఖండ లాఖలుండు......" ఇత్యాది పై సీసపద్యమునందలి మూఁడు పాదములందలి విషయము రాజమహేంద్రవరమునకు సంబంధించి గోదావరీ తీరమునంటియుండ, నాల్గవపాదమునందలి విషయము గోదావరిని విడి కృష్ణానదికేల్లు పోవును? శ్రీనాథుఁడట్లు ప్రక్రమ భంగము చేయు పరిపాటి గలవాఁడుఁ గాఁడు. తిన్ననై నీ నాల్గవపాదమునఁ జెప్పఁబడిన వేదాద్రియు గోదావరీనదితో సంబంధము గలిగి, వేమ వీరభద్రారెడ్ల కుటుంబమువారి కుపాస్యుఁడైన నృసింహస్వామి గలిగిన యద్రియేదియో నొకటి గావలయును. ఇట్టి యూహతో నేఁజేసిన పరిశోధనఁబట్టి, నాకుఁ బొడమిన యూహల నాధారముగాఁ గొని, 'వేదాద్రి' యనఁగా రాజమహేంద్రవరమున కుత్తరముగా నాలు క్రోసుల మేరలో నుండిన 'కోరుకొండ' యనియు, తద్వాసి నరసింహస్వామిని శ్రీనాథుఁ డీ పద్యమున స్మరించి యుండెననియు నిరూపించుచున్నాఁడను.

రాజమహేంద్రవరమున కుత్తరముగ, గోదావరీ నదికిఁ దూర్పుగ మూఁడు క్రోసుల మేరలోనుండిన 'కోరుకొండ' యను కొండకు 'వేదాద్రి' యను నామముండినట్లును, అచటి నృసింహస్వామికి వేదాద్రి నరసింహస్వామి యను పేరుండినట్లును స్థానిక చరిత్రలందును కాటయ వేముని స్థానిక శాసనములందును రూఢమైయున్నది. అక్రమ మిట వివరింతును—

మెకంజీదొర సంకలన చేయించియుంచిన స్థానిక చరిత్రములలో నిడుదవోలు కోట కైఫీయతులో నీవిధముగ నున్నది, "శకవర్షంబులు 1327 అగు నేటి తారణ సం॥ పుష్య బ ౧౦ గురువారము నాటి మకరసంక్రాంతి పుణ్యకాలమునందు కాటయ వేమారెడ్డింగారు తమ కులస్వామి అయిన కొమరగిరి రెడ్డింగారికి సుకృతం అవునట్టుగాను యీ చాళుక్య భీమవరమునకు పశ్చిమం మూడు ఆమడ దూరమునమున్న మధురపూడి అనే గ్రామమునకు కొమరగిరి పురమనే నామముంచి, అది అగ్రహారంగాను శ్రీ వేదాద్రి నరసింహులుకి అనగా (కోరుకొండ నరసింహస్వామికి) ఆచంద్రార్క స్థాయిగా నడపవలెనని ధారవోసి సమర్పణ చేసినారు. యిందుకు శిలాశాసనం యిప్పుడు పిఠాపురం తాలూకాలో మాంజి మధురపూడి గ్రామానికి చెరువు లోతట్టున పాతివున్నది."

ఈ విషయమే కోరుకొండ కైఫీయతునందుఁ గూడ వ్రాయఁబడి యున్నది "యిదిగాక వేమారెడ్డి గారు కోరుకొండ పటణమునకు నైరృతి భాగమునందు మూడు క్రోసుల దూరమున వున్న తొర్రేడు అను గ్రామము క్రింద మజరా పల్లి మధిరపూడి అనే పల్లెకు వేమారెడ్డిగారు తమస్వామి కొమరగిరి రెడ్డిగారి పేరిట ఆపల్లెకు కొమరగిరిపురం అనే పేరువుంచి గ్రామం శ్రీ వేదాద్రి నరసింహదేవరకు భోగ రాగాదులకుగాను సమర్పణం చేసి, శాలివాహనశక వరుషములు ౧౩౨౬ అగు నేటి తారణ సం॥ పుష్య బ ౧౦ గురువారం నాడు A. D. 1404 మకర సంక్రాంతి పుణ్య కాలమందున శిలాశాసనం వ్రాయించినారు."

ఈ రెండు కైఫీయతులలో నుదాహరింపబడిన యీ శాసనమును ఈ స్థానిక చరిత్రనుండియే యుద్ధరించి, శ్రీ డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు ఆంధ్రేతిహాస పరిశోధక మండలి ప్రకటించిన రెడ్డి సంచికలో రెడ్డిరాజుల అజ్ఞాత శాసనములు అను శీర్షికలో ప్రకటించి యున్నారు. ఆ శాసన స్వరూపమిది—

"పిఠాపురం తాలూకా పెకి మ॥ తొర్రేడు గ్రామం క్రింద మధిరపూడికి దక్షిణభాగం చెరువు లోతట్టున పాతివున్న శిలాశాసనం సకల-స్వస్తిశ్రీ శక వర్షంబులు ౧౩౨౬ అగు నేటి తారణ సంవత్సర పుష్య బ॥ ౧౦ గురువారం నాటి మకర సంక్రాంతి పుణ్యకాలమునందు కాటమరెడ్డి వేమారెడ్డిగారు తమకుల స్వామి అయిన కొమరగిరి రెడ్డిగారికి అక్షయ సుకృతమౌనట్టుగాను మధురపూడి కొమరగిరి వరదుని పేరను వేదాద్రి శ్రీ నరసింహదేవరకు ఆ చంద్రార్క స్థాయిగా ధారవోసి సమర్పణచేసిరి. మంగళమహా శ్రీ"[3].

ఈ శాసనమును బట్టియు, స్థానిక చరిత్రలందుదాహరించిన విషయమును బట్టియు, కాటయ వేమారెడ్డి పాలన సమయమున కోరుకొండ నరసింహస్వామికి వేదాద్రి నరసింహస్వామియను పేరుండినట్లు తెలియవచ్చుచున్నది.

---

3 మా. రెడ్డి సంచిక. పుట, ౨౩౩.

మఱియు నీకోర్కొండ నృసింహస్వామి కొమరగిరి వరదుఁడను విషయము, కాటయ వేముఁడు కోర్కొండ నృసింహస్వామి ప్రీతికొఱకు తొర్రేడు గ్రామమును చిఱుకుల మాధవవిద్వాంసునకు దానము చేసినప్పటి శాసనమున నిరూపింపఁబడి యున్నది. ఆశాసన శ్లోకమిది-

శ్లో. శ్రీకోర్కొండ పతిర్మహోత్పల
గదాశంఖాది భృద్రక్షకః
శ్రీలక్ష్మీ నరసింహ నామ హరి
ర్భక్తాభి వేష్టప్రదః
వామాంకస్థ రమా ప్రతీత విభవః
పద్మాసనస్థో జగ
న్నాథః శ్రీ కొమరాద్రి రెడ్డి
జననాభీష్టో జయత్యచ్యుతః

పైరేఖాంకిత స్థలములలో 'భక్తాభివేష్ట, జననాభీష్టో' అని చదువుకొనిన సరిపడును. ఈ తొర్రేడు మధిరపూడి గ్రామములు రెండును. కోరుకొండకు దక్షిణ గ్రామములగుట, వేమారెడ్డి యా రెండు గ్రామముల నా నృసింహస్వామి ప్రీతికొఱకు దానము చేయుట, ఆశాసనములోని నృసింహస్వామి శ్రీ వేదాద్రి నరసింహస్వామి యని పేర్కొనఁబడుటచే, శ్రీనాథుఁడు కాశీఖండమునఁ బేర్కొనిన వేదాద్రి నరసింహస్వామి యితఁడే యనుకొనఁదగి యున్నది.

ఇంతియగాక రాజమహేంద్రవర రాజ్యపాలకులైన కాటయ వేమాది రెడ్డిరాజుల కుపాస్యుఁడైన వేదాద్రి నరసింహస్వామి కోరుకొండ నరసింహస్వామియే యను విషయమును కాటయ వేముఁడు అహోబల నృసింహస్వామి యాలయమున నెలకొల్పిన శిలాశాసనము నందలి యీక్రింది వాక్యములు ప్రమాణీకరించుచున్నవి. ఆ శాసనమునకుఁ బ్రారంభమిది—

"స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౩౩౨ అగు నేంటి వికృతి సంవత్సర మార్గశిర శు॥ ౧౫ గురువారానను శ్రీ అహోబలదేవర నిత్యఅవసరానకు కాటమరెడ్డి వేమారెడ్డింగారు కలువచేరు కొమరగిరిపురమని ధారవోసి సమర్పణ చేసిరి"4.

ఈ యహోబల నృసింహస్వామి కర్పించిన కలువచేరు గ్రామముకూడ కోరుకొండకు సమీపమునందుండినదియే కావొపును

ఈ తరువాత నీశాసనములో కాటయ వేముఁడు గోదావరీ మండలమున దానము చేసిన గ్రామములన్నియు 'కొమరగిరి మండలం' అను పేరఁ బేర్కొనఁ బడినవి. వానిలో నీమధిరపూడియు 'శ్రీ వేదాద్రి నరసింహదేవర కొమరగిరి పురం' అని పేర్కొనఁబడినది.

ఈ శాసనమునందలి తుది వాక్యములివి—

"కాటయ వేమారెడ్డింగారికి అర్ధాంగలక్ష్మి ఐన ఆ కొమరగిరఅయ్యంగారే ఇ కొమరగిరయ్యంగారె అవతరించిన ఇ [కొ] మరగిరయ్యంగారికి తల్లింగారైన తల్లి సావమ్మంగారు ఇ కొమరగిరయ్యంగారికి [న్ని] కాటమరెడ్డి వేమారెడ్డిగారికిన్ని సకృతము గాను శ్రీ గౌతమీ తీరమందును వేదాద్రి శ్రీ నరసిహ్యదేవరకు ఆచంద్రార్కము ప్రతి సంవత్సర తిరునాళ్ళ మహోత్సవానకు ధారవోసి సమర్పణసేసిన వెలమారితల్లవరము."

గౌతమీ తీరమునందుండిన వేదాద్రి నృసింహస్వామి కోర్కొండ నృసింహస్వామియే కావలయును. ఈ స్వామి తిరునాళ్ళ మహోత్సవమునకు ధారవోసిన వెలమారి తల్లవరము అనునది, ఏదియగునో? యను విషయమునుగూర్చి నడచిన సెప్టెంబరునెల భారతిలో నొక వ్యాసము వ్రాసియుంటిని5 ఈతలవరము అను గ్రామము, ఈ శాసనమునందును, అల్లయ వేమారెడ్డి వేమవర శాసనమునందును పేర్కొనఁబడినది. ఈ తల్లాంబిక కాటయ వేమునకు భార్యయగుటచే, అల్లాడ వేమారెడ్డికి అత్తగారు కూడా కావలసియుండునట్లు తోచును. ఈ తల్లవరము అల్లయ వేముని వేమవరమునకు, అనఁగా రామచంద్రపురము తాలూకా వెదురుపాకకు ఆగ్నేయముగ పసలపూడికి ఈశాన్యముగను, రామచంద్రపురమున కుత్తరముగను నుండియుండవలయును. అనపర్తి మొదలుగ నీ తల్లవరము వఱకు నడుమనుండిన తుల్యభాగా తీర భూభాగమంతయు, కాటయ వేముఁడు తత్సంబంధ బాంధవులు నగ్రహారములుగ ధారవోసిన వగుటచే, నీ తల్లవరముకూడ నట్టిదియేయై యుండి, వేదాద్రి నృసింహస్వామి కోర్కొండ నరసింహస్వామి యగుటను సమర్థించుచున్నది.

ఈ నృసింహస్వామిని శ్రీనాథుఁడు పేర్కొనుట కాటయ వేముని తృప్తికొఱకో, లేక తల్లాంబిక తృప్తికొఱకో లేక వేమారెడ్డి భార్యయగు హరిహరాంబిక తృప్తికొఱకో యై యుండునని పించుచున్నది మఱియు నీ కోర్కొండ నృసింహస్వామికి వేదాద్రి నృసింహస్వామియను పేరుండినటులు మఱియొక నిదర్శనము గాన వచ్చుచున్నది. కోర్కొండ గ్రామ వాసులైన వైష్ణవులలోఁ గొందఱకు నామకరణము చేసిన పేరు నరసింహాచార్యులైనను 'వేదాద్రి' యనునది యుపనామముగా వెలయుచున్నది. కావున శ్రీనాథుఁడు కాటయ వేమాదుల కుపాస్యుఁడైన శ్రీ వేదాద్రి నృసింహస్వామిని సంస్మరించి, తద్విభుల వక్షఃస్థలీకల్హారమాలికాగంధలహరిని తన సాహిత్య సౌష్ఠవమున కుద్బోధక సామగ్రిగాఁ దెలిపియున్నాఁడు.

4. see. S. I .I. Vol X No 577.

5. ద్రష్టవ్య భారతి 1957 సెప్టెంబరు [సంపుటము 34 సంచిక 9]

# ఇక సెలవు

## శ్రీ పుల్లాభట్ల నాని

ఆ రాత్రి ఆకాశంలో మేఘాలు దట్టంగా క్రమ్ముకున్నాయి. మధ్య మధ్య ఉరుముల ధ్వనులు భయంకరంగా వినిపిస్తున్నాయి. అగ్నికి ఆజ్యంలా చల్లని రొజ్జగాలి దీనికి తోడైంది. సాధారణంగా అటువంటి వాతావరణంలో ఎవరూ బయటకు రావటానికి సాహసించరు. ప్రకాశంమాత్రం పెరటిలో వాలుకుర్చీమీఁద కూర్చొని దెయ్యాల్లా తిరుగుతున్న మేఘాలను పరికిస్తున్నాడు. చల్లగాలి బాగా పట్టడానికి అతను చొక్కాగాని, బనియనుగాని తొడుగుకోలేదు. ఆ విధంగానైనా తన ఉడుకు గుండెకు ఉపశమనం కలుగుతుందని అతని భావన.

జీవితమంటేనే, నేడతనికి అసహ్యం వేసింది. నాఁటి అతని ఏకాంతవాసమే దానికి కారణం. అప్పుడే మానవునికి విషాదకరమైన విషయాలన్నీ జ్ఞప్తికి వస్తాయి. అటువంటి తరుణాల్లోనే మానసికంగా గాయపడతాడు.

ప్రకాశం ద్వితీయ ప్రపంచసంగ్రామంలో ఘోరముగా పోరాడిన యోధుఁడు. అతను మిత్రమండలి సేనావాహినిలో ఎన్నికవడసిన వీరుడుగా వివిధ దేశాలను తిరిగేడు. ఐదు సంవత్సరములు, నిమిషం నిలకడలేని ప్రమాదకరమైన జీవితాన్ని గడిపి యుద్ధం పరిసమాప్తి కాఁగానే అధికారుల అనుమతిని స్వీకరించి స్వస్థలానికి తిరిగి వచ్చేడు.

ఒకప్పుడు మేటి వీరుఁడైన ప్రకాశం నేడు ఒక గుమస్తాగా పనిచేస్తున్నాడు. ఈ నాడు అతను తన యింటిలో గోడలు తప్ప మరి ఓదార్చేవారులేని నిర్భాగ్యుఁడు.

తనకు తండ్రి యెవరో గుర్తుపట్టఁగల యీడు రాకుండానే పేరయ్య చనిపోయేడు. పేరయ్య చాలా బీదకుటుంబీకుఁడు. బంట్రోతు పనిచేస్తూ ఉండేవాడు. పేరయ్య ఒక యేడాదిపాటు తీవ్రమైన వ్యాధితో మంచంపట్టి ఒకనాడు జన్మను చాలించేడు. అతని జబ్బు నయమౌతుందనే ఆశతో పోలమ్మ తన శరీరముపై ఉన్న బంగారం కాస్తా అమ్మి మందులకూ మాకులకూ ఖర్చు చేసింది. ఆఖరికి ఫలితం దక్కలేదు. ఆమె గొల్లుమంది. హృదయం పగిలేటట్లు విలపించింది. ధైర్యాన్నంతా కోల్పోయింది. కాని అద్దాలలో ఉన్న రెండేళ్ళ బిడ్డనుచూసి ఆమె గుండె దిటవుచేసికోక తప్పలేదు.

ప్రకాశం అచ్చు పేరయ్యరూపే అని ఆమె మురిసిపోయేది. పేరయ్యకు ప్రకాశం అంటే విపరీతమైన అభిమానం ఉండేది. పాపం! తీరా ప్రకాశానికి ఏడాది నిండేసరికి పేరయ్య మంచం ఎక్కేడు. ఈలోగానే రెండు జర్మన్ బొమ్మలు, ఒక బఫూన్‌టోపీ, ఉయ్యాలామంచమూ ఇలాటివేవో ఒకటీరెండూ కొని తెచ్చేడు.

పోలమ్మకి ఆ నాడు తనభర్తకు ప్రకాశంమీదగల వ్యామోహం జ్ఞప్తికి వచ్చింది. తనహృదయములో నుంచి పుత్రవాత్సల్యము కట్టుతెగి ప్రవహించింది. అందుకే ఆమె ఆత్మహత్య చేసుకోవాలనే ప్రయత్నం విరమించుకుంది. ప్రకాశరావుని పెంచి పెద్దచేసే బాధ్యతను తన భుజస్కంధములపై ధైర్యంగా వేసుకోగలిగింది.

ఆనాటినుండి పోలమ్మ మరి నవ్వలేదు. ఎప్పుడో ప్రకాశం పెద్దవాడయి తనను నవ్విస్తాడని భావించింది. అప్పటిదాకా తను నవ్వలేననుకుంది. ఆమె ఆ పల్లెటూరి భోజనశాలలోనే వంటపుట్టిగా ప్రవేశించింది. అక్కడ ఇంత భోజనం చేసి వచ్చే అల్ప వేతనంతో ప్రకాశానికి ముద్దు ముచ్చటలుతీరుస్తూ భారంగా కాలం గడిపింది.

ప్రకాశం క్రమముగా ప్రాజ్ఞుఁడై స్కూలుఫైనలు పరీక్షలో కృతార్థుఁడయేడు. తరువాత చుట్టుపట్లనున్న నగరాలన్నీ ఉద్యోగార్థియై గాలించేడు. ఉద్యోగం దొరకడం అతనికి సమస్య అయింది.

ప్రకాశం ఒకవంక తల్లిచేసే నీచమైన సేవావృత్తి చూసి సహించలేకపోయేడు. మరొకవైపు తను చిల్లిగవ్వను సంపాదించలేకపోయేడు. ఇఁక చేసేది, ఏమీలేక తనుగూడా ఒక హోటలులో సర్వరుగా పనిచేస్తూ నీరసంగా కాలం గడుపుతున్నాడు.

ఈవిధంగా మాతాపుత్రులు జీవిస్తూఉండఁగా ఒకనాడు ప్రకాశం తీవ్రమైన ఆలోచనలో మునిగిపోయేడు. రాఁబోయే మాతృవియోగాన్ని స్మరించుకుని ఖేదపడ్డాడు. అతని కన్నులవెంట అశ్రువులు

రాలేయి. ఏమైనా ఆతను తన మనోభావాలను నిగ్రహించుకుని అంతర్ధానమయేడు.

“ఆనాటికీ, ఈనాటికీ ఏడు సంవత్సరాల అంతరముంది.” అనుకున్నాడు ప్రకాశం. తను మిలటరీ జీవితాన్ని విరమించుకునే నాఁటికి రెండేండ్లయింది.

స్వస్థలాన్ని చేరుకున్నాక ప్రకాశానికి పోలమ్మ దర్శనం మాత్రం కాలేదు. పోలమ్మ ప్రకాశం యుద్ధం నుండి తిరిగి రాకుండానే చనిపోయింది. ప్రకాశం పెద్దవాఁడయేడు. ప్రయోజకుఁ డనిపించుకున్నాడు. కాని పోలమ్మ నవ్వవలసిన సమయం రాకుండానే ఎగిరిపోయింది.

ప్రకాశం తిరిగిరాఁగానే పోలమ్మ మరణవార్తను విని నిలువునా నీరైపోయేడు. వెక్కి వెక్కి ఏడ్చేడు. కొంతసేపుపోయేక గాని తను ఏడుస్తూన్న సంగతి తనకే తెలిసిందికాదు. తరువాత తను వీరుఁడనన్న సంగతి జ్ఞప్తికి తెచ్చుకొని పొంగిపొరలేదుఃఖాన్ని అతికష్టం మీద తమాయించుకున్నాడు.

అప్పుడు ప్రకాశం ఎందుకు అంతలాగ విలపించేడో యీ నిమిషంలో పరీక్షించుకున్నాడు. రెండు సంవత్సరాల క్రింద తను అనుభవించిన వేదనను ఈ రాత్రి పరిశీలించేడు. తను సంతాపాన్ని సూచించటానికి అర్హుడా! కాదా! అనే విషయాన్ని వితర్కించుకోఁదలఁచేడు. నేఁడు అతనియొక్క యోజనలకు పైని ఉరుములు కాని, చలిగాలికాని అంతరాయాన్ని కలించలేదు. ప్రకాశం తనభావాలో తనే లీనమై పరిసర వాతావరణాన్ని సర్వస్వాన్నీ మఱచిపోయేడు.

సమరభూమిలో లెక్కలేని మానవ కళేబరముల మీదనుంచి తను పురోగమిస్తున్నపుడు తను కించిత్తైనా చలించేడా అంటే, లేదు. కాని వృద్ధురాలైన తనతల్లి మరణించి నందుకు చంటిపిల్లవాఁడిలాగ ఏడ్చేడు. తను ఏకాకినయ్యేనని గుండె బాదుకున్నాడు.

ఐతే! తనకు తల్లి మరణించిందని తెలిసి ఏడుస్తున్నపుడైనా ఈవిషయం జ్ఞాపకం వచ్చిందా! పోలమ్మ యింతో అంతో ముసలిదయింది. ఆమెకు ఆయువుచెలి మరణించింది. అంతేగాని ఎవరూ కొట్టలేదు. బలవంతాన చంపలేదు. పైఁగా ఆమెమీఁద ఆధారపడేవారు ఇంట్లో ఎవరున్నారు?

మరి యుద్ధంలో చనిపోయినవారో! వారిని చిరంజీవులుగా ఎంతమంది ఆతృతతో యిళ్లనుండి దీవిస్తున్నారో! ఎంతమంది వారిపై ఆధారపడి ఉన్నారో కదా!

యుద్ధంలో ఎంతమంది డాం! అని గుండు దెబ్బకు గురికావటం తను చూసేడు. వారు భూమికి ఒరుగుతూ ఎంతబాధ ననుభవించేరో! ఆ నిమిష కాలంలోనే హా! సర్వేశ్వరా! ఇఁక నేపోతున్నాను. ఇంటి దగ్గర నాభార్య అమాయకురాలు. చంటిపిల్లలు. పెళ్ళియీడు చెల్లెలు, చదువుకుంటూన్న తమ్ములు వీరందరికీ యిటుపై నెవరుదిక్కు! ఎవరు దిక్కు? అనే యోచనలు వారి బుర్రలలో గిర్రున తిరుగుతాయి వారు తాము మరణిస్తున్నామనే భయంకంటె తమ కుటుంబాలకు సంప్రాప్తమవుతూన్న దుస్థితినిగూర్చి ఆ నిమిషం వాపోయి అస్తమిస్తారు.

మానవజీవితపరిభ్రమణం ఎంత విచిత్రంగా ఉంటుంది! ఏవిధంగా చూసినా మానవుఁడు మరణానికి గురికాక తప్పదు. అలాఁటప్పుడు ఒకరిని ఇంకొకరు చంపుకుని ఎప్పుడో రానున్న వినాశానికి ఇప్పుడే స్వాగతమిచ్చి పున్నమివెన్నెలల వంటి జీవితాలను నిర్ధూమధామం ఎందుకు చేసుకోవాలి? ఈ దేశాల స్పర్ధ లెందుకు; దేశములు పరస్పరము పోట్లాడి ఈ విధ్వంసానికి ఎందుకు దోహదము చేయాలి? అనుకున్నాడు ప్రకాశం.

ప్రకాశం తనతల్లి గతించినప్పుడు ఏడ్చేడు. కాని ఈనాడు అలాగ ఏడ్వడం తనకు భావ్యం కాదనుకున్నాడు. దొంగ ఇంటిలో దొంగతనం జరిగినప్పుడు దొంగ పురరక్షకునికి ఫిర్యాదుచేస్తే ఏమి భావ్యంగా ఉంటుంది? తను ఎంతోమంది మనుష్యులను కాల్చి చంపేడు అనేకమంది మృతజీవులను యుద్ధభూముల్లో చూసేడు. అప్పుడు తనలో ఈ జాలి కరుణ, అవీ యేమయేయి? ఎక్కడ దాఁగున్నాయి?

ప్రకాశం నవ్వుకున్నాడు. మరణం సర్వజీవసామాన్యమైనది. అది రావలసి వచ్చినప్పుడు ఎవరేమి చేయఁగలరు. ఎప్పుడో యముఁడు తన పాశాన్ని వేయవలసిన వారిమీఁద వదలుతూనే ఉంటాడు. ప్రతిజీవి దానికి లొంగిపోవలసిందే.

ఇంతమాత్రంలో మానవుఁడు స్వార్థాన్ని పెంచుకుంటున్నాడు. దేశాలు ఒకదానితో ఒకటి పెనుగులాడుతున్నాయి. సమరకేళిల్లో మానవులు శలభాల్లాగ పడి నుసి అవుతున్నారు.

ఇఁక మానవుఁడు నీతిని కోల్పోయి చేసే దౌర్జన్యాలకు అంతూ పంతూ ఉండటం లేదు. అలాఁటి ఘాతుక చర్యలను కప్పిపుచ్చేందుకు అంతకంటె ఘోరాలను ఆచరిస్తాడు. ఇదంతా సంఘంలో మానవుని దుస్థితికి కారణభూతమౌతుంది.

# ఇక సెలవు

ఇలా ప్రకాశం గతించిన తన చరిత్రలోని పుటలను తిరగవేసి పరిశీలిస్తూ నిద్రపోవుటకు ప్రయత్నిస్తున్నాడు. కాని అతనికి నిద్రపట్టే సూచనలేవీ కనుపించలేదు. అందుచేత లేచిపోయినవాడు మళ్ళీ కుర్చీలోనే కూలబడి యింకా ఏవో పాతగతులను పిచ్చి పిచ్చిగా పునశ్చరణ చేసికున్నాడు.

కొంచెంసేపు ఆలోచనలతో గడిపి అతను గంభీరంగా ఒకసారి నవ్వేడు. తరువాత తనలో తనే అనుకున్నాడు.

"ప్రకాశం మాత్రం ఎవ్వరికీ పల్లెత్తు ఉపకారం చేయలేదు. పైగా ఒక అద్దదశ మారణహోమం చేసేడు. అయినా వానిలోని దౌర్భాగ్యాన్ని వాడు గుర్తించుకోలేదు సరికదా పైవారి కరుణా స్వభావాన్ని అర్థిస్తాడు. సంఘం వాడికీ, వాడి బంధువులకీ ఉపకారం చేయాలని ఆకాంక్షిస్తాడు. వాడికి గలిగిన విషాదాన్నే గుర్తించుకోగలడు. ఇతరుల బాధామయ గాథలను గూర్చి విచారించే శక్తి వాడికి అవగింజంత పరిమాణమైనా లేదు" అనుకుని ప్రకాశం మరొకసారి గట్టిగా నవ్వి, ఉండిఉండి కలవరిస్తూ అలాగ కుర్చీలోనే ఎప్పుడో గాఢంగా నిద్రపోయేడు.

మరునాడు ఉదయం ప్రకాశం ప్రశాంతంగా లేచేడు. అతని హృదయం తొలినాటికన్నా చాలా తేలిక అయింది. కారణం ఏమీ లేదు. తన భావాలు మారేయి. అతని దృక్పథం వేరయింది. అందరూ తెలిసికూడా ఆచరించని ఒక నగ్నసత్యాన్ని మనస్ఫూర్తిగా ఆచరించ సంకల్పించేడు. ఆ నిశ్చయంతో రక్తకాంతులను స్ఫుటీకరించే ప్రకాశం నయనాలు నిర్మలదయార్ద్రహృదయాన్ని ప్రతిబింబించే అద్దాలుగా మారేయి. అతని మొగంలోనూ, ప్రవర్తనలోనూ, భావాల్లోనూ విపరీతమైన పరిణామము గోచరించింది.

## 2

ఆరోజు మొదలు ప్రకాశం ఒక చిదానందమూర్తిగా మారేడు.

యుద్ధంనుండి రాగానే తనతల్లికి తగినమందులు ఇప్పించకుండా డబ్బు కొట్టేశారని యిరుగుపొరుగుల వారిని నిష్ఠురములాడేడు. ప్రాణం పూర్తిగా పోకమునుపే ఆమెను శ్మశానానికి తీసుకుపోయేరని మాధవరావు చెప్పే వారందరినీ కర్కశంగా తూలనాడేడు. కాని యీనాడు వారందరినీ క్షమార్పణ కోరుకుని వారికి అవసరసమయాల్లో సహాయం చేస్తూ మిత్రుడయేడు.

ఆనాడు సంఘాన్ని ద్వేషించిన ప్రకాశం, సంఘంలో తన ఉనికిని గుర్తించుకుని ఎదుటవారికి పరుషంగావుంటే ఒక్కమాటను కూడా నోటినుండి జార్చుట మానేడు.

ప్రకాశం యుద్ధంలో చేసిన దారుణకృత్యాలనన్నీ మరచిపోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు. కాని ఇంట్లో ఏకాంతంగా ఉండటంచేత కాలక్షేపం ఏమీ ఉండేదికాదు. ఎంతసేపని చదువుకుని కాలం గడుపగలడు?

ఒక్క నిమిషం తీరికగా వాలుకుర్చీలో కూర్చుంటే చాలు, తను పరమపాపినని నిరూపించే సంఘటనలు పరంపరలుగా జ్ఞప్తికివచ్చేవి. అందుకే ఇక అతను ఒంటరిగా ఇంటిలో ఉండలేనని నిశ్చయించుకున్నాడు. రెండవవ్యక్తి అగత్యం అతనికి ఎంతైనా కన్పించింది.

కొలదికాలంలోనే ప్రకాశం లతామంజరిని తొలిసారిగా చూడటం సంభవించింది. ఒకసారి పనిమీద పట్నంవెళ్ళి కాఫీహోటల్లో ఉపాహారం తింటున్నాడు. ఆమె తనకెదురుగా కుర్చీలో కూర్చుని ఓవల్ టైన్ త్రాగుతూంది. అనుకోకుండానే ప్రకాశం లతవదనంలోకి దీక్షగా ఒకసారి చూసేడు. తరువాత అతనికన్నులను ఆమెనుండి మరల్పలేకపోయేడు. ఆమె ఉండీ ఉడిగీ అతనివైపు చూస్తూ ప్రకాశం ఇంకా తననే చూస్తున్నాడని గుర్తించి యించుక తలవంచుకున్నది.

ప్రకాశం ముందూ లత వెనుకా హోటలుద్వారం ప్రవేశించేరు. ప్రకాశం పైకాన్ని చెల్లించాలని పట్లాం జేబులో చెయ్యిపెట్టేడు. కాని ఎంతకీ జేబుయొక్క అంతు దొరకలేదు. అతను బిత్తరపోయేడు. ఒక చోరాగ్రేసరుడు జేబును కత్తిరించి తన పర్సును చేజిక్కించుకున్నాడు. పైకాన్ని ఎలా చెల్లించాలో ప్రకాశానికి తోచిందికాదు. లత ఈ సంగతిని తెలుసుకుని ప్రకాశం చెల్లించవలసిన పైకాన్నికూడా మొత్తంగా చెల్లించింది.

ప్రకాశం సంతోషించి లతామంజరికి లెక్కలేని ధన్యవాదాలను చెప్పేడు. "దయచేసి మీ ఇంటి విలాసాన్ని యిస్తే పైకాన్ని తిరిగి మీకుయిచ్చేస్తాన"ని ఆమెకు చెప్పేడు.

కాని లత నిరాకరిస్తూ తల పంకించింది "మానవులు ఒకరికొకరు వీలునుబట్టి సహాయం చేసికోటం భావ్యం. కాని నేను నావలన అవగింజంత సహాయాన్ని పొందినంతలో వెంటనే బాకీ చెల్లించివేయాలని మీరు యోచించటం అంత భావ్యంగా కనుపించదు" అంటూ ముఖపద్మాన్ని ఆచ్ఛాదింపజూచే ముంగురులను చేత్తో ఒకసారి సవరించుకుంది. ప్రకాశం ఆమెకు లొంగిపోయేడు.

## 3

పట్నానికి ప్రయాణం అంటే చిరాకుపడే ప్రకాశం, వారానికి రెండుమూడుసార్లైనా పట్నానికి బయలుదేరకుండా ఉండలేక పోతున్నాడు.

అసమం రెండుమూడుసార్లయినా పట్నం వెళ్తేనే గాని లత ప్రకాశానికి అగుపించేదే కాదు.

ఏ బజారుదగ్గరో పాఠశాల మార్గంలోనో కనుపించినా ప్రకాశంతో చాలా ముభావంగా మాట్లాడేది.

ప్రకాశం లతను ప్రేమించేడు కాని లత హృదయంలో తనకు స్థానం ఉందో లేదో ఇంకా అతను తేల్చుకోలేదు.

ఆ అవకాశం ప్రకాశానికి అచిరకాలంలోనే లభ్యమయింది. ఒకనాడు సాయంత్రం ప్రకాశం లతను కలుసుకున్నాడు. ఆ నాడు ఆమె చాలా ఉల్లాసంగా కనుపించింది. కాదనకుండా కోరినట్లు సముద్రతీరానికి ప్రకాశంతో వచ్చింది. సముద్రతీరాన్ని గల యిసుక తిన్నెపై ఉభయులూ తిరగల విలాసాలను విలోకిస్తూ కొంతకాలం గడిపేక ప్రకాశం లతను మాట్లాడించాలని ఇలా అన్నాడు.

"నేడు నువ్వు చాలా ఆహ్లాదంగా కనుపిస్తున్నావు."

"మీరు అన్నది నిజమే! నిన్నటితో మా పరీక్షలు పరిసమాప్తి అయేయి. నేడు నా మనసు కట్లు విప్పిన కురంగము లాగుంది. పిక్నిక్కి పోవాలని ఉబలాట పడుతున్నాను. ఇంతలో మీరు పిల్చేరు." ప్రకాశం ఊహించింది సత్యమేనని లత ఒప్పుకుంది.

క్రమంగా సంభాషణ ప్రకాశానికి అనుకూలంగా జరిగింది. ప్రకాశం లలితంగా తన హృదయాన్ని లతకు నివేదించేడు.

లత ప్రకాశం అభ్యర్థనకు అంగీకారాన్ని గాని నిరాకరణనుగాని తెలుపలేదు. విప్పారిన కన్నులలో అతని వక్షస్థలాన్ని ఒకసారి చూసింది. తామరరేకుల వంటి ఆమె విశాలనయనాలలోని సొగసు అతన్ని ఉక్కిరిబిక్కిరి చేసింది. లత హృదయంలో మాలతి మెదలింది.

మాలతి రెండేండ్లు భర్తతో కాపురం చేసింది. ఇంతలో అతను మరణించేడు. ఆమె విధవ అయింది. కాని మాలతి యింకా నిండు యౌవనముతో ఆకర్షణీయంగా ఉంది. శిల్పులను కూడా మోహింపజేయగల సౌందర్యం ఆమెది. పాపం! ఆమెలో వైధవ్యరేఖ ఆ మూలాగ్రంగా నశించింది. ఆమె యొక్క దుర్భర స్థితిని తల్లిదండ్రులు చూసి సహించలేక పోయేరు వారు మాలతికి మళ్ళీ పెళ్ళి చేసేరు. ఆ నూతన దంపతులకు లేక లేక ఒక కూతురు జన్మించింది. ఆ పిల్ల గారాబంగా పెరిగి పుష్పవతియై అపురూప సౌందర్యముతో శోభిల్లుతూంది. ఆమెయే లతామంజరి. ప్రకాశం హృదయాన్ని లాగికొన్న జాణ. లత ఈ విషయాన్ని ప్రకాశానికి చెప్పేసి తన హృదయాన్ని తేలిక చేసుకుంది. "నన్ను మీరు ప్రేమిస్తున్నారు. అందుకు నా పుట్టుపూర్వోత్తరాలు మీకు చెప్పటానికి నిశ్చయించి అలాగ చేసేను. ఇప్పుడు మీరు నన్ను ప్రేమించగలుతారో లేదో మరొకసారి పరిశీలించుకోండి!" అని అతణ్ణి హెచ్చరించింది.

ప్రకాశం "పాపం! మాలతికి ఒక మగపిల్లవాడు కూడా పుట్టి ఉంటే ఎంత బాగుండును!" అన్నాడు.

విశాల సముద్రంలోగల అనంతమైన నీరమునుండి వీచే చల్లనిగాలులు సైకత ప్రదేశమున ఆసీనులైనవారికి మిక్కిలి ఉల్లాసాన్ని కలిగిస్తున్నాయి. నీలాకాశంలో పున్నమిచంద్రుడు శోభాయమానంగా వెలిగిపోతూ కడలిరాజును ఆనందంలో ఉప్పొంగిస్తున్నాడు.

లతకు ఇంకా ఇంటికి పోవాలని బుద్ధిపుట్టలేదు. ప్రకాశంతో తన విషయాన్ని కొంచెంసేపు ప్రస్తావించాలనిపించింది.

ప్రకాశందూరంనుంచి వస్తూన్న పొగఓడను తదేకధ్యానంలో పరికిస్తున్నాడు.

"నా కథను మీరు విన్నారు, కాబట్టి ఇటుపైని నన్ను ప్రేమించరనుకుంటాను"–లత ప్రకాశాన్ని మళ్లీ ప్రస్తావనలోకి దింపింది.

"విన్నాను!" అన్నాడు ప్రకాశం. "ఇప్పుడు నీలో ఉన్న సత్యం నన్ను పూర్వంకంటె వేయిరెట్లు అధికంగా ఆకర్షిస్తూంది. ఇప్పటివరకూ సౌందర్యవతివనే నిన్ను ప్రేమించేను. కాని నేడు మూర్తీభవించిన సత్యానివని తెలుసుకుని ఇంకా ఎక్కువగా ప్రేమిస్తున్నాను."

ప్రకాశం పెదవులపై ప్రకాశవంతమైన చిరునవ్వు వెలిగింది.

లత మరేమీ మాట్లాడలేదు.

కొద్దినిమిషాలు గడిచేక మళ్లీ ఆమె ప్రక్కకు ముఖాన్ని త్రిప్పుకుని ప్రకాశం మెల్లిగా అడిగేడు "లతా! ఇంతకూ, నువ్వు నన్ను వివాహం చేసుకునేందుకు అంగీకస్తావా?"

ఆమె తన తలను ప్రకాశం ఒడిలోకి వాల్చింది.

## 4

సంతోష సంతాప సమ్మిళితమైనది సంసారం. ఆ మహాసాగర గర్భంలో ఒకనాడు ఆనందం కలుగు

తుంది. మరొకరోజు దుర్భరమైన వేదన అనుభూతమవుతుంది.

యుద్ధంనుండి తిరిగి వచ్చేక రెండుసంవత్సరాలు ప్రకాశం పొందిన వ్యాకులతాగ్రస్తుడు కావటంతోనే వెన్నెలగామారింది ప్రకాశం ఐదు సంవత్సరాలుఐదు నిమిషాల్లా గడిపేరు.

సరిగా ఐదుఏండ్లు ప్రకాశం పటాలములో మానవ విధ్వంసక్రియలయందు మునిగి గడిపేడు.

అలాగే ఐదుఏండ్లు మానవత్వానికి ప్రత్యేకత నాపాదించే ప్రేమకు దాసుడై గడిపేడు.

ఈనాడు ప్రకాశం వాలుకుర్చీమీద పడుకొని శోభాయమానంగా వెలిగిపోతూవున్న గగనవీధిలోకి అవలోకిస్తూ అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవిస్తున్నాడు. లత దగ్గరగా కూర్చుంది. ప్రకాశం మిక్కిలి ఉల్లాసంతో నిండుచందురుని కన్నులారా చూస్తున్నాడు. కొన్ని నిముషములు ప్రశాంతంగా గడిచేయి. ఇంతవరకూ ఉభయులూ ఆచరించిన మౌనవ్రతం లతకు విసుగుగొల్పింది.

"పూర్ణేందుఁడు తను అనుభవిస్తూవున్న ఆనందంలో సంతృప్తిఁబొందలేడు. పుచ్చపువ్వులాంటి వెన్నెలను వసుంధరకు కానుకగా సమర్పించి ఆమెను పరవశంచేస్తాడు. అతను పరోపకారి" నిశాకరుని తన సన్నని పొడుగైన వ్రేలితో ప్రకాశానికి చూపిస్తూ అన్నది లత.

ప్రకాశం నవ్వుకున్నాడు. కొన్ని సెకనులు ఊరకుని దగరగావున్న మల్లెతుప్పలవైపు లత ముగాన్ని తన చేతులతో త్రిప్పి అన్నాడు. "విరగఁబూసిన మల్లెపూల సౌరభాన్ని మారుతుఁడు గైకొనివచ్చి మనకు ఉల్లాసాన్ని కల్గిస్తున్నాడు, అతనూ పరోపకారే"

"అక్కడ ఊగుతూఉన్న ఊయలలో అబ్బాయిని చూడండి. వాఁడుకూడా మన ఇద్దరకూ ఉల్లాసాన్ని కల్గిస్తున్నాడు. వాఁడు పరోపకారి కాడా! మరి?" అని ప్రకాశాన్ని ప్రశ్నించింది లత ఊరుకోకుండా.

అప్పుడే ఊయలలో బాబు కదిలేడు. లత లేచి వెళ్లి ఉయ్యాలనుండి బాబునితీసి రెండువైపులా బుగ్గల మీఁద ముద్దులుపెట్టుకుని లోనికి తీసుకువెళ్ళింది. ప్రకాశం ఆమెను అనుసరించేడు.

"ఎల్లుండి బాబు పుట్టినదినం!" ఆనందంతో లత బాబుని మంచంమీద పరుండబెట్టి జోకొడుతూ ఆ నాటి రాత్రి ఒక మహాపర్వదినాన్ని జ్ఞప్తికి తెచ్చింది.

ఔను. అప్పుడే మనబాబుకి రేపటికి ఏడాది నిండుతుందని ప్రకాశం లయ వేసేడు.

మరి మీకు చాలాపనుంది. ఎప్పుడు చేస్తారని లత ప్రకాశాన్ని ప్రశ్నించింది.

"ఏమిటది?" ప్రకాశం తెలుసుకోగోరేడు.

"బజారుకు వెళ్లటం ... బాబుకి రెండుజతలు మంచి దుస్తులు కొనటం."

"కొనటం..." ప్రకాశం తాను జాగ్రత్తగా వింటూ ఉన్నట్లు లతకు తెలియాలని కోసముక్క తిరిగి ఉచ్చరించేడు.

తరువాత మూడువందలు లడ్డూ తేవాలి. శనగలు పదిశేర్లు పట్టండి—నలుగురినీ పిల్చి వాయనాలివ్వాలి.

ప్రకాశం తలమీద చెయ్యి పెట్టుకొని దీర్ఘంగా ఒక పెద్ద నిటూర్పును విడిచేడు. ఆ నిమిషంలో లత పొందుతూన్న ఆనందం తనకు అనుభూతి కాలేదు—సరికదా కొంచెం చిఱచిఱలాడేడు.

లత కొంచెం కంగారుపడ్డది. ఆమె మొదట ప్రకాశంకి శరీరంలో బాగులేదేమో అనుకుని 'తల నొప్పిగా వుందా?' అని జాలిగా అడిగింది.

"అదికాదు లతా! నువ్వు చెప్పినట్లు చెయ్యటానికి నా మనసు అంగీకరించదు. ఈ విషయాన్ని చెప్తే నువ్వు నొచ్చుకుంటావు." అన్నాడు ప్రకాశం.

"నాకు మీ వుద్దేశం అవగతమవలేదు ప్రకాశ్! నాకు తోచినవిషయాన్ని మీకు చెప్పేను. తద్భిన్నంగా మీరు ఏది చెప్పినా కాదనే స్వభావం కాదు నాది." ప్రకాశం అంగీకరించని ఏ కార్యాన్నీ తను తలపెట్టనని నూటిగా చెప్పింది లత!

ప్రకాశం వదనం తిరిగి ప్రకాశవంతమైంది. "అలాగయితే రేపు పదిమందికి సరిపడే భోజనాన్ని నీ స్వహస్తాలతో వండు. ఎక్కడికి పోయినా తిండి దొరకని అసంఖ్యాక నిర్భాగ్యులలో అగుపడ్డ పదిమందిని పిలుస్తాను. వారికి కడుపునిండా అన్నదానము చెయ్యి. బాబుకి క్రొత్తబట్టలను కొనితెస్తాను. ఉదయమే నీళ్ళుపోసి వాడికి తొడుగు. బాబు చేత్తో ఒక్కొక్కడికి రూపాయి దక్షిణను ఇప్పించు. నా దృష్టిలో అదే మహోత్సవం."

ప్రకాశం లతకు పురమాయించేడు.

లత ఒక్కసారి చలించింది. ఆ నాఁడు అంత స్వల్పకాలంలోనే ఆమె ఎటువంటి భావాలను పొందిందో ఊహించటం కష్టం. ఆమె ప్రకాశం ఉద్బోధించింది ఆదర్శప్రాయంగా గుర్తించింది. మారు మాటనకుండా "అలాగే!" అని తల ఊపింది.

ప్రకాశం లత తన కోర్కెకు విరుద్ధంగా ఉన్న ఆజ్ఞను శిరసావహించినందుకు చాలా సంతోషిం

చేడు. అంతేకాదు వివశుడై ఆమెను బాహాటంగా ప్రశంసించేడు కూడా.

"లతా! నువ్వు నామాటను కాదనవు నీకు ధర్మమన్నా సత్యమన్నా మిక్కిలి మక్కువ. నువ్వు ఉన్నతాదర్శాలను చాలా సులువుగా గ్రహించగలవు, అందుకే నువ్వు నా జీవితానికి......"

ఇంక ప్రకాశం ప్రశంసలు లత వినదల్చుకో లేదు. నెమ్మదిగా లోపలికి వెళ్ళిపోయింది.

## 5

చంద్రుడు వినువీధిలో కాంతులు విరజిమ్ముతూ ఆనందిస్తూ ఉంటాడు. భూదేవి అతని ఆనందాన్ని పంచుకుని ప్రకాశిస్తుంది. ఎప్పుడో ఒకప్పుడు హఠాత్తుగా కారుమేఘాలు ఉభయులనూ వేరుచేస్తాయి. ఆ క్షణంలో భూదేవి బ్రతుకు అంధకారమవుతుంది. మానవ జీవితంకూడా అచ్చంగా ఇలాగే ఉంటుంది. చీకటి వెలుతురు ప్రకృతిలో నిబిడీకృతం చేసేడు ఈశ్వరుడు.

లతామంజరి అకస్మాత్తుగా చనిపోవటంతో నే ప్రకాశానికి పృథ్వి అంతా చందమామలేని యామిని లాగ కారుచీకటి అయింది. ఆమె చనిపోతుందని ఆఖరువరకూ ఎవరూ అనుకోలేదు. లత ఒక కుమారుని ప్రసవించింది ప్రకాశం హృదయంలో ఆనందం చిందులు త్రొక్కింది.

రెండుగంటలు బ్రతికి శిశువుపోయింది.

తండ్రి హృదయం తిరిసింది.

మరునాడు జ్వరంతగిలి లతకూడా తన జన్మను చాలించింది. ఇప్పుడు ప్రకాశం హృదయం ఏకంగా బీటలు వారింది. అతని కాళ్ళక్రింద భూమి కంపించింది.

పాపం!...ప్రకాశం "నేను ఎందుకు మిగిలి ఉన్నాను?"

బాబు కూడా బ్రతికి ఉన్నాడు. అప్పటికి సుమారు ఏడేండ్లవాడు.

ప్రకాశానికి తన ఇల్లు నరకమయింది. శీతాంశుడు శత్రువయ్యేడు

బాబుకి లత ఎక్కడికి పోయిందా! అన్న సందేహం కలిగింది.

ప్రకాశం హృదయవిదారకంగా శోకిస్తున్నాడు.

బాబుకి నాన్న ఎందుకు ఏడుస్తున్నాడో అర్థం కాలేదు.

లతకు ఈ సంగతిని చెప్పాలని ఇల్లంతా గాలించేడు. ఆమె కనుపించలేదు. బాబు "అమ్మా! నీకు చెవుడేమిటే?" అని గట్టిగా అరిచేడు. ఇల్లంతా ఆ ధ్వనితో మారు మ్రోగింది.

ప్రకాశానికి వెర్రి ఎత్తింది. గబగబ వచ్చి వాడిని చావమోదేడు. బాబు వెక్కి వెక్కి ఏడ్వనారంభించేడు. బాబుని ఇప్పటిదాకా ఎవరూ కొట్టలేదు. నేడు ప్రప్రథమంగా ప్రకాశం బాబుమీద చెయ్యి చేసుకున్నాడు. బాబు గోడమూలకు పోయి ఏడుస్తున్నాడు.

ప్రకాశానికి బాబు ఏడుపు వినబడటం లేదు. లత ఉంటేనే అతను మనిషి. నేడులత లేదు.

ప్రకాశానికి మరి ఇంట్లో ఉండ బుద్ధి వెయ్య లేదు నిప్పు చేసుకుని ఇంతవండుకున్నాడు, కడుపులోని ఆకలి మంటలను కొంత ఉడికీ ఉడకని మెతుకులు తిని చల్లార్చుకున్నాడు. అతనికి భోంచేశాక గాని బాబు సంగతి స్ఫురణకి రాలేదు. ప్రకాశం బాబుకి ఇంత అన్నం తినిపించబోయేడు. బాబు అతని చేతిని నోటినుండి త్రోసివేసి గొలుగొలున ఏడుస్తున్నాడు. "అమ్మని పిలవండి!" అని గట్టిగా కేక వేసేడు.

ప్రకాశానికి మళ్లీ హృదయం గాయపడింది. అతనికి లత జ్ఞాపకం వచ్చింది. తిరిగి ప్రపంచం చీకటయింది. బాబును చెంపమీద సాగదీసి ఒక్కటి కొట్టి వెనుదిరిగి చూడకుండా వీధితలుపు గడియవేసి బయలుదేరేడు. ప్రకాశానికి ఎక్కడికి పోవాలో తోచలేదు. అలా నడిచిపోతున్నాడు. దారిలో మాధవరావు అతణ్ణి పరామర్శించేడు. ప్రకాశం మళ్ళీ ఏడ్చేడు.

మాధవరావు పానప్రియుడు. పానం పరితాప నాశనం అనే మూలమంత్రాన్ని అవ్యక్త తైలధారగా జపిస్తాడు. ప్రకాశంలాగే అతనుకూడా కష్టాలుపడ్డ వాడే. ఒకనాడు మాధవరావు పెద్దకుటుంబంలో ఉండేవాడు. నేడు సారాబుడ్డితో మాత్రమే ఉంటున్నాడు. దారీతెన్నూ కాంచలేని ప్రకాశంకి మాధవరావు మార్గదర్శి అయేడు. ఆనాడు ప్రకాశం మాధవరావుతోకూడా ఒకింత సారా త్రాగేడు.

రాత్రి పన్నెండు గంటలయింది. ప్రకాశం వీధి తలుపు తోసుకుని ఇంట్లోకి వచ్చేడు. అతనికి ఆశ్చర్యాన్ని కల్గించే దృశ్యంఒకటి కన్పించింది.

ఇంట్లో దీపం వెలుగుతూంది.

చిందరవందరగా ఉండవలసిన సామగ్రి స్వస్థానాన్ని సంపాదించింది.

ఎవరో ఒక యువతి బాబును జోకొడుతూ నిద్ర గొల్పుతూంది.

ఆ సుందరి ప్రకాశం రాగానే నిలబడింది.

"నువ్వెందుకు ఆ నిర్భాగ్యునిగూర్చి శ్రమ పడుతున్నావు?" ప్రకాశం ఆమెను నిరుత్సాహ పరిచేడు.

# ఇక సెలవు

ఆమెలో విషాదచ్ఛాయలు స్పష్టంగా కనిపించేయి. "ఒక ఆదర్శమూర్తి సుభిక్షాలమైన భూదేవికి సమర్పించిన కానుకగా బాబుని నేభావిస్తున్నాను. ప్రకాశ్! నాలో ఉన్న ప్రేమను గౌరవిస్తూ వీడు స్వాధీనం చేసుకున్నాడు." అని ఎంతో జాలిగా ఆమె పలికింది.

ప్రకాశం ఆమె ముఖంలోకి చూసేడు. ఆమె కళ్ళ వెంట నీరు కారుతూంది. లతమరణం ఆమెకుకూడా దుఃఖాన్ని కల్గించింది.

మానవజీవితమంతా సుఖమయం కాదు ప్రకాశ్! సుఖాలాగే కష్టాలుకూడా జీవితంలో వస్తూఉంటాయి. సుఖాల్లో ఆనందించేశక్తి ప్రతీవాడూ కలిఉంటాడు. కాని కష్టాల్లో చలించకుండా వున్నవాడే ధన్యుడు. అందుచేత మీరు ధైర్యం వహించాలి. బాబునిపెంచిపెద్ద చేయాలి. ఆపని చేస్తేనే మీరు లతకు సేవచేసినవారవుతారు. వణికే గొంతుకతో ఆమె ప్రకాశాన్ని హెచ్చరిక చేసింది.

ప్రకాశం వికారంగా నవ్వుతూ "ఎందుకూ! నేనూ చచ్చిపోతాను. బాబూ చస్తాడు. మేం ఇద్దరం చస్తేనే లతకు ఆత్మశాంతి చేకూరుతుంది" అన్నాడు.

ఆమె మరేమీ మాట్లాడలేకపోయింది. పోత పోసిన బొమ్మలా అలాగే నిల్చుంది. ప్రకాశం ఆమెను దీక్షగా చూస్తున్నాడు. ఆమె ముఖంలో ఏదో దివ్యశక్తి తాండవిస్తున్నట్లు అతనికి కన్పించింది. ఇంత దుఃఖంలోనూ ప్రకాశానికి ఒక శాంతి కల్గింది. ఆమె వైపే చూస్తూ తన దుఃఖాన్ని మరచిపోగలనేమో అనుకున్నాడు ఒకసారి.

బాబు కదిలేడు. ఆమె మళ్ళీ కూర్చుని తల వంచుకు బాబుని జోకొడుతూంది. ఆమె బాబుకి సేవ చేస్తూంది. ప్రకాశం ఆ జవ్వని మాతృప్రేమను మదిలో ప్రశంసించేడు. ఒకవేళ బాబు పెరిగి పెద్దవాడవాలంటే ఆమె ఉండాలి. తను ఇప్పుడు బాబునేమి చేయగలడు? తను ఇప్పుడు వివేకాన్ని కోల్పోయేడు. ఆమె మాత్రం బాబుని ఎంతకాలం సంరక్షిస్తుంది. ఏదో నాలుగ్రోజులు. ఆమె మాత్రం పరిణయమాడదా? ఆమె అత్తవారింటికి పోతుంది. అప్పుడు బాబు ఏమౌతాడు. ప్రకాశం తన భావాలనే ఆమెకు చెప్పేడు.

"నువ్వు ఎంతకాలం బాబుకి పరిచర్య చేయగలవు?

"ఎంత కాలమైనా చేయగలను. బాబుకి నేనే లతను అనే భావన కలిగించేశక్తి నాకు లేకపోలేదు" దృఢంగా ఆమె సమాధానం చెప్పింది.

ప్రకాశం అపారమైన ఆశ్చర్యాన్ని పొందేడు. ఈమె చంపయేనా? ఎంత ధైర్యంగా నాలో ఆశాదీపాన్ని వెలిగిస్తూంది? నిజానికి ఈమె లతకు తగిన మిత్రురాలు అనుకొని ఆమెను వేరొక ప్రశ్న వేసేడు.

"రేపు నీకు వివాహమౌతుంది. నువ్వు అత్తవారింటికి పోతావు. అప్పుడు బాబు ఏమౌతాడు."

"నేను లతస్థానాన్ని వహిస్తాను."

ప్రకాశం పరమానంద భరితుడయేడు.

"చంపా! నువ్వు నన్ను వివాహ మాడగలవా?" ఆమెను అడిగేడు.

చంప తల వాల్చింది.

ప్రకాశం రెండడుగులు ముందుకు వేసేడు. చటుక్కున లత అతనికి స్ఫురించింది.

"నేను లతను ఎలా మరచిపోగలను చంపా?"

దీనంగా అతను చంపను చూస్తూ అన్నాడు.

"నేను మాత్రం మరిచిపోగలనా ప్రకాశ్! మనం ఇరువురం ఆమెను పూజిద్దాం. ఆమెకు సర్వస్వం అయిన ఈ అర్భకునికి రెక్కలనిద్దాం. ఆనాడు మీకు లతయందుగల ప్రేమ నాకు ఆమెయెడలగల పూజ్యభావం రెండూ సార్థకమౌతాయి."

ప్రకాశంహృదయంలో ఒక ఆశాజ్యోతి వెల్గింది.

చంప ప్రకాశం ఇంటికి నాల్గిళ్లు ఆతలగల గంగమ్మగారి ఏకైకపుత్రి. ఆమె వయస్సు సుమారు పదునెనిమిది సంవత్సరాలు. చంప చాలా చక్కగా ఉంటుంది. చంప తండ్రిని ప్రకాశం బాగా ఎరుగును. అతను యుద్ధంలో తన ప్రాణాన్ని కోల్పోయేడు.

చంప ఆ నాటికి తను ఇంటికి వెళ్ళటానికి అంగీకారాన్ని అర్థించింది.

"బాబుకి అన్నం తినిపించేను. ఇంక తెల్లవారే దాకా లేవడు. ఒకవేళ ఎప్పుడైనా కదిలితే కాస్త బుజ్జగించండి. ఇదుగో! ఇలా చూడండి! వాడిపై మీరు కోపం ప్రదర్శించడానికి వీల్లేదు. ప్రొద్దున్నే కాఫీ పట్టుకువస్తాను. మా అమ్మకూడా వస్తానంది. ఈ రెండు ముక్కలూ ప్రకాశానికి చెప్పి మెల్లిగా ద్వారంవైపు నడిచింది."

తలుపు గడియ వేసుకుందికి చంప ననుసరించిన ప్రకాశం నోటినుండి ఒకవాసన చంపకు తగిలింది. ఆమె క్షణకాలం జలదరించి గబగబా ఆ అర్ధరాత్రి ఇంటికి చేరుకుంది.

ప్రకాశం ఆ రోజు మాధవరావు ప్రోద్బలముపై చాలా కొంచెం సారా త్రాగేడు. రాత్రి అతనికి ఎంతకీ నిద్దరరాలేదు. అప్పటికి కాలం రెండుగంటలయి ఉంటుంది. ప్రకాశానికి తల తిరుగుతూంది. ఏదో వాగుతేగాని అతనికి సౌఖ్యమనిపించలేదు. అతను పిచ్చి పిచ్చిగా మాట్లాడ నారంభించేడు.

ఒకసారి తన ధోరణిలో అతను తిట్టడం ప్రారంభించేడు. ఆమెను గాడిదఅనీ, కుక్క అనీ శతవిధాల తిట్టేడు. ఈ సారి ఆమె అగుపడితే చీల్చి చంపుతానన్నాడు. మరొకసారి తన వివాహమైన కొద్దికాలంలోనే మరణించిన లత తల్లిదండ్రులకు నమస్కరించేడు. కొద్దికాలం తరువాత వారు జబ్బుచేసి చావడం మంచిది కాదన్నాడు. ఈ సారి మీరు సముద్రంలోపడి చావండి అన్నాడు. ఈ విధంగా ప్రకాశం పూర్తిగా మతిని కోల్పోయి వాగేడు. పూర్తిగా మతిభ్రష్టుడయ్యేడు.

రాత్రి రెండున్నర గంటలయింది. ప్రకాశానికి యింకా పూర్తిగా తెలివిరాలేదు. కాని అతనిధోరణి తగ్గింది. కొంచెం కొంచెం నిద్రకూడా వస్తోంది.

ఇంతలో బాబుకి తెలివివచ్చింది, వాడు లేచి కూర్చుని అమ్మా! అంటూ ఏడ్వసాగేడు. ప్రకాశం లేచి తూలుతూ వెళ్ళి వాడికి రెండు చెంపలమీదా రెండు దెబ్బలు గట్టిగా కొట్టేడు. బాబు అమ్మా! అంటూ ఇంకా గట్టిగా ఏడుస్తున్నాడు. ఆ నిమిషంలో పసివాడైన బాబు ఎంతగా బాధపడ్డాడో చెప్పలేం. వాడికి ఒక్కసారిగా అమ్మ కనిపించలేదు. నిన్నటివరకూ అమృతమూర్తిలాగున్న నాన్న నేడు ప్రచండమార్తాండుడయేడు. అమ్మలాగే ఆదరించి బుజగించిన ప్రేమమూర్తి ఇల్లు చేరుకుంది. బాబు ఇంకా గట్టిగా ఏడుస్తున్నాడు. ప్రకాశం విసిగివాడిని చెవిపట్టుకు బయటకు గెంటి తలుపులోపల గడియ వేసుకొన్నాడు.

ఆనాటి రాత్రి ఆకసము మేఘావృతమై ఉంది. అందుచేత పృథ్వీతలంమీద చంద్రకాంతి మసక మసకగా పడుతూంది. ఆ చీకటిలో బాబు ఒకటే పరుగు తీసి తిన్నగా ఊరిబయటనున్న శివాలయం చేరుకున్నాడు.

దూరంనుండి నక్కల అరుపులు. వినిపిస్తున్నాయి ఇంకా అనేక సద్దులు పెద్దవారినే భయపెట్టేలాగున్నాయి. కాని బాబుమాత్రం కొంచెమైనా చలించలేదు.

## 6

ప్రకాశానికి మూడుగంటలకు నిద్రపట్టింది. అది కూడా కలతనిద్ర. ఆ నిద్రలో ఒకకల.

లతామంజరి తెల్లనిచీర కట్టుకుంది. ఆమె నొసట కుంకుమబొట్టు నింగిలో చందమామలాగ తళతళలాడుతూంది. లత కబరీభారంలో మరువాన్ని తురిమింది. సలక్షణంగా చేతిలో పూలసజ్జను పట్టుకుంది. మరొక చేతో బాబుచెయ్యి పట్టుకుంది. ఇద్దరూ శివాలయం చేరేరు. లత ఈశ్వరలింగాన్ని అవలోకించి మధురమైన పాటపాడింది. ఆ పాటకు ఈశ్వరుడు పరవశుడై ఒకసారి మనోహరంగా నవ్వేడు. బాబుచుట్టూరాఉన్న పూలమొక్కలనుండి పుష్పాలనుకోసి తెచ్చేడు. లత నవ్విన భగవానుని పూలతో పూజించింది. మధురతర పక్వ ఫలములను నివేదించింది. బాబు ఈశ్వరునికి సాగిలబడి నమస్కరించేడు.

ప్రకాశం కలలో రెండవదృశ్యం మొదలైంది.

ఒకసారి బాబు బడికివెళ్ళేడు. తన ప్రక్కనున్న కుర్రవాడిని చూసేడు. వాడు చొక్కా తొడుక్కోలేదు. బాబు వాడిని కారణం అడిగేడు. వాడు తనకు ఒకటేచొక్కా ఉందన్నాడు. అది చాకలికి వేయుటచేత తిరిగి వచ్చేవరకు తనకు తొడుక్కుందికి వేఱు చొక్కా లేదని చెప్పేడు. బాబు మరేమీ మాట్లాడకుండా తన చొక్కాను తీసి వాడికి ఇచ్చేడు. ఆ చొక్కా వాడు తొడుక్కునేవరకూ ఊరుకోలేదు. బాబు ఉట్టి బనియనుతోనే ఇంటికి రావడంచూసి లత విపరీతపడి మెల్లిగా బాబునడిగి సంగతిని తెలుసుకుంది. బాబుని అంత హద్దుమీరి దానాలను చెయ్యడానికి ఇంకా మనకు శక్తి రాలేదనీ, ఈశ్వరుడు మనకు సంపదలను కటాక్షించినవాడు మనం మానవసేవ తప్పక చేయాలని మందలిస్తూ నీతి గరిపింది. "నువ్వు పెద్దవాడవౌతావు. నీకు పెద్ద ఉద్యోగం దొరుకుతుంది. అప్పుడు నీ జీతంలో సగంపాలు దాన ధర్మాలకు వినియోగించాలి. తెలిసిందా!..." అన్నది. లత బాబుచేసిన పనికి కినుక వహించిందా?... లేదు. ఆమె మొదట బాబును మెల్లిగా మందలించింది. తరువాత ప్రాజ్ఞుడయిన పిదప కర్తవ్యాన్ని బోధించింది.

ప్రకాశం స్వప్నసీమలో బాబు ఆఖరిసారిగా కనిపించేడు. లత వాడికి రెండు జేబులలోనూ రెండు పిడికిళ్ళు బియ్యంపోసి బడికి పంపుతుంది. ఆ బియ్యాన్ని వాడు శివాలయం దగ్గరున్న బిచ్చగాళ్ళకు వేసి మరీ, బడికివెళతాడు. అక్కడ ఉండే ఇద్దరు బిచ్చగాళ్ళూ బాబు అంటే పడిచస్తారు. అవకాశం దొరుకుతే ఒకసారి ఎత్తుకుని ముద్దులాడి దింపేస్తారు. "దరిద్రం ప్రేమను కొరత చేయగలదా?" అనుకుంటాడు కలలోనే ప్రకాశం.

మళ్ళీ బాబు ప్రకాశానికి కనిపించలేదు వెంటనే అతనికి తెలివి వచ్చింది. అతను బాబూ! అని గట్టిగా అరుస్తూ కలతనిద్రనుండి మేల్కొని ఇలు వలుమాలలా గాలించేడు. బాబు ఎక్కడా కన్పించడు. అతనికి నిన్నరాత్రి సంఘటన స్ఫురించింది. ప్రకాశం వీధిద్వారంవైపు పరిగెత్తేడు.

అప్పటికే తెలతెలవారుతూంది. పెరటిలో ఉన్న వృక్షముల మీద పక్షులు ఒకటే గోలచేస్తున్నాయి. చంప మరశంబు చెల్లో పట్టుకువస్తూంది.

వీధి తలుపుమీఁద టకటకమని శబ్దం—లోడనే "ప్రకాశ్" అని ఒక కోకిలస్వరం. వీధితలుపు తియ్యాలనే ప్రయత్నంతో జోరుగా వస్తూఉన్న ప్రకాశానికి వినిపించేయి. అతను తలుపు తెరిచేడు.

"బాబు ఏడీ చంపా?" అని ప్రకాశం తలుపు తెరవగానే ఆమెను ప్రశ్నించేడు. ఆత్రుతతో ఆమెను త్రోసుకుని ముందుకుపోయి వీధిఅరుగు నాలుప్రక్కలా చూసేడు. చంప నిర్ఘాంతపోయింది. ఆమెకు ఏమీ బోధపడలేదు. ప్రకాశం నిన్నరాత్రి తను వివేదనను కోల్పోయి చేసిన ఘాతుకచర్యను శిథగద్గదస్వరంతో చంపకు చెప్పేడు. చంప ఆపాదము సకమూ కంపించింది. ఆమె చేతిలో మరచెంబు క్రిందకు విడిచింది.

ఇద్దరూ వీధినంతా గాలించేరు. వారికి బాబు కనుపించలేదు. ఆఖరికి చంపకు ఒక ఊహ తట్టింది. "బాబు శివాలయానికి పోయిఉంటాడు. చూదాం పద!" అంటూ ఆమె అటుప్రక్క పరుగెత్తింది. ప్రకాశం కూడా పరుగెత్తేడు.

ప్రకాశం, చంపా, శివాలయం చేరుకున్నారు. కోవెల కుడ్యాలనిండా వారికి "అమ్మ" అనే అక్షరాలు లెక్కలేనన్నిసార్లు కన్పించేయి. ఆ అక్షరాలు విభూతి ముక్కలతో వ్రాయఁబడి వున్నాయి. ఆ దస్తూరి బాబుదే! ఆ గోడలమీఁద వాఁడు కనీసం ఐదువేలసార్లు అమ్మ అనే పదాన్ని వ్రాసి ఉంటాడు. ఎంత ఓపికతో వ్రాసేడో కాని ఆ గోడలనిండా రెండున్నర అడుగుల ఎత్తువరకూ చుట్టూ అమ్మ అనే పదం ఎడంలేకుండా కనుపిస్తూంది. చంప ఆ అక్షరాలను చూస్తూ అలా స్తంభించిపోయింది.

ప్రకాశం ఆత్రుతతో లోనికిచొచ్చుకుపోయి చూసేడు. అక్కడ బాబు నందీశ్వరుని దగ్గరపడి ఉన్నాడు.

ప్రకాశం బాబూ! అని వాఁడిని కౌగిలించుకుని లేవనెత్తేఁడు.

కాని బాబు ప్రాణం ప్రేమలేని యీ ప్రపంచం నుండి లతవున్న లోకానికి ఎగిరిపోయింది.

ప్రకాశం గట్టిగా విలపిస్తూ వాఁడిని భుజంమీఁద పడేసుకుని బయటకు వచ్చేడు. చంప ఆ దృశ్యాన్ని మరి చూడలేక చీరచెరఁగుతో కన్నులు మూసుకుని వలవల ఏడ్చింది.

లత చనిపోయింది. బాబు కూడా చనిపోయేడు. ప్రకాశం నిర్భాగ్యుడై బిగ్గరగా ఏడుస్తున్నాడు.

చంప మాత్రం అట్టేసేపు ఏడువలేదు. ఆమె తెలివి తెచ్చుకుని ఆఖరుసారిగా ప్రకాశానికి కొన్ని ముక్కలు చెప్పింది.

"నువ్వు దౌర్భాగ్యుఁడవు ప్రకాశ్! ఇఁక నేను ఏ విధమైన ఉపకారాన్నీ నీకు చేయలేను. లత ఆత్మశాంతి వాశించి నా జీవితాన్ని నీకు అంకితం చేయాలని నిశ్చయించేను. కాని...అప్పుడే సమయం దాటిపోయింది ఇప్పుడు ఆశక్తి నాలో నశించింది. నా ఆశ నిరాశ అయింది. అంతే...నిన్ను మాత్రం నేను ఎన్నడూ ప్రేమించలేదు. ఇటుపై ప్రేమించలేను కూడా."

ప్రకాశానికి చంప నోటనుండి వచ్చిన మాటలు కశాఘాతాల్లాగ తగిలేయి. ఆమె మొగంలో ఒక శాంతం—ఒక గాంభీర్యం—ఒక ఉద్రేకం అతనికి గోచరించేయి. ఇంక అతను ఆమెవైపు చూడలేకపోయేడు. భూమ్యాకాశాలు కలిసేలాగ కన్పించే ప్రదేశాన్ని వ్యర్థంగా చూస్తూ రెండుఅడుగులు వేసేడు.

ప్రకాశ్! చంప అతణ్ణి పిలచింది. అతను వెనుకకి తిరగకుండా అక్కడనే కొంచెం ఆగేడు.

చంప అతని భుజాలనుండి బాబు శవాన్ని లాగుకుంది. రెండు బుగ్గలమీఁదా రెండుముద్దులు పెట్టుకుంది. నిండు యౌవనంతో తొణికిసలాడే తన హృదయానికి వాఁడి శీతలశరీరాన్ని ఒకసారి హత్తుకుంది. తిరిగి బాబుని అతని భుజాలకు చేర్చి, "ఇక సెలవు!" అంటూ గబగబ నడిచిపోయింది.

# కలగూరగంప

## ఛందోదర్పణము కొన్ని విశేషములు

శ్రీ భట్టాచార్య

ఛందోదర్పణమునందలి కొన్ని విషయములపై నింతకుఁ బూర్వము పండితులు కొందఱు విమర్శ గావించియుండిరి. అందుఁ గొన్ని మాకు సరిపడినవిగా లేవు. వానిపై మా యభిప్రాయములను దెలుపుచుంటిమి. సహృదయులైన పండితులు మా యుభయుల యభిప్రాయములఁ బరిశీలించి యథార్థము తెలుపఁ గోరుచున్నారము. ఇయ్యది సత్యాన్వేషణము కొఱకేగాని అన్యథా కాదని మనవిచేయుచున్నారము.

1. సంధిగత ప్రాసము.

కం|| స్ఫుటముగ సంధిజనిత రూ
పవిశేష ప్రాసమనఁగఁ బరుసపకారం
బవిరళ వకారముగ న
య్యవదాలిన పాలెఱుంగ ననఁగ ముకుందా !

సంధిగత ప్రాసమనఁగా—సంధిచే నేర్పడిన వర్ణము ప్రాసస్థానమున నున్నవానికి మైత్రిఁ గూర్చుట యని లక్షణమునందు ననంతుఁడు చెప్పియున్నాఁడు. కాని లక్ష్యమునందు నొక పకారమునకు మాత్రమే చూపించినాఁడు. అందుచే కేవల మొక పకారమునకు మాత్రమే చెల్లుననియు మిగిలినవానికి జెల్లదనియు నర్థమగుచున్నది. కాని యట్లు చెప్పఁదగదు. అయ్యది యుపలక్షణముగా కచటతపలకును జెల్లును. అనంతుఁడీ విషయము తన ఛందమునందు వివరించియున్నాఁడు.

కం|| ప్రథమాంత విభక్తులపై
గ్రథితములగు కచటతపలు గసడదవలగున్
పృథివి నివి గజడదబలగు
ప్రథమంపు నున్నలగు నాంతపదములమీఁదన్.

ఛందో. ప్ర. ఆ. ప 61.

“గసడదవాస్స్యుః ప్రథమామాత్రాదాత్మాస్య దోర్వ్యాసైనైతే, నవికృతి శబ్దాత్పరత స్సాంస్కృతికానాం... పరుషా ద్రుతప్రకృతికాత్పరశ్శాస్య స్త్వర్ధంతంచ బిందుస్స్యాత్” అను చింతామణి సూత్రమును వివరించి యుదాహరణముగా—

గీ|| వాఁడుగను వాఁడు సేకొనువాఁడు డెక్క
లాడు వాఁడు దపోనిధి వాఁడు పెద్ద
చిక్కఁగరి ముక్కఁ జెలి వాక్కుఁ డుక్కలెట్టి
శౌరిఁ దలఁచె నిఁక బిలిచెనా సంఘులిట్లు

ఛందో, ప్ర. ఆ. ప 62.

అని చెప్పియున్నాఁడు. లక్షణ లక్ష్యములఁ బరికింతము. “ప్రథమాంత విభక్తులపైఁ గ్రథితములగు కచటతపలు గసడదవలగున్” అను లక్షణమునకు వరుసగా.

(క) వాఁడు + కనువాఁడు = వాఁడుఁ గనువాఁడు.
(చ) వాఁడు + చేకొనువాఁడు = వాఁడు సేకొనువాఁడు.
(ట) వాఁడు + టెక్కులాఁడు వాఁడు = వాఁడు డెక్కులాడు వాఁడు.
(త) వాఁడు + తపోనిధి = వాఁడు దపోనిధి.
(ప) వాఁడు + పెద్ద = వాఁడు వెద్ద.

అని లక్ష్యముల నిచ్చియున్నాఁడు.

ఇందు ‘వాఁడు దపోనిధి” అను నుదాహరణమును బరిశీలింప వలసియున్నది. “నవికృతి శబ్దాత్పరత స్సాంస్కృతికానాం భవంతి గసడదవాః” అను చింతామణి సూత్రముచే తెలుఁగు శబ్దములకంటెఁ బరములైన సంస్కృత శబ్దములకు గసడదవలు కలుగవు. కాని యనంతుఁడు “వాఁడు దపోనిధి” అని తెలుఁగు మీఁది సంస్కృత పదమునకు గసడదవాదేశము చేసినాఁడు. ఇది చింతామణికి విరుద్ధముగా నున్నందున తప్పందుమా? పరికింప నది పొరపాటు కాదు. పూర్వకవుల ప్రయోగము లట్టివి గలవు. లక్ష్యములున్నపుడు లక్షణములు చెప్పకపోవుట లక్షణకర్తల పొరపాటు కాని లక్ష్యములు తప్పులు కావుగదా. పూర్వకవులు ప్రయోగించిరి కనుకనే యనంతుఁడును “వాఁడు దపోనిధి” అని ప్రయోగించినాఁడు. శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులుగారు తమ ప్రౌఢవ్యాకరణమునందు “కొన్నియెడలఁ దెలుఁగుల మీఁది సాంస్కృతికములకు గసడదవలు గానంబడియెడి” అని సూత్రించి “వీరల్గోపించిన— ఇట్లు దపంబు— వేదములు అను

ప్రయోగములు చూపించి యున్నారు. ఇయ్యది యనంతునికి మిక్కిలి ప్రౌఢ్బలకము.

ఇఁక ద్రుతాంతములమీఁది గజడదబలను బరిశీలింతము. "పృథివి నివి గజడదబ లగు ప్రథమపు సున్నలగు వాంతపదముల మీఁదన్" అని లక్షణము సెప్పి లక్ష్యము లనిట్లు క్రమముగా నిచ్చియున్నాఁడు.

(క) చిక్కన్ + కరి = చిక్కఁగరి
(చ) మ్రొక్కన్ + చెలి = మ్రొక్కఁజెలి
(ట) వాక్కన్ + టెక్కు = వాక్కఁడెక్కు
(త) శౌరిన్ + తలఁచె = శౌరిఁదలఁచె
(ప) నిన్ + పిలిచె = నిన్ బిలిచె.

దీనినిగూర్చి పండితుల విమర్శలఁ బరికింతము. "ద్రుతప్రకృతికములమీఁది పరుషములకు గజడదబలును జెప్పఁబడి యా గజడదబలకు ముందు సున్నకలుగునని చెప్పెను. అనఁగా ద్రుతము సున్నగాను మారుననుట. సున్నయనఁగా నరసున్నయు నెరసున్నయు రెండు గ్రాహ్యములే. లక్ష్యమున "చిక్కఁగరి మొదలు శౌరిఁదలఁచె" అను నందు నరసున్నకు లక్ష్యమిచ్చినాఁడు. తుదపరి "నిన్ బిలిచె" అని ముద్రణ ప్రతిలోనున్నది. కాని యది నింబిలిచె నైయుండనోపు. ద్రుతమున కనంతుఁడు సున్నవిధించినాఁడు. అరసున్నకుఁ జిక్కఁగరి. ఇత్యాదులు. నెరసున్నకు "నింబిలిచె" అను నదియు లక్ష్యముగా నిచ్చియుండు. 'నింబిలిచె' రూపసిద్ధియగు నని యనంతుఁడు. 'భ్రమ' పడినాడు. లేదా యొక యరసున్నకు లక్ష్యమిచ్చినవాఁడైన కావలె. 'సున్న' అనుదానిచే నరసున్నలు నెరసున్నలు గ్రహించి నెఱ సున్నకు 'నింబిలిచె' అను రూపము నుదాహరించినాఁ డనియు నయ్యది ప్రమాదము అనియు మా యాశయము"

(సుభాషిణి సం 2 సంచిక ర)

అని శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు వ్రాసిరి. ఈ వ్రాత మాకుఁ జాల నాశ్చర్యమును గొల్పినది. విషయ గ్రహణము సరిగా జేసికొన్నట్లు కనిపింపదు. అందువలన నే యనంతునకు 'భ్రమ' కలిగినదని వ్రాయుట. వడ్లమూడివారు చెప్పినది సరికాదు. వారు అనంతామాత్యుని లక్షణమును బూర్తిగా దపర్థము సేసికొనిరి. అందుచే వికృతి మయిన విమర్శ చేయబడినది. కాని "ప్రమాదో ధీమతామపి" అని అన్నారు గదా పెద్దలు. ఇక మాకు దోచిన యభిప్రాయము తెలుపుచుంటిమి పరికింపుడు.

"పృథివి నివి గజడదబలగు ప్రథమపు సున్నలగు వాంత పదములమీఁదన్" ఇది యనంతుఁడు చెప్పిన లక్షణము. దీని యన్వయ మేమన—వాంతపదములమీఁదన్" అనుదానికి "ప్రథమపు సున్నలగు" అనునది విశేషణముగా జెప్పవలయును గాని క్రియగా జెప్పఁగూడదు. 'గజడదబలగున్' అను దానిలోని 'అగున్' అనునది మాత్రము క్రియ. అందుచే "ప్రథమపు సున్నలగు వాంత పదములమీఁదన్" అంటే యిట్లర్థము సెప్పికొన వలయును. సున్నలగుటకు యోగ్యములయిన నకారాంత పదములమీఁదన్ అనగా ద్రుతాంతములయిన పదముల మీద నని యర్థము సెప్పవలయును. ద్రుతాంతమయిన పదములమీద కచటతపలు గజడదబలగు నని యనంతుఁడు సెప్పియున్నాఁడు. గోపాలకృష్ణయ్యగారు అనంతుని లక్షణమును అపార్థము సేసికొని ద్రుత ప్రకృతికము మీద పరుషములకు గజడదబలను జెప్పి యా గజడదబలకు ముందు సున్న కలుగుననియు, సున్న యనగా నరసున్నయు, నెరసున్నయు రెండు కలుగుననియు నరసున్నకు 'చిక్కఁగరి' మొదలైన రూపములు నెఱ సున్నకు 'నింబిలిచె' అనునది యనంతుడు చెప్పెనని ఒక చిత్రమైన వ్యాఖ్యానము సేసిరి అనంతుఁడిచ్చిన యుదాహరణము నందలి 'నిన్ బిలిచె' అనుదానిలోని నకారమును బూర్ణబిందువుగా జేసి నెఱకు 'నింబిలిచె' అనునది లక్ష్యముగా నిచ్చి "నింబిలిచె" అని రూపసిద్ధియగు నని యనంతుడు "భ్రమ" పడినాడు. అని గోపాలకృష్ణయ్యగారు వ్రాయుట పరమ సాహసము. లక్షణమును సరిగా నర్థము చేసికొనక తప్పుగా నర్థము సేసికొని యనంతునికి లేనిపోని భ్రమ ప్రమాదము లంటగట్టుటకు బూనుకొనిరి. అనంతుడు సున్నయగుటకు యోగ్యమయిన నకారాంతపదముల మీద పరుషములు గజడదబలగునని చెప్పి యుదాహరణముగా నరసున్నలగుట కవకాశమున్న తావుల నరసున్న రూపముల జూపించి అరసున్నగాని నెఱసున్నగాని యగుట కవకాశములేని 'నిన్' లోని నకారమును పొల్లు నకారముగనే యుంచి "నిన్ బిలిచె" అని ప్రయోగించి చూపించినాఁడు. అంతియే కాని 'నింబిలిచె' అను లేనిరూపమును గల్పించి యనంతునికి భ్రమప్రమాదము లంటగట్టుట గర్హింపఁదగినది, పండితులు పరికింతురుగాక.

## రివిరమము

అనంతుఁడు తన ఛందోదర్పణమునందు ఋకార స్వరూపయతి నిట్లు చెప్పినాఁడు.

గీ॥ క్షితి ఋకార రూపస్వరూపయతులు బరఁగు
ఋగ్యజుస్సామ వినుతుండు కృష్ణుఁడనఁగ
తృప్తికులజుండు కరుణా సముద్రుఁడనఁగ
హేమ పీతాంబరుండు దేవవృషభుఁడనఁగ.

('హేమ పీతాంబరుండు' అని మువర్ణకమునకు ముందుఁ బూర్ణబిందువున్నది అట్లున్న గణభంగము కాఁగలదు 'హేమపీతంబరుఁడు' అని యర్ధబిందు వుండవలయును)

ఋకార స్వరూపయతిలో మూఁడు విధములైన వానిని అనంతుఁడు చూపించినాఁడు. (1) ఋకారము

నను కొందులపైనుండు ఋకారమునకును, (2) హల్లుల మైత్రి లేకున్నను ఋకార సంబంధమునబట్టి వృ—మ్ముల వంటి వానికిని, (3) హేమలోని 'హే'కును 'వృషభ'లోని వృకారమునకును యతులు సెప్పినాఁడు. వీనికి యప్పకవి ఋత్వసామ్య, ఋత్వసంబంధ వళులని పేరు పెట్టినాఁడు. అనంతుఁడీ ఋకార స్వరూపయతులు చెప్పిన తరువాతి రీవిరమును జెప్పి యున్నాఁడు. ఈ రీవిరమును గూర్చి యభిప్రాయ భేదము లున్నవి. కొందఱు పండితులు రీవిరమును కాదనియు నయ్యది 'ఋవడి' యనియుఁ జెప్పుచుండిరి. కానియయ్యది పరిశీలనాభావజనితాభిప్రాయమని తోఁచెడిని. ఎందువలనన రీవిరమును సెప్పు పద్యము నందుఁ బాఠభేదము లున్నను దరువాతి 88, 89 సంఖ్యలు గల పద్యములు 87 వ పద్యము నందలి "రీతోడి విరతి తలకొనదెందున్" అను వాక్యము "ఋవడి" కాక రీవిరమణమని బలపఱుచుచున్నవి. అనంతుఁడు చెప్పినదానికి నితరపండితులు చెప్పినవానిని క్రమముగాఁ జూపించుచు వాని దూరాపాస్తము చేయు నుదాహరణములను ఛందోదర్పణమునుండియే చూపించెదము.

ఋ ౠ ఌ ౡ యతి.—

"అనంతుఁడీ యతిని స్పష్టముగా నీ క్రింది పద్యములలో నాదేశించినాఁడు.

కం॥ విలసద్ఋకారమును వ
ట్రులు విరమణ మొందు శౌరి ఋషులకు శిశ్వ
త్సులభు-షవఁగ నీయేలకుఁ
దలపఘ రీతోడివిరతి తలకొనదెందున్.

గీ॥ మును ఋకారమియేలనో నొవరినట్లు
చెందొకట యణాదేశ కారణమున
ఘనలకారంబయును, స్వరల్ గారవిరతి
క్లిప్తిలేగు శౌరి గుణావళుల కనగ.

కాని యప్పకవి యీ యతులను గ్రహింపక పోవుటచేతను, ఋకారమునకు ఇ ఈ, ఎ ఏ ల తోడను రి రీల తోడను యతుల నాతఁడు చూపుటచేతను నీయనంతుని ఛందోదర్పణములోని పై పద్యము లిట్లు మార్పు గావింపఁబడినవి.

కం॥ విలసద్రికారమును మఱి
రిలలి విరమణ మొందు శౌరి ఋషులకు

అనియు—

క్లిప్తిలేగు శౌరి గుణావళికి వనగ

అనియు నప్పకవీయమునను సరించి మార్పు చేయఁబడినవి.

విలసద్రికారమును వ
ట్రిల విరమణమొందు శౌరి ఋషులకు

(అని పూర్వముద్రణము)

అనంతుఁడీవడిని తా నాదేశించుటయే కాక తన భోజరాజీయమునందు దానిని వాడియున్నాఁడు.

సీ॥ గృహధర్మనిరతులు కొనివచ్చి భక్తిపూర్వక
ముగా (ఆ 3. ప 27)

భాస్కరరామాయణమునుండి కొన్ని చూపుచున్నాను.

1. కొనియల్లకాలనేమి గృహమునకరిగన్ (యు. కాం. 1617.)
2. సురనదీ వీచులందఱియు శృంగములక్ (......2527.)
3. క్రూరాస్త్ర చంద్రార్ధకృత్తోరుబాహులై (......1456.)

పాఠములు మార్చినవి చూడుఁడు.

(1) పృథివి బగిల్చి బంగరపుఁ బింజలతూపుల్.
అచ్చుపాఠము 2015.

పుటక్రింది పాఠము.

పృథివి బగిల్చి హేమమయ పుంఖశరంబులు.

(2) పృథులతర విస్మయక్రమము,
పెంపొనరింపఁజూచి.
అచ్చుపాఠము.

పృథుతర విస్మయక్రమముఁ బొంపిరివోవఁగ.
(పుటక్రింది పాఠము 595)

—మడికి సింగన వాసిష్ఠరామాయణము—

తృణకణాంశంబు వజ్రమైత్రుం జమనస్సు,
(ఆ. 3 ప. 230)
కర్తృత్వ వెలింగి తోఁచుచుండు,
(ఆ. 3 ప. 12)

—గౌరన నవనాథ చరిత్ర—

తోడరిదొప్పఁగదోగి ధృతినుప్పఁదూలి (2.57)
నృపునితో నొండు గన్ఱును గాఁగఁ జెప్పి
అహోబలపతి కాళిందికళ్యాణము—
మృదువైన చేతులు ముంజ్ల పాదలు—

ఇన్ని ప్రయోగము లున్నను వైయాకరణ పారిజాతమున (91 పుట) వట్రులు విరమణ మొందు శౌరి ఋషులకు శిశ్వత్ (అముద్రితఛంద) అని యిట్లు ఋవర్ణముతో ఱువర్ణమునకు యతి చెప్పఁబడినది. కవి ప్రయోగములు దొరకనందున సరికాదని ముద్రణములో దిద్దివేసిరి. "అని యుండుట వింతగనున్నది." అని శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు ఛందోదర్పణ ద్వితీయ ముద్రణ పీఠికలో వ్రాసిరి. రివడిని ఋవడియని నిర్ధారించుటకు శ్రీ వెంకటరావుగారు కొన్ని యసందర్భమైనయుదాహరణములిచ్చిరి. ఆయుదాహరణములు చూడఁగనే మాకుఁ జాల ఆశ్చర్యము కలిగినది. అనంతుడు చెప్పిన పద్యములనుబట్టిచూచి మాకు "ఋవడి"గా

గాక 'రివడి'గా గన్పట్టుచున్నది. పోనీ వెంకటరావు గారు ఉదాహరించిన పూర్వకవి ప్రయోగములందు 'ఋవడి'ని బలపఱచుటకు ఎన్ని తగియున్నవో చూతము.

క్రూరాస్త్ర చంద్రార్ధకృత్తోగ్ర బాహులై--తృణ కణాంశంబు వజ్రమైతుంచు క్రూ—కృ, తృ—త్రు, అనుని రెండు ఉదాహరణములు మాత్రమే వారి ఋవడిని బలపఱచుచున్నవి. మిగిలిన వన్నియు హల్ మైత్రి కుదిరినపుడు వట్రువసుడికి (కృ—తృ మున్నగువాని ఋకారమునకు) ఉ ఊ ఒ ఓలతోడ మైత్రి తెలుపుచున్నవి. పరికింపుడు.

గృహధర్మనిరతులు గొనివచ్చిభక్తిపూర్వకముగా
గృ—గొ లకు యతి
కర్తృత్వమును వెలింగి తోఁచు చుండు
(క) ర్తృ—తో లకు యతి
తొడలి దొప్పగఁదోగి స్మృతి గుప్పఁదూలి
తో—స్మృ లకు యతి.
మృదువైన చేతులు ముంచెపాదిలు
మృ—ములకు యతి

ఈపైన చూపినవన్నియు ఋవడిని తెలుపుట లేదుకదా. పై ప్రయోగము లన్నియు నంగీకరించువారును గలరు. కాని వానికి ప్రత్యేక లక్షణము చెప్ప వలసియున్నది. ఇఁక ఋవడిని బలపఱచునట్టి ప్రయోగములు ప్రయోగించినవారు పొరపడి యుందురని తోఁచుచున్నది. "క్రూర, త్రుంచు" అనునవి వట్రువసుడి కలిగిన రూపము లనుకొని ప్రయోగించి యుందురు. అటి పొరపాటు ప్రాచీనులు, ఆధునికులును పడుచుండి రనుటకు సందేహము లేదు. అందుచే ననంతుఁడు తన ఛందోదర్పణమునందు

"తెలుఁగు నందు లేదు లలిఁ గ్రిందు సుడి గ్రుచ్చి
గ్రుమ్మె నాఁగ రేఫ గొమ్ము గాని"

అని చెప్పియున్నాఁడు "క్రూర" అను సంస్కృత పదమునందు త్రుంచు అను తెలుఁగు పదమునందును క్రొవడి కాక వట్రువసుడి యని భ్రమ పడి యుందురు లేక అట్టి ప్రయోగములు వారలకు నిష్టమైయుండి యుండవచ్చును అందు కృ—క్రూలకు తృ—త్రులకు యతి మైత్రి వేసిరి. ఇఁక ననంతుఁడు తన ఛందోదర్పణము నందుఁ జెప్పినది 'రివడి'యా? లేక 'ఋవడి'యా? దానినిఁ బరిశీలింతము.

కం॥ విలసద్రుకారమును వ
ట్రులు విరమణ మొందు శౌరిఋషులకు శిశ్వ
త్సులభుఁడనఁగ నీ యేలకుఁ
దలఁపఁగ రీతోడి విరతి తలకొన దగుఁన్.

(ఛందో ప్ర. 8 ఆ. 87.)

ఈ పద్యమునందుఁ గొన్ని పొరపాటులున్నవి. వానిని ముందు సవరింపవలయును. నిరాధారముగా సవరించుట తగదు. ఆ పద్యమునందలి యాధారము తోడనే వాని సవరింపవలయును. చివరి పాదమునందు "రీతోడి విరతి తలకొన దగుఁన్" అని చెప్పబడినది కనుక "విలసద్రికారము" అని యుండవలయును. ఇఁక రెండవపాదము దాని లక్ష్యముగా నున్నది. అందు 'వట్రులు' అని యున్నది. అద్యది 'వట్రిల' అని యుండవలయును. ఈ మార్పునుబట్టి యాపద్య మిట్లుండును.

కం॥ విలసద్రికారమును వ
ట్రిల రీ విరమంబు శౌరి ఋషులకు శిశ్వ
త్సులభుఁడనఁగ నీ యేలకుఁ
దలఁపఁగ రీతోడి విరతి తలకొన దగుఁన్.

గీ॥ తెలుముగ ఋకారము యణాదేశ శక్తి
గలుగు రేఫ యిత్వమునందుఁ గదిసి యతికి
నటరీతి నీ యేలతో నన్వయించు
నటి సత్త్వంబు లేదది హల్లుగాన.
ముదు ఋకార మీ యేలతో నొనరినట్లు
చేరకొకట యణాదేశ కారణమున
ఘన లకారంబ మగుచు, ఇకార విరతి
క్షప్తిలేదు శౌరి గుణావళికి ననగ.

అనంతుఁడు 'రివడి'ని యిన్ని పద్యములందు నిరూపించి యుండినది 'ఋవడి' కాదు 'రివడి' యని చెప్పఁబూనుట మహాశ్చర్యము. "విలసద్రికారము" అను 87 వ పద్యమునందు ఋకారము ముతో రివర్ణము వడిపొందునని యు రివడి యను పేరుతో నొప్పుచుండునని యుఁ జెప్పెను. రివర్ణము ఋకారముతో మైత్రి చెందినపుడు ఋకారముతో మైత్రి చెందు ఇ ఈ, ఎ ఏ లు గూడ రివర్ణమునకు యతి మైత్రి చెల్లవలసి వచ్చుచుండగా "ఈ యేలకుఁ దలఁపఁగ రీతోడి విరతి తలకొన దగుఁన్" అని ఋవర్ణ ముతో మైత్రి చెందు రివర్ణముతో ఇ ఈ, ఎ ఏ లకు యతి మైత్రి నిషేధించినాఁడు. దీనినిబట్టి మాఱ స్వర యతితో సిద్ధించిన మైత్రిగల ఇ ఈ ఋ ఎ ఏ లలో నొక్క ఋకారమునకు మాత్రము రివర్ణముతో మైత్రి కలదనియు, ఋకారముతో మైత్రి కలదయ్యును ఇ ఈ, ఎ ఏ లు రివర్ణముతో మైత్రి నొందదనియు స్పష్ట ముగా విధించినట్లు తెలియుచున్నది కదా. మఱి యింతియే కాక 88 వ పద్యమునందు నట్లు ఋవర్ణముతో రివర్ణము యతి చెల్లుటకును, ఇ ఈ, ఎ ఏ లు రివర్ణముతో జెల్లక పోవుటకును హేతువు గూడ వక్కాణించి యున్నాఁడు. చూడుడు.

గీ॥ తెలుముగ ఋకారము యణాదేశ శక్తి
గలుగు రేఫ యిత్వమునందుఁ గదిసి యతికి

వట్టి రీకనీయేలతో నన్వయించు
వట్టి సత్త్వంబు లేదది హల్లుగాన
ఛందో. ప్ర. ఆ. ప. 88.

సంస్కృత వ్యాకరణములో "ఇకోయణచి" అను సూత్రముచేత ఋకారమునకు రవర్ణము వచ్చును. అట్టి యాదేశ శక్తిచే వచ్చిన రవర్ణము ఇకారముతోఁ గూడి ఋకారముతో మైత్రి నొందుచున్నదనియు, వట్టి 'రి' హల్లయినను ఋకారమును రకార సంబంధముచే హల్లునగును. కావున ఋకార రికారములకు ప్రతిబంధకమేమియు లేదు. ఇ ఈ, ఎ ఏ లు అచ్చులు, రివర్ణము హల్లు. అగుటచే స్థానాన్యకేశభవముగాని సాజాత్యముగాని లేదు కనుక రికి ఇ ఈ, ఎ ఏ లతో మైత్రి కొంకునట్టి సత్త్వంబు లేదు. అని విస్పష్టముగా నిరూపించి యున్నాఁడు.

ఇఁక 89 వ పద్యమునందు విశదముగా రెండు పాదములందుఁ జెప్పినాఁడు. ఋకారావస్థలో అచ్త్వమే యుండుటచే స్వరయతితో ఋకారము ఇ ఈ, ఎ ఏ లతో మైత్రి నొందినను ఇపుడు రకారావస్థలో యణాదేశ సంబంధముచే హల్త్వము పొందుటచే రికి ఇ ఈ, ఎ ఏ లతో మైత్రి లేకపోయెను. అని పునఃపునః స్పష్టము గావించియున్నాఁడు. కావున ఈ సంబంధమెల్ల 'ఋవడి'కే కాని 'రివడి'కి మాత్రము సంబంధము లేదని తెలుచున్నది. ఇటు అనంతుఁడు తన ఛందోదర్పణమునందు 'రివడి' యని ఘంటాపథముగాఁ జెప్పియుండె పండితులు కొందఱిప్పుడది 'ఋవడి' అని యెట్లు చెప్పుచుండిరో బోధపడకున్నది. పండితులు పరికింతురుగాక.

# పాణిని
# ఇతర వైయాకరణులు

## శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తి

భారతదేశమునం దుద్భవించిన మహామేధావులలో పాణిని యొకఁడు. ఇతఁడు కనీసము రెండువేల మూఁడువందల సంవత్సరముల క్రిందటివాఁడయి యుండునని చారిత్రకుల కథనము. పాణిని రచించిన యష్టాధ్యాయివలన నంతకు పూర్వము ప్రచారములో నున్న యైంద్ర వ్యాకరణాదులు గతార్థములగుటతో వాని విస్మృతిపథమునుబట్టి పోయినవి. "ప్రసునే ఉపశాన్తే చోక్తేవా ప్రమాదాత్ పాణినిం స్మరేత్" సంస్కృతభాషయం దేదేని యపశబ్దమును ప్రమాదవశమున వినినను, పలికినను తద్దోషనివృత్తికయి పాణినిని స్మరింపవలయునట. గీర్వాణభాషపై నింత యధికారము నచిరకాలములోనే యీ మహామహుఁడు సంపాదించెను. ఇతనిపిమ్మట వచ్చిన వరరుచి పతంజలి మున్నగు వైయాకరణులు ఇతని మార్గమునే యనుసరించుటయు నిందులకొక కారణము.

అనాదియగు గీర్వాణభాష పాణినీయముచే సంస్కృతమై సంస్కృతమైనది. సంస్కృతమువంటి బృహద్భాషకు ఎనిమిది యధ్యాయములలో దాదాపు సమగ్రమగు వ్యాకరణమును రచించిన పాణిని మహర్షి నిజముగాఁ బ్రశంసార్హుఁడు. ప్రపంచములో మఱే భాషకు నిట్టి నిర్దుష్టము సంక్షిప్తమునగు వ్యాకరణము లేదని తజ్ఞులు చెప్పుదురు.

అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతోముఖమ్
అస్తోభ మనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః.

అను సూత్రలక్షణము పాణిని సూత్రములకే యథాక్షరముగ నన్వయించును.

సూత్రములో నేక మాత్రోచ్చారణముఁ దగ్గింపఁ గలిగినచో వైయాకరణులు పుత్రోత్సవమును బడయుదురఁట. అట్టితఱి పాణిని తన యష్టాధ్యాయీ సూత్రములలో బహ్వక్షరము లయిన యితర వైయాకరణుల నామధేయములను గ్రథియించుటలో బహువిధ ప్రయోజనము నే యాకాంక్షించి యుండును.

అష్టాధ్యాయిని జెప్పుటలోఁ బాణినికి రెండు తాత్పర్యములు గలవని భాష్యాది గ్రంథకర్తల సిద్ధాంతము. అందు మొదటిది తాను చెప్పినపదములు లక్ష్యసాధకార్థబోధకములయి యుండవలయు ననునది. రెండవది తనచే నిర్దిష్టమగు నానుపూర్వి గల గ్రంథము యొక్క పారాయణముచే నదృష్టఫలము లభించు ననునది. "..........తనుక్త మికోయణచీతి సూత్రే భాష్యే సామర్థ్యయోగాన్న హి కించిదత్ర। పశ్యామి శాస్త్రే యదనర్థకం స్యాదితి. కించిదృష్టాదృష్టార్థవత్. కించిచ్ఛుద్ధాదృష్టార్థవత్. సర్వథాఽనర్థకం న కించిదితి తదర్థః" అని శేఖరమునఁ బ్రారంభమునందే వ్రాయఁబడెను.

కావునఁ బూజ్యులగు నా పూర్వవైయాకరణుల నామగ్రహణమువలన మతాంతర సంగ్రహణమే కాక, తన్నామోచ్చారణమువలన నదృష్ట ఫలమును గలదని పాణిని తాత్పర్యము. ఈ విషయమునే భట్టోజీదీక్షితుఁడు "ఆపిశలిగ్రహణం పూజార్థం", "సేనకగ్రహణం పూజార్థం", "గాలవగ్రహణం పూజార్థం", "గార్గ్య గ్రహణం పూజార్థం", ఇత్యాదులచే వల్లడించెను.

పాణిని తన యష్టాధ్యాయిలోఁ బదిమంది యితర వైయాకరణులను స్మరించెను. అందు సూత్రక్రమమును

బట్టి ప్రథముఁడు I శాకల్యుఁడు. ప్రథమాధ్యాయ ప్రథమ పాదమున నొకచోటను, నాలవ యధ్యాయమున నొక చోటను, ఎనిమిదవ యధ్యాయమున రెండు చోటను నితఁడు పేర్కొనఁబడెను. సూత్రక్రమమును బట్టియే కాక సూత్రసంఖ్యను బట్టి కూడఁ బాణినిచే నెక్కువ స్మరింపఁబడినవారిలో నితఁడు ప్రథముఁడు. తరువాతివాఁడు II కాశ్యపుఁడు. ఇతఁడు ప్రథమాధ్యాయ ద్వితీయ పాదమున నొక తావునను, అష్టమాధ్యాయ చతుర్థపాదమున నొక తావునను పేర్కొనఁబడెను. క్రమములో మూఁడవవాఁడు సుగృహీత నామధేయుఁడగు III శాకటాయనుఁడు. ఇతఁడు తృతీయాధ్యాయమున నొక చోటను, అష్టమాధ్యాయమున రెండుచోట్లను పేర్కొనఁబడెను. పాణినిచే నెక్కువగా స్మరింపఁబడినవారిలో నితఁడు ద్వితీయుఁడనవచ్చును. సేనకుఁడు "గిరేశ్చ సేనకస్య 5-4-112". అని పంచమాధ్యాయమునందును; ఆపిశలి, స్ఫోటాయనుఁడు, చాక్రవర్మణుఁడు నను వారు ఆఱవ యధ్యాయమున "వా సుప్యాపిశలేః 6-1-92" "అవఙ్ స్ఫోటాయనస్య, 6-1-123" "ఈ చాక్రవర్మణస్య" 16-1-130 అను నొక్కొక్క సూత్రమున పేర్కొనఁబడిరి.

క్రమములో నెనిమిదవవాఁడు VIII గాలవుఁడు. ఇతఁడాఱవ యధ్యాయమున నొకసూత్రమునఁ బ్రత్యేకముగను, ఏడవ యధ్యాయమున గార్గ్యునితో పాటొక సూత్రమునను; ఎనిమిదవ యధ్యాయమున గార్గ్య కాశ్యపులతో పాటుగా నొక సూత్రమునను స్మరింపఁబడిరి. భారద్వాజుఁడు తొమ్మిదవవాఁడు. ఈతఁడు "ఋతో భారద్వాజస్య 7-2-63" అని సప్తమాధ్యాయ ద్వితీయపాదమున నొకచోట నుదాహరింపఁబడెను. ఇతఁడొక సూత్రమునఁ బేర్కొనఁబడినను, సిద్ధాంత కౌముదిని పఠించినవారికిఁ బ్రసిద్ధమగు భారద్వాజ ఘటనముమూలమునఁ దక్కినవారికంటె నితఁడెక్కువగ స్మృతిపథమున మెలఁగుచుండును. కడపటివాఁడు X గార్గ్యుఁడు. ఇతఁడు తొలిసారిగా సప్తమాధ్యాయ తృతీయపాదమున గాలవునితోఁ గలిపి యొక సూత్రమునను, అష్టమాధ్యాయ తృతీయ పాదమునఁ బ్రత్యేకముగ నొక సూత్రమునను, అష్టమాధ్యాయ చతుర్థ పాదమునఁ గాశ్యప గాలవులతోఁ గలిపి యొక తావునను పేర్కొనఁబడెను.

నామనిర్దేశము నర్పియే కాక విడిగాఁ గూడ "ఆఙాచార్యాణామ్", "దీర్ఘాదాచార్యాణామ్" "హలి సర్వేషామ్" అని పాణిని పూర్వవైయాకరణుల మతములను స్పృశించి యున్నాఁడు. మొత్తముమీఁద; శాకల్యుఁడు, కాశ్యపుఁడు, శాకటాయనుఁడు, సేనకుఁడు, ఆపిశలి, స్ఫోటాయనుఁడు, చాక్రవర్మణుఁడు, గాలవుఁడు, గార్గ్యుఁడునను పదిమంది యితర వైయాకరణులు పాణినీయమునఁ బేర్కొనఁబడిరి. సిద్ధాంత కౌముది స్వర ప్రక్రియలోనున్న ఫిట్సూత్రముల ప్రణేతయగు శాంతనవాచార్యుఁడను పూర్వ వైయాకరణు నీసందర్భమున స్మరించుట యుక్తముగా దోచుచున్నది.

> ఇన్ద్రశ్చన్ద్రః కాశకృత్స్నాపిశలీ శాకటాయనః
> పాణిన్యమర జైనేన్ద్రా జయన్త్యష్టాది శాబ్దికాః

అని 'ఇతరత్ర' కూడ శాకటాయనుఁడు, ఆపిశలి ప్రసిద్ధ శాబ్దికులుగా స్తుతింపఁబడి యున్నారు. కావున పాణినిచేఁ బేర్కొనఁబడిన పైవారందఱు నతని కాలమునకో, యతని కాలమునకో సుప్రసిద్ధులగు వైయాకరణులయి యుందురని చెప్పవచ్చును. వారి రచనలేవియు నీనాఁడుపలబ్ధము లగుటలేదు. భవతు నామ. పాణినితో పాటు, పాణినీయములోఁ బేర్కొనఁబడిన శాబ్దికవరులకును నమోవాకము లర్పించుచున్నాను.

---

I. (1) సంబుద్ధౌ శాకల్యస్యేతావనార్షే (1-1-16)
(2) ఇకోఽసవర్ణే శాకల్యస్య హ్రస్వశ్చ 6-1-127
(3) లోపః శాకల్యస్య 8-3-19.
(4) సర్వత్ర శాకల్యస్య 8-4-51.

II (1) తృషి మృషి కృషేః కాశ్యపస్య. 1-2-25.
(2) నోదాత్తస్వరితోదయమగార్గ్య కాశ్యప గాలవానామ్ 8-4-67.

III (1) లఙః శాకటాయనస్యైవ 3-4-111.
(2) వ్యోర్లఘుప్రయత్నతరః శాకటాయనస్య 8-3-18.
(3) త్రిప్రభృతిషు శాకటాయనస్య 8-4-50.

VIII. (1) ఇకో హ్రస్వోఽఙ్యో గాలవస్య 6-3-61.
(2) అడ్గార్గ్య గాలవయోః 7-3-99.
(3) నోదాత్తస్వరితోదయమగార్గ్య కాశ్యప గాలవానామ్ 8-4-67.

X. (1) అడ్గార్గ్య గాలవయోః 7-3-99.
(2) ఓతో గార్గ్యస్య 8-3-20.
(3) నోదాత్తస్వరితోదయమగార్గ్య కాశ్యప గాలవానామ్ 8-4-67.

---

## సవరణ

గతమాసం భారతిలో (నవంబరు 1957) ప్రచురింపబడిన 'విశ్వాంతరయానం' అనే వ్యాసంలో వి-2 రాకెట్ నిర్మాతపేరు 'హెర్మన్‌వాన్ బ్రాన్' అని అచ్చయివున్నది. 'వెర్నర్ వాన్ బ్రాన్' అని యుండవలెను. పాఠకులు గమనింప ప్రార్థన.

# గ్రంథవిమర్శనము

## మదనగోపాల శతకము

రచన: క్రీ. శే. మేకా బాపన్నకవి (పండిత బాపన్న); ప్రచురణ: మేకా పల్లమ్మగారు; ఆచంట, పశ్చిమ గోదావరిజిల్లా; అమూల్యము. పోస్టుఖర్చులకు గాను 15 నయాపైసలు పంపిన ఉచితముగా బాపన్న గారి శతకములను పంపగలమని పల్లమ్మగారు తెలుపుతున్నారు.

పల్లమ్మగారు గ్రంథకర్త బాపన్నగారి మనుమడు క్రీ. శే. మేకా సుబ్బారాయుడుగారి భార్య. తాత గారి గ్రంథములను ఆంధ్రప్రజలకు అందజేయవలెనని సుబ్బారాయుడుగారు తీవ్రాభిలాషతో వుండేవారట. ఆ ఉద్యమం సఫలం కాకముందే ఆయన పరమపదించారు. భర్త మరణానంతరం, ఆయన అభిలాషను తీర్చటానికి పల్లమ్మగారు పూనుకోవటం అపూర్వప్రాయంగా వుంది. సాహిత్యచరిత్ర దృష్ట్యా అమూల్యములైన ఈ రచనలు నశించిపోకుండా ముద్రించి అందజేసినందుకు ఆంధ్ర సాహిత్యలోకం పల్లమ్మగారికి కృతజ్ఞత తెలుపవలసివుంది.

బాపన్నగారు క్రీ. శ. 1850 లో రామేశ్వర శతమును, 1863 లో మదనగోపాల శతకమును రచించారు. 1908 లో ఈ శతకముల తొలి ముద్రణ జరిగింది. కాని కొలది ప్రతులుమాత్రం అచ్చువేసి, ఆ కుటుంబంవారు వారి బంధువులకూ, సన్నిహితులకుమాత్రం పంచిపెట్టడంవల్ల సాహిత్యలోకంలో వీటికి తగిన ప్రచారం లేకపోయింది. అందుచేత ఈ రచనలలోవున్న అనేక తెలుగుపదాలు నిఘంటువుల కెక్కే ఆస్కారం లేకపోయింది. ఈ రెండు శతకములలో ఆచంట రామేశ్వర శతకముపై విమర్శ 'భారతి' గత అక్టోబరు సంచికలో (1957 అక్టోబరు) ప్రచురించి వున్నాము.

బాపన్నగారు సంస్కృతాంధ్ర భాషలలోనే గాక శైవవైష్ణవ మతతాత్త్వికసంప్రదాయ వాఙ్మయములలో విశేష పాండిత్యం గలవారు. రామేశ్వర శతకములో శైవసంప్రదాయంలో వీరికి గల అభిజ్ఞత స్పష్టంగా కనుపించుతుంది. మదనగోపాల శతకంలో అదేవిధంగానే వైష్ణవసంప్రదాయ పరిజ్ఞానం విశేషంగా కనుపించుతుంది. ఈ రెండు శతకములు శివకేశవులపట్ల వీరికిగల అభేదదృష్టికి తార్కాణంగా వున్నాయి.

పాండిత్య విషయం ఇలా వుండగా కవిగా శ్రీ బాపన్నగారి ప్రతిభ కొనియాడదగియున్నది. రచనలో ప్రాచీన కవుల హుందాతనం బలవత్తరంగా కనుపించుతుంది. శబ్దాలంకారసంచాలనంలో పోతన వన్నెచిన్నెల నన్నిటినీ పుణికి పుచ్చుకున్నారు.

"సంస్కృతాంధ్ర శేముషీబాహ్య గౌరవ
వృత్తి శయ్యాగుణ రీతులెరుగ,
ప్రాస విశ్రమగణ ప్రక్రియ ప్రస్తార
భావ నిరూపణ ప్రౌఢి నేర,
నాటకాలంకార చాటుకావ్య పురాణ
శాస్త్రంబు లెవ్వియు జదువనేను,
శతకంబు తావక చరణార్పితంబుగా
విరచనా కౌతుక వృత్తినలయు
నట్టి నను కృశధిషణు ననన్య సులభ
దయను గని దీని తుదముట్ట జేయుమయ్య!
బుధజనోల్లాస! ఆచంట పురనివాస!
భక్తజనపాల! మదనగోపాల బాల!"

అని అతి వినయంగా, బాపన్నగారు పరమాత్మునకు నివేదించుకున్నారు. ఈ పద్యంలో ఏవేవి తనకు తెలియవని చెప్పుతున్నారో వాటన్నిటిలో నిష్ణాతుడనని తెలుసుకోమంటున్నారు కాబోలు! "కృశధిషణ" ప్రయోగం దానంతటదే కవి ప్రతిభా సంపత్తిని మనకు పట్టియిస్తూ ఆయన వినయసంపత్తిపట్ల అబ్బురపాటును కల్గిస్తున్నది.

బాలగోపాలోపాసకులై సాక్షాత్ పరమేశ్వరావలోకనం చేసిన లీలాశుకాది మహాపురుషుల గోపాల వర్ణనలకు దీటుగా బాపన్నగారు మదనగోపాలుని అభివర్ణించారు.

"సీ॥ చిన్ని క్రొన్నెలవన్నె చెన్ను నెన్నుదుటను
దిద్దిన కస్తూరి తిలకమమర
యురమున కట్టాణి పొంగుమంచి ముత్యాల
సరుల నిద్దానిగ్గు చౌకళింప
పదములు పచ్చరా పలుకల బొంగారు
బంగారు రవల పావడ చెలంగ

గొల్లపిల్లలతోడగూడి కోడెల మేపి
జాతిటభూసుల మేత మేపు,
నీవయారంబు నీసొగసు నీచాకార
మహహా! వ్రాయవ్వ వలపియే యజునకైన
బుధజనోల్లాస! ఆచంటపురనివాస!
భక్తజనపాల! మదనగోపాలబాల.

*　　　*　　　*

సీ॥ గిల్పతాణీ కిటికీబాగు పైతాణి
పాగపైపచ్చరాపసతురాయి.
కెంపగీలించి వజ్రంపు కళుకులసరి
శేషు హోయధరించి బెళుకు తళుకు
గీనాబు నిల్వుటంగీబూని సెరవ్యురీ
నిగ్గుమొగలకుడి నీయిజాగు
గడి మొఖమల్ దటి నషెకట్టుగా గట్టి
పసిడి వాఘరుజు డాబానువైచి,
తేటనహల యుడాన్వాజి గేజినెక్కి-
వడలు నీసొగసు గనుచుందు నెలదిపిందు
బుధజనోల్లాస..."

నవాబు దర్జాతో వెలుగుతున్న పరమేశ్వరుని దర్శించుతున్నారు బాపన్న పైపద్యంలో.

ప్రతిపద్యాన్నీ ఉటంకించి చూపవలసివస్తుంది గనుక అలాంటిది ఇక్కడ సాధ్యంకాదు గాని, శబ్ద ప్రయోగంపట్ల, సమాస నిర్మాణంపట్ల, శబ్దాలంకార చలనంపట్ల మోజుగలవారు ఈ రచనను ఎంతో ఆహ్లాదించగలరు. తెలుగుపదాల సేకరణకు నూత్న నిఘంటు కారులు తప్పక ఈ రెండు శతకాలనూ పరిశీలించవలసి వుంది.

ప్రతిభావ్యుత్పత్తులు రెండూ పుష్కలంగాగల ఈ రచయిత యేదేనా ఒక కావ్యాన్ని రచించటానికి పూనుకోకపోవటం దురదృష్టం. పరమేశ్వర భక్తిభావం వీరిని అట్టికావ్యంనుంచి విముఖుని చేసిందేమో!

## అ మృ త వా హి ని

రచన : శ్రీ సీతారామయతీంద్రులు, ప్రచురణ : ముముక్షుజన గ్రంథమాల పవరుపేట, ఏలూరు. వెల రు 1-80

ఇది భగవద్గీతకు వ్యాఖ్యా ప్రథమసంపుటి. గీత 18 అధ్యాయములకూ క్రమంగా ఈ అమృతవాహిని వ్యాఖ్య వెలువడుతుంది. ఇది ప్రథమాధ్యాయ వ్యాఖ్య మాత్రం.

గీత మన తాత్వికరంగాని కంతకూ కేంద్రమైన మహాగ్రంథం. గీతామార్గాన మన జాతీయ జీవన విధానం యుగయుగాలుగా రూపొందించబడి వున్నదంటే ఇందులో అతిశయోక్తిలేదు. లేదా జాతీయ జీవనానికి ఇది అక్షరరూపం అని చెప్పవచ్చును. చెప్పవచ్చును [illegible] అందుచేతనే గీతా ప్రబోధానికి విరోధమైన యే రూపంలో గాని ఏ ఉద్యమం ప్రారంభమైనా అది జాతీయ జీవనానికి విభిన్నమైనది కావటంచేత ఈ గడ్డ మీద చావుదెబ్బ తింటుంది. బౌద్ధమతం అందుచేతనే ఇక్కడ ఎంతో కాలం మన లేకపోయింది. ఆచార్య త్రయం తమ తమ మతాలకు ప్రాతిపదికగా గీతను శిరోధార్యంగా అంగీకరించటంలోగల పరమార్థం ఇదే.

శ్రీ యతీంద్రులవారు పీఠికలో ఇలా అన్నారు:

"గీతను పఠించుట రెండు విధములు. ఒకటి గీతలో ఏమి చెప్పబడియున్నది? అని దానిలోని సత్యమును తెలిసికొను బుద్ధితో పఠించుట. రెండు, తాను ఒక అభిప్రాయమును కలిగియుండి దానిని సమర్థించుకొనుటకు గీతను ఉపయోగించుకొనుట. మొదటి విధానము ఉత్తమమైనది. రెండవ విధానము ఆచరింపరానిది."

పై వాక్యాలు ఆశ్చర్యజనకంగా వుండటమే గాక, సంప్రదాయ విరుద్ధంగాకూడా వున్నాయి. అసద్భావము కాకపోను ఒక స్వతంత్రమైన భావము కలిగియుండుట నిషిద్ధమా? దానిని సమర్థించుకోటానికి ఆప్తవచనముగా గీతను సేకరించటం దోషమా? అట్లయిన ఆచార్యత్రయము చేసినది పాడుపనియా?

యతీంద్రులవారు సహితము తమ యభిప్రాయములకు ఉపబలకముగా గీతకు ఈ నూతన వ్యాఖ్యను రూపొందించుచున్నారే. ఏ గ్రంథమందైనను పాఠకుని సంస్కృతినిబట్టి అనేకార్థములు గోచరమగు ననుచున్నారే. లేక గీతాపాఠకుడు తనకు తోచిన భావములే పరమ ప్రమాణములని నమ్మవలయుననీ, మహా మేధావులైన యితర వ్యాఖ్యాతల పరిశీలనముల గుర్తింపరాదనీ యతీంద్రులవారి అభిప్రాయమా? అట్లయిన తాము స్వయముగా యీ వ్యాఖ్యానమున తెలుపకుండు చున్నారు. వారి వాక్యములు చాలా సందిగ్ధముగా వున్నాయి.

నిజానికి "ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః' అన్న ప్రవేశికరూపమైన శ్లోకానికి శ్రీ యతీంద్రులవారు యిప్పించిన టీక గాని, వ్యాఖ్యానం గాని, బడిపిల్లలకు పాఠంచెప్పేపద్ధతిలో చాలా నీరసంగా వున్నాయి. 'ధర్మక్షేత్రే. కురుక్షేత్రే, సమవేతా యుయుయుత్సవః, మామకాః (ధృతరాష్ట్ర)), పాణ్డవాశ్చైవ, సంజయ' అనే పదబంధాలలో ఇమిడివున్న అర్థవిశేషాలనూ, ధ్వనులను అవగతంచేసుకోలేకపోతే గీతాహృదయంలోకి ప్రవేశం లభించటమే దుర్లభమౌతుంది. మహామహులైన వ్యాఖ్యాతల సహాయం లేనిది సామాన్యులకు ఈ శ్లోకంయొక్క పరమార్థం అవగతం కావటం కష్టం. ఆ వ్యాఖ్యాతలతో అంగీకరించినా అంగీకరించకపోయినా వారిఅభిప్రాయాలను స్పృశించి విమర్శించివుంటే సమంజసంగా వుండేది.

మీదు మిక్కిలి ఈ పీఠికాభాగంలోనే, పతంజలి యోగసూత్రములను తృణీకరించారు. "యోగశ్చిత్త వృత్తి నిరోధః" అన్న ఒక్కసూత్రాన్ని తీసుకుని అనంతరం ప్రవచింపబడిన సూత్రాలతో సమన్వయం లేకుండా—అనగా యోగసాధకుని అర్హతలు నిర్వచింపబడిన సూత్రములతో సమన్వయము లేకుండా యేమేమో విచిత్రంగా వ్యాఖ్యానించారు. ఇది కడు సాహసం. యోగసాధనను మత్తుమందుతో పోల్చారు. మత్తువిడగానే తిరిగి బాధ కలుగుతుందన్నారు. యోగసిద్ధి పొందినవారికి తిరిగి దుఃఖప్రాప్తి కలుగుతుందనడానికి తగిన ప్రమాణమేమీ కనుపించటం లేదు. పైగా యతీంద్రులవారి వాక్యాలనుబట్టి, పతంజలి సూత్రములకు గీతకు వైవిధ్యమున్నదనే అభిప్రాయం పాఠకునికి కలిగే ప్రమాదం యేర్పడుతోంది. ద్వితీయభాగపు పీఠికలోనైనా ఇట్టి ప్రమాదం ఏర్పడకుండా యతీంద్రులవారు తగు జాగ్రత్త తీసుకోగలరని ఆశించుచున్నాము. పతంజలినే కొట్టిపారేస్తే 'రసో వై సః' అనే ఉపనిషద్వాక్యానికి తగిన వ్యాఖ్యానమే లభించదు. ఈ సూత్రాన్ని త్రోసిరాజంటే ఈ దేశంలో వున్న సమస్త కళలశాస్త్రాల మూలపీఠాన్నే లాగివేయడమౌతుంది. ఇలా చేస్తే ఇక ఇక్కడ మిగిలేది ఏమిటి? మనజీవన విధానానికి గల తాత్త్వికాధారమే భగ్నమై అయోమయస్థితి ఏర్పడుతుంది. ఈ సూత్రములన్నీ ఉబుసుపోకకు చెప్పినవి కావు. జాతీయ జీవన విధానంతో ముడిబడి వున్నాయి వీటికి ఒకదానికి ఒకటి ఎంతో సంబంధం వుంది. వీటిని ఉదాసీనంగా కొట్టివేయటానికి ఆస్కారమేమీ లేదు.

ఈ గ్రంథంలో మూలశ్లోకాలను ఇచ్చారు. వాటిక్రింద టీకను పొందుపరచారు. తాత్పర్యమిచ్చారు. ఆపైని అమృతవాహిని వ్యాఖ్యను రచించారు. ఈ వ్యాఖ్యలో రచయిత ఆయా సందర్భములను బట్టి భారత గాథలోని అనేకమంది మహాపురుషుల జీవితగాథలను అందజేశారు. ఇవి ముచ్చటగా వున్నాయి.

యతీంద్రుల వారి తెలుగుశైలి సరళమై హృదయ రంజకంగా వుంటుంది. సమస్త దర్శన శాస్త్రములయందూ విశేషపాండిత్యం గలవారు. ఆ విషయం గ్రంథం సర్వత్రా కనుపించుతుంది. భక్తిభావ ప్రచారం పరమాశయంగాగల పరమపరివ్రాజకులు. వీరి మహోద్యమం సఫలీకృతం కాగలదని ఆశించుచున్నాం.

## సీతారామాయణము

పద్య కావ్యము; రచన కీ|| శే|| కుమారి రావి సీతాదేవి, కుమారి రావి గౌరీవాగీశ్వరీదేవి—ప్రచురణ రావి బ్రదర్స్, పలాసా, శ్రీకాకుళంజిల్లా. వెల రు 2-0-0

కుమారి గౌరీ వాగీశ్వరిదేవి, సీతాదేవి వీరిద్దరూ, రామకృష్ణాపురవాస్తవ్యులు, శ్రీ రావి రామమూర్తి పంతులుగారి కుమార్తెలు. వీరిద్దరూ కవయిత్రులు ఇద్దరూకలసి మహాలక్ష్మీభాగవతం రచించారు. శ్రీ గౌరీ వాగీశ్వరీదేవి వెంకటాచల మాహాత్మ్యము రచించారు. సీతాదేవి స్వయంగా సీతారామాయణము సంఘటించారు. సీతాదేవి తన రామాయణముతో పాటు జీవితమును కూడా ముగించుకొని, 14 వ సంవత్సరము దాటకముందే శ్రీరామచంద్రునిలో లీనమైనారు. (1946) ఈ ప్రకాశకులు ఈ సోదరిమణుల సోదరులు. వారికి ఈ గ్రంథముల ప్రచురించగలస్తోమతు లేదు అందుచేత, ఈ గ్రంథాలను అతి సంక్షిప్త రూపంలో ఈ సంపుటిగా అందజేశారు. సీతారామాయణం మొత్తము 40500 పద్యములుగల రచన. దీన్ని 167 పద్యాల సంక్షిప్త రూపంలో ఇందు పొందుపరచారు. సీతాదేవి నిష్క్రమణ ఆధునాతనాంధ్ర సాహిత్య చరిత్రములో ఒక విషాద సంఘటన. 14 సంవత్సరముల బాల్యప్రాయమునందే, కొమ్ములు తిరిగిన వారికి అందని ప్రతిభావ్యుత్పత్తులను సంతరించుకొనగలగటం, భక్తిరస ప్రపూర్ణంగా సీతారామ చరి

# గ్రంథ విమర్శనము

త్రను ఉజ్వలరూపంలో గానం చేయ్యటం—అంతలో అదృశ్యురాలు కావటం—ఇదేమి కారణ జన్మమా?

ఈ సీతారామాయణం అనేక చిత్రవిచిత్ర కల్పనలతో నిండివుంది.

కౌసల్యా సుప్రజ అయిన రాముడు కౌసల్య ఒడిలో నొదిగి ఆరోపిత బాలభావమున, ప్రాకృతుని భంగి నింగినిగల చంద్రుని ఆటవస్తువుగా నిమ్మని అడిగినాడు. కవయిత్రి హృదయము మాతృభావము వహించి భగవంతుడైన రాముని పుత్రునిగా భావించి మురియుచూ, కౌసల్య వాక్కుగా యిట్లు పలుకుచున్నది.

"పద్మారి బొందంగ బాల! భావించితే
పసయుమా శిశురూపు తోచెవ్వనికను
తిరుగేంద్రు బట్టె యోతనయ! భావించితే
పరగుమా హరిమూర్తి బావయుకును
కుముద బాంధవునంద కుఱ్ఱ! భావించితే
తివరుమా బుధలీల జనకుడగును
దోష్టాబిలిపంద బిడ్డ! భావించితే
దత్తుండె వరునంతిఁ దమ్ముడగును
సూటి నీగాపముల నెల్ల మాటుజేసి
ప్రాకృతిని వోలె నేను నీ పలుకులేల
నిక్కముగు రూపమును బొందనీక రేల?
కుముదబాంధవు నో పుత్ర! కోర్కె సేయ."

స్తుతిగర్భోపాలంభములో గూడిన ఈ సూర్యోదయావర్ణన హృదయంగమము.

సూర్యోదయ మకుట పద్యములు పరిఢవిల్లినవి—కలవలు కొంతి దొలగినవి. ఈ సుఖదుఃఖముల తారతమ్యమేల? ప్రజాపతి సృష్టియందీపక్షపాతమేమి?—కవయిత్రి కారణము చెప్పుచున్నది.

సీ॥ తనజన్మభూమియౌ దమ్మియౌటను బ్రహ్మ
కమలంబులకు మేలు కలిపినాడు
తనతల్లి నిలయంబు తామరసంబౌట
నలినోత్సవంబులోదలచినాడు
తండ్రి కరమున దమ్ముల జతయుంట
చెందొగలకు వాడి జెరచినాడు
తనతమ్ము శాణముల్ వనజంబు లౌటను
వాసినో మవకింత జేసినాడు.
సారసంబుల కిల మేలు గోరినాడు
కుముద చయములకును హాని గూర్చినాడు
విభుని మేనల్లుడయ్యు దివిమలుడయ్యుఁ
దమ్మిమాలియు వాయంబు దప్పినాడు"—

సీతారామ కళ్యాణము:—

హేలా భగ్న విశాల కార్ముకముతో
హేలి ప్రభారాశితో
గాలాంభోధర తుల్య దేహరుచితో
గాంచీకలాపంబుతో
లీలాలోకన విస్మితాఖిల నృపా
లేంద్రాది సంఘంబుతో
దా లేనవ్వు చెలంగ రాముడు సభా
స్థానంబునం దోప్పగాన్.

కలిత వినూత్న హేమమయ
కంకణ రత్న విచిత్ర భూషయై
సలలిత వక్త్ర తామరస
సంపదమై సనుదించి ప్రీతి న
న్నలినదళాక్షు కంఠమున
నవ్యమధూక సుపుష్పమాలికన్
సులలిత పాణి నై చెను
విశుద్ధపు గన్నుల లజ్జ గేరగా.

..........................

సౌభాగ్య సర్వార్థ సామ్రాజ్య వైభవ
శ్రీయుత మంగళ దాయకములు
పంచమహాక్లేశ బ్రహ్మహత్యా నేక
దారిద్ర్య దుఃఖ విదారణములు
రావి మహాలక్ష్మి రామమూర్త్యాత్మజ
బాల సీతా వన భాసురములు
గరుడ గంధర్వ కింపురుష చారణసిద్ధ
ఋషిజన బ్రహ్మాది పూజితములు
భవ్య మునిలోక హృదయ విభాసితములు
ఘన సుభిక్షాఘ నీతి సత్కల్పకములు
రామచంద్రుని చరణముల్ రాజితముగ
బాలవంబుగ జనకుండు నీటగడగె.

రచయిత్రి హృదయము ఆహ్లాదముతో నిండినపుడు కుసుమ గుచ్ఛములను విసరినట్లు సమాస గుచ్ఛములను పరంపరముగా విసరివేసింది. కవితా సామ్రాజ్ఞిగా పట్టాభిషేకం పొందటానికి తగిన శక్తులిచ్చి పరమేశ్వరుడు ఈమెకు దీర్ఘాయువు నివ్వకపోవటం విచారకరం. ఈ మధురవాణి కలకూజితం ఇక మనకు వినిపించదు.

తె. సూ.

# స్వీకారము

మన లిపి పుట్టుపూర్వోత్తరములు: రచన: శ్రీ తిరుమల రామచంద్ర: ప్రచురణ: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2. వెల రు. 3-50.

ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజం: రచన: కీ. శే. గిడుగు వెంకటరామమూర్తి పంతులు; ప్రచురణ: విశాలాంధ్ర ప్రచురణాలయము. విజయవాడ-2. వెల రు. 2-50.



రసవాహిని: ఖండకావ్యసంపుటి: రచన: శ్రీ పి. వి. యల్. వి. ప్రసాదరావు. ఆంధ్రశాఖ, హిందూ కళాశాల, గుంటూరు; వెల రు. 1 50.

మహాభాస్కరీయము: ఖగోళశాస్త్రము. భాస్కరాచార్య ప్రణీతము. గోవిందస్వామి, పరమేశ్వరుని 'సిద్ధాంత ప్రదీపికా' భాష్యములతో సహా: ప్రచురణ: మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత భాండాగారము: మద్రాసు వెల రు 11

అహల్యాగౌతమము: పద్యకావ్యము. రచన: శ్రీ బులుసు వెంకటేశ్వరులు, తృతీయ ముద్రణము: ప్రాప్తిస్థానము: బి వి. అండ్ సన్సు రామారావుపేట కాకినాడ వెల: 2-0-0

ముద్రారాక్షసము: విశాఖదత్త కృతికి అనువాదం: అనువాదకులు: అవధానము చంద్రశేఖరశర్మ. ప్రాప్తిస్థానము: శ్రీ కె. వి. సుబ్రహ్మణ్యముగారు; సాహితీ సామ్రాజ్యము. పోరుమామిళ్ల, కడపజిల్లా, వెల రు 2-50

ముముక్షుజన గ్రంథమాల ప్రచురణలు: శ్రీ సీతారామయతీంద్రుల రచనలు: ప్రాప్తిస్థానము, కృష్ణాశ్రమము పెదముత్తేవి (పోస్టు) కృష్ణాజిల్లా (1) యతిగీతలు రు 0-12-0 (2) యతీంద్ర ఉపదేశములు రు 0-8

శేషీప్రచురణలు: పవరుపేట, ఏలూరు (1) శరణాగతిగీత ఒక ప్రతి-7 నయాపైసలు: (2) నావహావ గ్రంథము కీవి ఉపకారకర్-10 నయాపైసలు. (3) రాసలీలా రహస్యము శ్రీ సీతారామయతీంద్రులు-8 నయాపైసలు (4) గీతమంటే యేమిటి?-ముక్తివి ఉపాయకర్ రు 0-50.

వడీన్యాపారి భార్య డాస్టవిస్కీ రచించిన 'ఇడియట్' అనే నవలకు అనువాదం: అనువాదకులు: శ్రీ ఆలూరి భుజంగరావు; ప్రచురణ: జనసాహితి తెనాలి. వెల రు. 0-8-0.

నాఘామి: నాటకము మల్లాది వెంకట సూర్యనారాయణ (కవిశ్రీ): ప్రాప్తిస్థానము: రచయిత, కోనమూరు (పోస్టు) భీమవరం తాలూకా, పశ్చిమ గోదావరిజిల్లా వెల రు. 1-4-0.

మానవరాజ్యాంగం: రచన: శ్రీ దాసు త్రివిక్రమరావు ప్రకాశకులు: దాసు నరసింహారావు, మానేజర్, నాగరా ప్రకాశన, హైదరాబాదు; అమూల్యం.

బుద్ధభగవానుడు: ధర్మానంద కోశాంబిగారి రచనకు అనువాదం; అనువాదకులు: శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు; సాహిత్య ఎకాడమీ తరఫున కడప విద్యోదయా పబ్లికేషన్సువారిచే ప్రచురింపబడినది; వెల రు. 6-0-0.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.

# అమృతాంజనము

...ఏనుగు తలనొప్పుల'నుకూడా

క్షణంలో ఉపశమింపచేస్తుంది



లక్షలాది ప్రజలు 1893 నుంచి దేశమంతటా అమృతాంజనాన్ని వాడుతున్నారు. అమృతాంజనము బెణుకులు, వాపులు, తలనొప్పి, పక్కపోటు, జలుబులు, దగ్గులు మొదలైన వాటిని ఉపశమింపచేస్తుంది.

అమృతాంజనము అన్ని నొప్పులకు దివ్యామృతము.






అమృతాంజన్ లిమిటెడ్,
మద్రాసు-4, బొంబాయి-1, కలకత్తా-7.

ప్రతి ఆదివారం రాత్రి 6-80 గం॥ లకు 41 మీటర్లమీద రేడియో సిలోన్‌లో దక్షిణ భారతభాషల్లో వెలువడే ప్రోత్సాహిత కళాకారుల ప్రోగ్రామ్, అమృతాంజనం వినండి.